పాఠకులకు

జ్యోతి ఫిబ్రవరి 1977 సంచికతో

అందిస్తున్న

పూర్తి నవల



# నీటిబొట్లు

...వి.బి.రామారావు

"నాన్నా! నాన్నా!"

బడినుంచి వచ్చి కాళ్లు కడుక్కోడానికి పెరట్లోకి వెళ్ళిన కిరణ్ కేకేశాడు.

"ఏరా?" విసుగ్గా అడిగాడు శ్రీనాధ్, ఎండలోంచి తెచ్చిన బట్టలన్నీ మడతలు పెడుతూ.

"అమ్మ ఎప్పుడొస్తుంది నాన్నా?"

"వస్తుందిలే. మామ్మ టిఫిన్ పెడుతుంది వెళ్ళు."

శ్రీనాధ్ పుస్తకం పట్టుకుని వెళ్ళి పడకకుర్చీలో కూలబడ్డాడు. ఇంకో గంట చూసి రీడింగ్‌రూమ్‌కి పోవడం మేలు.

"అబ్బాయ్!" లోపలనుంచి హైమవతమ్మ పిలిచింది.

"ఏంవమ్మా?" తనూ వంటింట్లోకి వెళ్ళాడు శ్రీనాథ్.

"ఏమీలేదు...." కిరణ్ భయంభయంగా తండ్రివైపు చూశాడు.

"ఏం లేకపోతే ఎందుకు పిలిచావ్" ఎంత విసుక్కోకూడదనుకున్నా విసుక్కోకుండా వుండలేకపోయాడు.

"మరేం లేదురా....రాత్రికి కూర...."

"కాదు నాన్నా, మామ్మ నాకంటె భయపడిపోతోంది. పక్కవాళ్ళ ప్రభాకర్, శశివాళ్ళ పెద్దన్నయ్యతో ముత్యాల ముగ్గుకు వెళుతున్నారట. నేనూ వెళ్తా నాన్నా. రెండురూపాయలివ్వవూ?"

"సరే వెళ్ళు" లోపలికి వెళ్ళి డ్రాయరు సొరుగులో వున్న నాలుగు అర్ధరూపాయలు తీసుకొచ్చి ఇచ్చాడు.

"అమ్మ ఏమీ అనదు కదూ!"

మనసు చివుక్కుమంది శ్రీనాధ్‌కి.

"లేదులే, నే చెబుతాగా" మామ్మ ధైర్యం చెప్పింది. "రాత్రి పదవుతుంది. ఇంత మజ్జిగ అన్నం తినేసి పో. ఇంటికొచ్చి పడుకోవచ్చు."

"వచ్చి తింటాలేవే" ఎగురుకొంటూ వెళ్ళిపోయాడు కిరణ్.

హైమవతమ్మ బియ్యం కడగటానికి బుట్టలోకి కొలిచింది.

కాలం ఒకలా వుండదు. ఎవరనుకున్నారిలా అవుతుందని. భర్త వున్న రోజుల్లో దర్జాగా కాలుమీద కాలు వేసుకుని

తరాలు తిన్నా తరగనంత ఆస్తిపాస్తులతో లక్షణంగా వుండేవారు. చివరికేం మిగిలింది?

ఆస్తి కరిగిపోయింది. కూచుని తింటే కొండలు కరుగుతా యంటారు.

తను వద్దంటూనే వుంది. ఎదురింటి మహాలక్ష్మమ్మ భర్త ఆసుపత్రిలో వున్నాడు. చేసేది గుమాస్తా ఉద్యోగం. నాలుగు నెలలు జీతం లేకుండా ఆస్పత్రిలో వుండడమంటే మాటలా!? పాటివాళ్ళు కదా అని దగ్గరకొచ్చి గోడు పెట్టుకుంది. రెండు వందలు సర్దమని. వడ్డీ వ్యాపారులంటే అందరికీ చులకనే. కాని. అదునుకి ఆదుకునేదీ, ప్రజలచేత ఈసడింపబడేదీ వీళ్ళే.

మహాలక్ష్మమ్మ బ్రతిమలాడింది. తన నేరం లేకుండా భర్త పాండురంగారావ్‌తో చెప్పింది హైమవతమ్మ.

తాకట్టుకి వస్తువు లేకుండా అప్పు ఇవ్వడం తనకు అలవాటు లేని పని అన్నాడు. తనెంత చిన్నబోయిందనీ. తాకట్టుకి వస్తువే వుంటే అది తెగనమ్ముకునేది ఆత్మాభిమానం వున్న మహాలక్ష్మమ్మ.

ఓ పూటంతా ఆలోచించింది ఆమెకు ఏం సమాధానం చెప్పడమా అని. పోనీ భర్తకు తెలియకుండా తన దగ్గరున్న నూటయాభై ఇస్తే?

అమ్మో. ఆయనగారికి తెలిస్తే ఇంకేమైనా వుందా?

చొరవ చేయలేకపోయింది హైమవతమ్మ. సాయంత్రానికి మహాలక్ష్మమ్మ వచ్చింది. కొంతసేపు ఆ మాటా ఈ మాటా ఆడి అసలు విషయం బయటపెట్టింది. 'వస్తువేమైనా వుంటే' అంటూ నసిగింది తను. పాతికేళ్ళ స్నేహం తెగతెంపులు చేస్తుందని.

"అవునే హైమా. ఎవరి జాగ్రత్త వాళ్ళకుండడం న్యాయమే. ఇంటికి వెళ్ళి అబ్బాయిచేత వస్తువు పంపిస్తాను. డబ్బు పంపించు."

బొట్టు పెట్టించుకుని వెళ్ళిపోయింది మహాలక్ష్మమ్మ.

ఆ సాయంకాలం మహాలక్ష్మమ్మ కొడుకు వచ్చాడు.

"అత్తయ్యా. అమ్మ నీకు ఇయ్యమంది."

చేతిలో చేతితో పట్టుకొచ్చిన కాగితం పొట్లం అందించాడు.

హైమవతమ్మ కాగితం విప్పి చూసేసరికి కళ్ళు తిరిగినట్టయింది.

మహాలక్ష్మమ్మ పుస్తెలు.

కాగితంతోనే యిచ్చి "మామయ్యగారు గదిలో వుంటారు. తీసుకెళ్ళు" అని అతన్ని పంపించేసి దేవుడిదగ్గర దీపం వెలిగించింది. ఠక్కున మీదనున్న ట్యూబ్‌లైట్ ఆరిపోయింది. పూజ చేస్తుండగా పాండురంగారావ్‌గారు లోపలికొచ్చారు.

"పూజయిందా. టెలిగ్రాం వచ్చింది. మీ అన్నయ్య దగ్గర నుంచి. పెళ్ళికి పిల్లలను ఒప్పించారట! నే చెప్పలేదూ. మనవాడికేం తక్కువ? ఎస్సెల్సీ పోయింది కాని. ఈ పాటికి యూనివర్సిటీ చదువు పూర్తయ్యేదే కదూ! అయితేనేం నాలుగు తరాలు తిన్నా తరగని డబ్బు. వాడికేం లోటు? ఎలాగైనా మీ అన్నయ్య తెలివైనవాడు. దానికి మాత్రం ఏం తీపి దిగేసిందా? కోరినంత బంగారం. చదువు కున్నందుకు తెలివితేటలున్నాయి. అదే చాలు. ముహూర్తం పెట్టించి మళ్ళీ రాస్తానన్నాడు. సిరిగాడూ, జ్యోతీ ఒకరికొకరు తెలియనివాళ్ళు కాదు."

మనసులోని ఆలోచనల నన్నింటినీ గడగడా బయటికి మాటా డేస్తున్న భర్తవైపు చూసి. మహాలక్ష్మమ్మ కొడుక్కి డబ్బిచ్చారా అని అడుగుదామనుకుని కొడుకు పెళ్ళిధ్యాసలో చటుక్కున మరిచి పోయింది.

బి.యస్.సీ. ప్యాసయిన హైమవతమ్మ మేనకోడలు జ్యోతితో శ్రీనాథ్‌కి ముచ్చటగా పెళ్ళి జరిగిపోయింది.

తన కోడలు కాపురానికి వచ్చిన మూడోరోజునే మహాలక్ష్మమ్మ భర్త ఆస్పత్రిలో పోయాడు.

హైమవతమ్మకి మహాలక్ష్మమ్మ పుస్తెలు గుర్తొచ్చాయి. ఆ రోజే మహాలక్ష్మమ్మ కొడుకు మరో వంద ఇయ్యమని వచ్చాడు. తల్లి మాంగల్యాన్ని తెగనమ్మి బాకీ తీర్చమన్నాడు పాండురంగారావ్.

మరుసటిరోజే కొంప మునిగింది.

లైసెన్స్ లేకుండా వడ్డీవ్యాపారం చెయ్యడం నేరమని హైమవతమ్మకి ఆ రోజువరకూ తెలియదు.

తెల్లవారేసరికి ఆరుగురు మనుషులొచ్చారు ఇంటికి. ఇల్లంతా సోదాచేసి సుమారు ఐదు కేజీల బంగారం, ఎనభై మూడు ప్రామిసరీ నోట్లూ, ఇంకా తాకట్టుపట్టిన వెండిసామానూ అంతా గోతాలకెత్తి సీళ్ళు వేసేశారు.

సీళ్ళు వేస్తుండగానే పాండురంగారావ్ నేల కొరిగాడు. అపస్మారకంలో ఆయన జీవితం అంతమైంది.

వ్యవహారాలన్నీ అన్నయ్య ప్రకాశరావే చూసుకున్నాడు. చేస్తున్న వ్యాపారంపై వస్తున్న లాభం గత పదిహేనేళ్ళదీ ఫలానా ఇంత వుంటుందని నిర్ణయింపబడడమూ, దానిమీద పన్ను కట్టాలన్న విషయం స్పష్టం చెయ్యడమూ జరిగిపోయింది. ఆస్తి సర్వస్వం నాశనమైపోయింది.

మహాలక్ష్మమ్మ జ్ఞాపకం వచ్చింది మళ్ళీ. మరి ఆలోచించ లేదు హైమవతమ్మ.

కొత్తతరహా బ్రతుక్కి అలవాటు పడిపోయింది.

జరీచీరలు చిరిగిపోయాయి. సాదా తెల్లచీరలూ, మల్లుబట్టా, సైను ముక్కా అలా అలా దిగజారిపోయింది ఆమె తాహతు.

కోడలికి ఉద్యోగం వేయించారు తెలిసినవాళ్ళు. విశాఖపట్నంలో కొత్త మకాం. సంవత్సరం తిరగకుండా భర్త మరో అవతారం ఎత్తినందుకు తన విచారాన్ని మరిచిపోయింది హైమవతమ్మ.

కిరణ్ పుట్టిన తరవాత సంసారం మళ్ళీ ఓ రాస్తాలో పడింది. కోడలు బ్యాంకులో ఉద్యోగం చేస్తోంది. కొడుకు శ్రీనాథ్ ఆలోచించి ఆలోచించి తమ కుటుంబానికి వచ్చిన సంకట స్థితి ఏ విధంగానూ తీర్చలేక, ఖరీదైన అలవాట్లు ఒకవంక అతి కష్టంతో మరిచిపోతూ, కొత్తగా సంప్రాప్తించిన బ్రతుకు అలవాటు చేసుకుని పరిస్థితులతో రాజీపడ్డాడు.

శ్రీనాథ్‌కి జ్యోతి మరీమరీ చెప్పింది, ప్రయివేటుగా మెట్రిక్ పూర్తి చేసుకోమని. చెప్పిచెప్పి విసుగెత్తిపోయింది.

కొడుకు పిడికిటిమీద బుగ్గపెట్టుకుని కుర్చీలో కూచుంటే హైమవతమ్మకు ఎలాగో వుంటుంది.

కలిగిన కష్టాలను పునరావలోకనం చేసుకుంటూ బియ్యం కడిగి పొయ్యిమీద పెట్టి సావిట్లోకి వచ్చింది హైమవతమ్మ.

ఎనిమిదవుతున్నా జ్యోతి రాలేదు.

"ఎక్కడికెళ్ళిందో ఏమో, ఎనిమిదయిపోయింది."

"నే వెళ్ళి తీసుకురానా?"

"చూద్దాం ఉండు మరి కాసేపు చూద్దాం" కొడుకు మాటల్లో వ్యంగ్యం తల్లికి అర్థమైనట్టులేదు.

"రా నీకు వడ్డిస్తా" శ్రీనాథ్ మౌనాన్ని, నిశ్శబ్దతనీ ఛేల్చడానికి మరో ప్రయత్నం.

కుర్చీలోంచి లేచాడు.

బయట కారు చప్పుడూ, తలుపు దఢేలున వేసిన చప్పుడూ అయిన మరో క్షణంలో జ్యోతి ఉస్సురనుకుంటూ లోపలికొచ్చింది.

"బాబీ ఏడీ?"

"......"

"అత్తయ్యా, బాబీ ఏడీ?"

"పక్కవాళ్ళ పిల్లలతో సినిమాకు వెళ్ళాడు. వాళ్ళ నాన్న డబ్బులిచ్చాడు."

'నా బొంద, నేనేం ఆర్జించి చస్తున్నాను కనకనా, నేను డబ్బు లివ్వడమేమిటి? ఇంటి ఖర్చుకని ఉంచిన చిల్లరతో కొడుకు కోరిక తీర్చడానికి సాహసించానంతే!' బయటికి అనదలచుకున్న మాటలు పెదవి దాటబోయి వంటింటినుంచి వస్తున్న సెగలో వేడి నిట్టూర్పుగా కలిసిపోయాయి.

"ఆలస్యం అయింది అత్తయ్యా, ఎంత పనిచేసినా తరగదు, ఇంకా ఉంటుంది. అదీ గుమాస్తా పనికి ఇవ్వవలచిన నిర్వచనం."

రెండో వాక్యం జ్యోతి మనసులోకిమళ్ళీ ఆలోచనగా వచ్చింది. శ్రీనాథ్ నిట్టూర్పు గుర్తించి మాటాడకుండా పెరట్లోకి వెళ్ళిపోయింది.

మొహం తుడుచుకుంటూ వచ్చి లోపలికెళ్ళి ఇంత పౌడరు రాసుకుని బొట్టుపెట్టుకుంది జ్యోతి.

"పదింటికి తిన్నావ్ రెండు మెతుకులు, రా అమ్మా వడ్డిస్తా."

"మీరు భోజనం చేశారా?"

"........"

ఉద్యోగం సద్యోగం లేనివాడిని నీ కంటె నాకు ముందు తిండెలా వస్తుంది. వస్తేమాత్రం కించిత్ లజ్జైనా లేకుండా ఎలా తింటానూ? శ్రీనాథ్ ఆలోచన.

"అత్తయ్యా, ఆయన భోజనం చెయ్యలేదా?"

"లేదమ్మా. పిలిస్తే కలుసుకుంటాడని ఊరుకున్నా."

"మీరు పలహారం కానివ్వండత్తయ్యా. మేం ఇద్దరం కలిసి పెట్టుకుంటాం."

గదిలోకి వచ్చి మంచంమీద సాగోరింది జ్యోతి. శ్రీనాథ్ చటుక్కున సావిట్లోకి వెళ్ళాడు.

"వెళ్ళి అన్నాలు తినండీ ఇంకెందుకూ ఆలస్యం?" పలహారం చేసివచ్చిన హైమవతమ్మ కోడల్ని హెచ్చరించింది.

"ఏమండీ, లేవండీ. అన్నం చల్లారిపోతుంది."

అతి విధేయుడిలా వెంటనే లేచి నుంచున్నాడు శ్రీనాథ్.

అతని ప్రతి కదలికలోనూ, ప్రతి నిశ్శబ్దంలోనూ, మౌనం లోనూ ఏదో వెక్కిరించినట్టు కనపడుతుంది జ్యోతికి.

వంటింట్లో పీట వేసుకుని కూచున్నాడు. జ్యోతి వడ్డిస్తోంది.

"నెయ్యి వేశా, కలుపుకోండి."

"........"

"ఏమిటండీ ఆలోచన?"

"........" ఇంక అన్నం ముందుకు తీసి కలుపుకున్నాడు. తల దించుకుని మౌనంగా భోజనం కానిస్తున్నాడు శ్రీనాథ్.

"యింకాస్త కూర వెయ్యనా?"

"........"

ఏ ప్రశ్నకూ బదులు పలకలేదు శ్రీనాథ్. త్వరగా భోజనం ముగించి పెరట్లో చెయ్యి కడుక్కుని సావిట్లో కుర్చీలో మళ్ళీ కూల బడ్డాడు శ్రీనాథ్.

ఎంగిళ్ళూ, ఏంమాలూ చూసుకుని ఇల్లంతా సర్ది మరోసారి

ముఖం కడుక్కుని మెల్లగా గదిలోకి వెళ్ళింది జ్యోతి.

కారు శబ్దం గురించే ఆలోచిస్తున్న శ్రీనాథ్ జ్యోతి ముస్తాబు చూడనేలేదు.

"నే పడుకుంటున్నా."

గదిలో దీపం ఆరిపోయింది.

మరో అరగంటకి కిరణ్ తలుపు పిలిచాడు.

"అమ్మ వచ్చిందా?" ఇంట్లోకి రాగానే అడిగాడు.

"నిద్రపోతోంది."

లైటు ఆర్పి మంచంమీద వాలాడు శ్రీనాథ్. కాసేపు సినిమా కబుర్లు చెప్పి నిద్రలోకి జారాడు కిరణ్.

శ్రీనాథ్‌కి నిద్రరావడం లేదు. పగలంతా పడకే మళ్ళీ రాత్రి నిద్ర ఎలా వస్తుంది?

లేచ లైటువేసి పుస్తకం తీసుకుంటే?

అలమారులో పుస్తకం ఏమీ దొరకలేదు.

వంటింట్లోకి వెళ్ళి గ్లాసుడు నీళ్ళు తాగి తల్లి భాగవతం తీసుకున్నాడు. రెండు పద్యాలుకూడా చదవలేదు.

"టెలిగ్రాం సార్!" కేక వినిపించింది తలుపు చప్పుడుతో పాటు.

టెలిగ్రాం అన్నమాట వినగానే హైమవతమ్మ తలుపు తీసింది. శ్రీనాథ్ టెలిగ్రాం అందుకున్నాడు. మనసులో చదువుకున్నాడు ముందు.

'కామాక్షి అన్ వెల్. ఎ రైవింగ్ టుమారో కామేశ్వర్రావ్.'

"ఎక్కడ నుంచిరా? బెజవాడనుంచా?"

కొంచెంసేపు ఆగి చెప్పాడు: "విజయనగరం నుంచి. కామాక్షికి ఒంట్లో బాగులేదట. రేపు తీసుకొస్తాడట. కామేశ్వర్రావ్. ఇచ్చాడు."

"సుస్తీ ఏమిటో?"

"రేపు తెలుస్తుందిగా! కంగారుపడకు. పడుకో."

"ఏమిటత్తయ్యగారూ?"

"పెలిగ్రాం అంటేనూ...." కోడలికి చెప్పింది హైమ వతమ్మ. అంత హఠాత్తుగా ఏం వచ్చింది చెప్మా అనుకుంది జ్యోతి.

## 2

తెల్లవారి మరో రోజు మొదలైంది శ్రీనాథ్‌కి.

మొదటి బస్సులోనే బయలుదేరిన కామాక్షీ, కామేశ్వర్రావూ ఎనిమిదింటికల్లా వచ్చారు.

రిక్షా ఆగగానే శ్రీనాథ్ వెళ్ళి నాలుగేళ్ళ కామాక్షి కొడుకుని అందుకున్నాడు.

"రావే కామాక్షీ! ఏమిటలా అయిపోయావ్?" హైమవతమ్మ పలకరించింది.

కామేశ్వర్రావ్ శ్రీనాథ్‌కి చెప్పాడు. విజయనగరంలో లేడీ డాక్టర్ కామాక్షిని విశాఖపట్నం ఆస్పత్రిలో జాయిన్ చెయ్య మన్నట్టు.

ముందు కాఫీలు అందించింది హైమవతమ్మ. తాపీగా విషయం అవగాహన చేసుకుంది.

మరో అరగంటలో కామాక్షిని ఆస్పత్రికి తీసుకెళ్లారు. గైనిక్ వార్డ్‌లో డాక్టర్ రెడ్డి గది ముందు బల్లమీద కూచున్నారు కామాక్షీ, కామేశ్వర్రావ్, శ్రీనాథ్.

డాక్టర్ రౌండ్సునుంచి రాగానే చొరవచేసుకుని లోపలికి వెళ్ళి విజయనగరం డాక్టరిచ్చిన ఉత్తరం ఇచ్చాడు శ్రీనాథ్. ఆమె ఉత్తరం చదువుకుని పేషెంటుని తీసుకురమ్మంది.

కామాక్షిని కోచ్‌వరకూ తీసుకెళ్ళి పడుకోబెట్టి వచ్చేశాడు మగాళ్ళిద్దరూ.

"డాక్టరమ్మగారు పిలుస్తున్నారు." సిస్టర్ బయటికి వచ్చి చెప్పింది పది నిమిషాల తర్వాత.

"ఈమె భర్త ఎవరు?" ఇద్దరివంకా చూసి అడిగింది డాక్టర్ రెడ్డి వాళ్ళు లోపలికి వెళ్ళగానే.

కామేశ్వర్రావ్ ముందుకు వెళ్ళాడు.

"ఈమె కదలకూడదు. ఓ వారం రోజులపాటు ఆస్పత్రిలో

ఉండవలసివుంటుంది."

"అక్కడ డాక్టరుగారు చెప్పారు. అంతా మీ దయ. నేను మళ్ళీ దర్శనం చేసుకుంటాను."

జేబులోంచి కవరు తీసి ఇచ్చాడు డాక్టరమ్మకి.

ఓ మారు అతనివైపు చూసి పర్సులో పెట్టేసుకుంది కవరు.

రెండో రోజు సాయంకాలం కామాక్షికి ఇంకేం భయంలేదని చెప్పాడు.

మరుసటి రోజు ఇంక శెలవ్‌లేదని చెప్పి కామేశ్వర్రావ్ బస్సు ఎక్కేశాడు.

ఆపరేషన్ అయిన సాయంకాలం జ్యోతి ఆస్పత్రికి వెళ్ళినా మాటాడే స్థితిలో లేదు కామాక్షి. మనిషి తెల్లగా పాలిపోయింది. తెల్లటి తలగడమీద ఒక్క జుట్టే కనబడుతోంది.

భయంవేసింది చెల్లెల్ని చూసిన జ్యోతికి.

తనకంటె నాలుగేళ్ళు చిన్న. అప్పుడే ఎంత పెద్దదై పోయింది. అంత ఘోరమైన జబ్బేమిటో డాక్టరు నడగాలనుకుంది.

తరవాత రెండు రోజులు జ్యోతికి ఆస్పత్రికి రావడానికే వీలవలేదు. ఆ రోజు సాయంకాలం నాలుగున్నరకే బయలుదేరి ఆస్పత్రికి వెళ్ళింది. అప్ ఎక్కుతూవుంటే ఆయాసం అనిపించింది.

జీవితంలోని నిమ్నోన్నతాలకు సంకేతం విశాఖపట్నం రోడ్లు. మనసులో ఈ వాక్యానికి మెరుగులు దిద్దడానికి ప్రయత్నంచేస్తూ గైనిక్ వార్డులోకి వెళ్ళింది.

బెడ్‌మీద కూచుని వుంది కామాక్షి.

"ఏమే? అసలు వచ్చి చూడడానికి కూడా తీరిక లేదా?"

"ఆఫీసు పనితోనే సరిపోతోంది. ఇంటికొచ్చేసరికి ఏడున్నరా, ఎనిమిదీ అవుతోంది....ఉద్యోగం చెయ్యడమంటే...."

"బావుంది. కూచో."

"నువ్వింకా ఎన్ని రోజు లుండాలట?"

"మూడు రోజులు. సిస్టర్! మీరు అనుమతిస్తే అలా వెళ్ళి ఆ సిమెంటు దిమ్మమీద కూచోవాలని వుంది." వార్డులో తిరుగుతున్న

సిస్టర్‌ను అడిగింది.

"మెల్లగా నడచి వెళ్ళండి. ఫ్రెష్ ఎయిర్ మంచిదే. చదువు కున్న మీలాంటివాళ్ళతో మాకు ట్రబుల్ వుండదు."

ఇద్దరూ బయటకు వెళ్ళి సిమెంటు దిమ్మమీద కూచున్నారు.

పర్స్‌లోంచి చాకలెట్లు తీసింది జ్యోతి.

"నిన్నామొన్నా వీటికోసం దెబ్బలాడుకున్నట్టే వుంది. అప్పుడే ఎంత పెద్దవాళ్ళమైపోయాం!"

"పెద్దవాళ్ళమవడంలో వింత లేదు. మన పరిస్థితులు మనల్ని ముసలివాళ్ళను చేస్తున్నాయ్. ఇంతకీ నీ ఒంట్లో ఏమిటి సుస్తీ? ఆ రోజు అడగడానికి వీలుచిక్కలేదు. అత్తయ్య నడిగితే తనకూ తెలియనట్టు ఊరుకుంది."

"ఆఁ, ఏం లేదు, చిన్న పొరపాటు...."

"అంటే?"

"మరేం లేదు. ఆయనతో ఎన్నోసార్లు చెప్పాను. మరో బిడ్డ కావాలనుకోడం మా కుటుంబ స్థితిలో ఆలోచించవలసినదేనని. 'ఓస్' అనేశారు. తీరా మూడు నెలలయ్యాక నేనే ధైర్యం చేశాను. ఎదురింటావిడ ఏదో మందు ఇస్తానని చెప్పింది. దానితో విపరీతమైన నీరసం. కొన్ని గంటలకంట దాచలేకపోయాను బాధని. డాక్టరు విశాఖపట్నం పెద్దాసుపత్రికి తీసుకెళ్ళాలంటే ఎచ్చేశాం." బోసిమెడ తడుముకుంటూ చెప్పింది కామాక్షి.

కనుచీకటి పడుతోంది.

"ఎంత పని చేశావ్ కామాక్షీ!"

"మరేం చెయ్యమనక్కా! మనం బ్రతకడానికే ఈడిగిలబడు తున్న ఈ పరిస్థితుల్లోకి మరో జీవిని ఏమని తీసుకురాగలను? నేను చేసిన పని తప్పని నేననుకోడంలేదు. ఈ ప్రపంచంలో పుట్టి సాధించే దేమిటి? అసలు పిల్లల్ని కనే అర్హత అందరికీ ఉండదని, ఉండకూడ దని నా నమ్మకం. ముద్దూముచ్చటా తీర్చలేని తల్లిదండ్రులు కేవలం పిల్లల్ని కనిపారేయడం ఎందుకు?"

"అంత బాధపడుతున్నారా డబ్బుకి, కామేశ్వర్రావ్‌కి ఐదొం

దలు రావూ?"

"వస్తయ్. కాని ఏం లాభం?"

"పోనీలే కామాక్షీ! అవన్నీ ఇప్పుడెందుకు? ఇకనైనా జాగ్రత్తగా ఏ మాత్రలో వేసుకోడం మంచిది."

"ఆc, మాత్రలు మాత్రం చవకా?"

"పోనీ ఆపరేషన్...."

"అది ఆయనకు బొత్తిగా ఇష్టంలేదు."

జ్యోతి ఆ విషయం అక్కడికి వదిలేయదలచుకుని అంది "అమ్మకి నీ ఆరోగ్యం విషయం రాశావా?"

"లేదక్కా! రాసి ఏం ప్రయోజనం? వాళ్ళు రావాలంటే ఖర్చు, శ్రమ. నువ్ నన్ను సమయానికి ఆదుకున్నావ్ అంతే చాలు."

"బావుందే! పైవాళ్ళమా?"

"నువ్వు ఓ పని చేసిపెడుదూ! బావచేత మీ మరిదికి ఆపరేషన్ చేయించుకోమని చెప్పిద్దూ!"

"సరి. ఆయనగారికి అసలు గిట్టవు అలాంటివి. చెప్పలేం కామాక్షీ! నా జాగ్రత్తలు నేను తీసుకుంటున్నా. నిజంగా దొంగతనం చెయ్యడమంటే ఎంత కష్టమో నాకు ఇప్పుడు తెలుస్తోంది. మా బ్యాంకు...." ఠక్కున ఆగిపోయింది జ్యోతి.

"పోనీలే అవన్నీ ఎందుకు? బావ అదోలా ఉంటున్నట్టుంది. ఏమైనా మాటామాటా అనుకున్నారా?"

"ఏం అనుకోలేదు—కాని ఎందుకో తప్పుకుతిరుగుతున్నారు. నాకు అటు ఉద్యోగం....ఇటు ఇంట్లో...."

మాట్లాడుతుండగానే "ఇంజక్షన్ తీసుకోవాలి రండి." సిస్టర్ బయటకు వచ్చి పిల్చింది.

మళ్ళీ వస్తానని జ్యోతి ఇంటిముఖం పట్టింది.

శ్రీనాథ్‌కి చేతినిండా పని. ఇటు ఇల్లు చూసుకోవడం, బజారు పనులూ, అటు ఆస్పత్రికి క్యారియర్ తీసుకెళ్ళడం, కామాక్షికి కాఫీ ఫలహారాలు పట్టుకెళ్ళడం, అన్నీ శ్రీనాధ్ వంతే అయ్యాయి.

కామేశ్వర్రావ్ వెళ్ళిపోతానన్నప్పుడు మరో రెండు రోజులు

ఉండమన్నాడు శ్రీనాథ్.

"శెలవులేదన్నయ్యగారూ! ఉన్నా ఇవ్వరు. ఈ బాధలు మీకేం తెలుస్తాయి?"

అతని జవాబు గుచ్చుకుంది శ్రీనాథ్‌కి.

"బావా! మీకందరికీ చాలా శ్రమ ఇచ్చాను." ఆస్పత్రికెళ్ళి నప్పుడొకసారి అంది కామాక్షి.

"మంచిదానివే! అదేమిటలా మాటాడుతున్నావ్?"

"లేదు బావా! చేజేతులా చేసుకున్నాను. వ్యక్తి తన బాధ్యత లను కాదని, హక్కులనూ, ఆనందాలనూ కోరుకుంటూపోతే వచ్చే విషపరిణామాలే ఇవి."

"ఏమిటి నువ్వంటున్నది?"

"నేను తల్లిని కాబోతున్నానని తెలిసి మూర్ఖపు పని చేశా. చేసిన పాపానికి శిక్ష అనుభవిస్తున్నాను. నేనంటే ప్రాణం పెట్టే మనిషివి నీతో చెప్పకుండా ఉండలేకపోయాను. బావా! అక్క అదోలా ఉంటోంది ఎందుకని? నేను ఆస్పత్రికి వచ్చాక ఒకేసారి వచ్చి చూసింది. అసలు మీరిద్దరూ ఏమైనా దెబ్బలాడుకున్నారా?"

"అదేం కాదు. పెద్దవాళ్ళు చేసిన తప్పులకు చిన్నపిల్లలు పాపపరిహారం చెల్లించవలసి వుంటుందన్నమాట నిజమేననిపిస్తోంది. అసలు నేను బుద్ధిగా చదువుకునివుంటే ఈ రోజు ఇన్ని సమస్య లుండేవికావు? ఎవరికెవరు కామాక్షీ ఈ రోజుల్లో. ధన మూల మిదం జగత్. డబ్బుంది నాకు చదువెందుకనుకున్నాను. అటు డబ్బూ పోయింది. ఇటు వయసూ దాటింది. చదువుకూ, వయసుకీ సంబంధం ఏమిటంటుంది మీ అక్క — నిజమే. అదృష్టవంతులంతా అలాగే మాటాడుతారు. నాకూ చదువుకోవాలనే ఉంటుంది. కాని ఎలా రోజులు గడుస్తున్నకొద్దీ అది అసాధ్య అవుతోంది. బుర్ర చదువు మీదకు వెళ్ళదు కదా. అది నా కర్మేమో! ఇక డబ్బంటావా, ఏదీ కలిసిరాని నాకు డబ్బు సంపాయించే చాకచాక్యం మాత్రం ఎలా వస్తుంది చెప్పు!"

కామాక్షి ఇదంతా ఎందుకు కదిపానా అని బాధపడింది.

"సుధాకర్ కిరణ్‌తో ఆడుకుంటున్నాడా? అల్లరి చేస్తున్నాడా?"

"హాయిగా ఆడుకుంటున్నాడు. వాళ్ళని చూస్తే మన మనసు లోని బాధంతా మాయమవుతుంది. మళ్ళీ చిన్నపిల్లలమైపోతే ఎంత బావుణ్ణు! ఒక క్షణంలో గిచ్చుకున్నా మరుక్షణంలో మరిచిపోతారు. కలిసిపోతారు-"

కామాక్షి ఆస్పత్రిలో చేరిన ఐదవరోజున జ్యోతి మెడ చూసింది హైమావతమ్మ.

"అదేమిటే గొలుసేమయింది?"

"ఏం లేదత్తయ్యా. నెలాఖరు. సద్దుకోలేక బ్యాంక్‌లో పెట్టాను. బోనస్ వచ్చాక విడిపించేస్తా."

"పోన్లే వెర్రితల్లి బతికి బయటపడింది అంతే చాలు."

వారం రోజులూ అయిపోగానే డిస్చార్జి చేశారు కామాక్షిని.

కామాక్షి పుట్టింటికి ఉత్తరం రాసింది వివరాలతో.

వారంరోజుల్లో మూడువందలు మనియార్డరు వచ్చింది. ఫస్టుతారీఖు రాగానే కామేశ్వర్రావ్ తెచ్చి ఓ వంద ఇచ్చాడు.

"అక్కా ఈ డబ్బు తీసుకెళ్ళి నీ గొలుసు విడిపించు" మని యార్డరు రాగానే అంది కామాక్షి.

"ఎందుకులేవే తరువాతనే విడిపించుకుంటాలే."

"అలా అయితే నేరేపే వెళ్ళిపోతా. ఇంతనే నాన్నగారు పంపించారుగా" బలవంతం చేసి కామాక్షి జ్యోతి చేత గొలుసు తెప్పించేసింది. తన గొలుసు ఎలానూ తాకట్టుపోయింది. అక్కా బోసి మెడ చూస్తే చాలా బాధనిపిస్తుంది.

పదిహేను రోజుల్లో కామాక్షి బాగా తేరుకుంది. టానిక్కులూ, పాలూ, పళ్ళూ తీసుకోవడంవల్ల మనిషి కొంచెం ఎరుపెక్కింది.

ఓరోజు సాయంకాలం బావతో అంది కామాక్షి.

"అక్కా ఇంకా ఆఫీసునుంచీ రాలేదు. మనమిద్దరమూ అలా బీచ్‌కి వెళదామా?"

"నువ్ నడవగలవా?

"ఓయస్."

"జాగ్రత్త" అంటూ వీధిగుమ్మం వరకూ వచ్చింది హైమవతమ్మ.

బస్సెక్కి ఆర్. కె. మిషన్ స్టాపు దిగారు.

"అమ్మ!" చిన్న రుమాలుతో చెమట తుడుచుకుంటూ నిట్టూర్చింది కామాక్షి. సిటీ బస్సు ప్రయాణానికి అలసిపోయి.

"అలా సముద్రపు ఒడ్డుకు వెడదామా."

"పద" వెనకాలే వచ్చింది కామాక్షి.

క్వాలిటీ దగ్గర కొచ్చాక కామాక్షి "అయిస్ క్రీం తిందాం" అంది.

మెట్లెక్కి లోపలికెళ్ళారు. "రెండు ఐస్‌క్రీం" ఆర్డరిచ్చింది.

కామాక్షి లోపలి రూమ్‌వైపు చూస్తూ కూచుంది. శ్రీనాథ్ ఆమె కెదురుగా సముద్రంకేసి చూస్తూ కూచున్నాడు.

సూర్యాస్తమయం వేళ. ఎక్కడ చూసినా జంటలూ. విద్యార్థులూ, విద్యార్థినులూ, కలకలలాడుతోంది వాతావరణం.

కామాక్షికి చాలా సంతోషంగా వుంది. ఎన్నాళ్ళకి మళ్ళీ ఇంత ఫ్రీగా బయటికి రాగలిగింది. ఎప్పుడో కాలేజీలో చదువుతూండగా ఇలా వచ్చి ఐస్ క్రీమ్ తింటూండేది. ఆ ఒక్క సంవత్సరమే ప్రకాశరావుగారు విశాఖలో పనిచేసింది. కాని పెళ్ళయిన తర్వాత అంతా పరాధీనమే. సుధాకర్ పుట్టిన తరవాత మరీని. నిముషం తీరికలేదు. రెండేళ్ళవరకూ పాలు మానలేదు. పాలు తాగాలంటే తను పడుకుని ఇవ్వాల్సిందే. నెలరోజుల ముందునుంచి పోగ్రాం వేసుకుని సినిమాకి వెళ్ళినా పదినిముషాలైనా కాకుండా ఎందుకు వచ్చాంరా భగవంతుడా అనిపించేటట్టు ఏడ్చేవాడు సుధాకర్. రెండు సార్లు ఇలా అయ్యాక చెవులు మెలేసుకుంది తను. చిన్నపిల్లలతో సినిమాకు వెళ్ళకూడదని.

"ఏమిటి కామాక్షీ అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?"

"ఏంలేదు బావా."

అయిస్ క్రీం సర్వర్ తెచ్చి టేబిల్ మీద ఉంచాడు.

తలవంచుకు తింటున్నారిద్దరూ.

"వాట్ ఎ బ్యూటీ" బిల్లు ఇచ్చేసి బయటికి వస్తూ అన్నాడు ఒక సూట్ వాలా.

తలెత్తి అతనివంక చూసిన కామాక్షికి అతని వెనకాల జ్యోతి కనపడింది.

"పోనిద్దురూ, బయటకు పదండి" వడివడిగా నడిచి వెళ్ళి పోయింది జ్యోతి.

"అక్కా!" అని పిలవబోయి ఆగిపోయింది. జ్యోతిచెయ్యి తన చేతిలోకి తీసుకుంటున్నాడు సూట్‌వాలా. కంగారుగా శ్రీనాధ్ వైపు చూసింది కామాక్షి. శ్రీనాధ్ తల వంచుకుని ఐస్ క్రీమ్ తింటున్నాడు.

కామాక్షికి చిరుచెమట పట్టింది.

బావ ఐస్‌క్రీమ్ తినడం పూర్తయ్యాక కామాక్షి తన పర్సు లోని పది రూపాయల కాగితం బిల్లమీద పెట్టి బేరర్ ఇచ్చిన చిల్లర వదిలేసి మిగిలినది పర్సులో వేసుకుంది.

"పద బావా, అలా వెళ్ళి ఇసుకలో కూచుందాం."

కాళ్ళు తడుపుకుంటూ నీటిలోంచి నడుస్తూంది కామాక్షి.

కొంత దూరం వెళ్ళి ఇసకలో కూచున్నాడు శ్రీనాధ్.

"ఏమిటి బావా అంత ఆలోచిస్తున్నావ్?"

"గతించిన కాలం మళ్ళీ జీవింప గలిగితే మన బ్రతుకుని మనం ఎంచక్కా బాగుచేసుకోగలం!"

"అదెలా, అసాధ్యం. కాని అంతమాత్రాన మనసును భ్రంగ దీసుకోవడం ఎందుకు? భవిష్యత్తు కొంతవరకూ మన చేతుల్లోనే ఉందని నా నమ్మకం."

"అవును. అందుకనే చేజేతులా...."

"పొరపాట్లు చేసినంత మాత్రాన జీవితం మీద విరక్తి పెంచు కోవలసిన అవసరంలేదు."

"అవును నువ్ చదువుకున్నదానివి. విజ్ఞతతోవ్యవహరిస్తావు. కాని నాకు అదే లేదు. తప్పు దిద్దుకునే శక్తీ లేదూ. సామర్థ్యమూ లేదు. అందుకే నాకు భవిష్యత్తు చీకటిగా కనపడుతోంది. బ్రతుకంటే

అసహ్యం వేస్తోంది."

అదేమిటి బావా, చదువుకోలేదన్నదే నీ మనసులో చింతయితే...."

"అదొక్కటే కాదు కామాక్షీ. మగవాడిగా బ్రతకాలంటే డబ్బు సంపాదించాలి. సంపాదించాలంటే ఏదోరకమైన తెలివితేటలుండాలి. కనీసం కాయకష్టమైనా చెయ్యాలి. కాని నాకు రిక్షాలాగడం కూడా చేతకాదు."

"ఏమిటో బావా చాలా బాధపడుతున్నావ్. ఏది ఏమైనా నాకు నువ్వు ఒక వాగ్దానం చెయ్యాలి. నామాట కాదనకు."

"చెప్పు కామాక్షి నీకోరిక నేను కాదనను."

"అక్కయ్యకు అన్యాయం చెయ్యకు."

"ఓస్ అదా! మీ అక్కయ్యకు నేను అన్యాయం చేసే స్థితిలో ఎక్కడున్నాను? మీ అక్కయ్య నన్ను పోషిస్తోంది. ఏ అన్యాయమైనా నే భరించవలసిందే."

"ఎదుటివాళ్ళు నిన్ను అన్యాయం చేశారే అనుకో. అందుకు ప్రతీకారంతో నీ మానవత్వాన్ని వదలుకుంటావా? తప్పు చేసినవాళ్ళను అర్థం చేసుకుని ఎదుటి మనిషి చేసిన తప్పును క్షమించగలగడమే విద్యాసముపార్జనకి గమ్యం."

"నిజమే, తప్పుచేసిన వాళ్ళను క్షమించడం గొప్ప లక్షణమే. నేను అంతటి వాడినవగలనని కలలోకూడా అనుకోను, కాని ఒకటి నిజం. నీకు మాట యిస్తున్నాను, నేను ఇన్నాళ్ళూ అక్కచేత పోషింపబడుతున్నందుకు కృతజ్ఞతా సూచకంగానైనా ఆమెకున్యాయం చేకూర్చే ప్రయత్నం చేస్తాను."

"థాంక్స్ బావా!"

ఆకాశం అంతా ఎర్రని రంగు అలముకుంది. అస్తమిస్తున్న సూర్యుడికాంతి పడి సముద్రం వింత రంగుతో మిలమిలా మెరుస్తోంది.

చూస్తుండగానే తళుకులన్నీ పోయి చీకటి ముంచుకొచ్చింది.

బజారుపని కూడా చూసుకొని ఎనిమిది కొట్టబోతుండగా ఇంటికి

చేరుకున్నారు శ్రీనాథ్ కామాక్షి.

"సుధా, పిన్ని వచ్చేసింది" తప్పట్లు కొడుతూ చెప్పాడు కిరణ్.

"అత్తయ్యా, అక్క ఇంకా రాలేదా?"

"వస్తుందమ్మా. ఈ మధ్య ఆఫీసులో పని ఎక్కువగా ఉంటోందట."

రోజులు గడుస్తూనే వున్నాయ్. ఆదివారం రాగానే కామేశ్వర్రావ్ వచ్చాడు. పిల్లల్ని తను చూసుకుంటూనే కామాక్షినీ, కామేశ్వర్రావునీ సినిమాకు వెళ్ళమనీ చెప్పాడు శ్రీనాథ్.

జ్యోతి వాళ్ళు సినిమాకి వెళ్ళాక అంది. "ఏమండీ, మనం పిల్లల్ని తీసుకుని బీచికి వెళదామా?"

"నేనెందుకులే, నువ్వెళ్ళు నాకు ఎక్కడికీ రావాలనిలేదు." ముఖం ముడుచుకునే అన్నాడు. ఆరున్నరయిపోయింది. జ్యోతి ఇంట్లో పనులేవో చూస్తోంది.

బయట కారు చప్పుడు.

జ్యోతి సావిట్లోకి వచ్చింది. శ్రీనాథ్ ఆమెవైపు నిశితంగా చూశాడు.

తలుపు తీసే ఉంది.

"రండి రండి" అంటూ జ్యోతి అతన్ని ఆహ్వానించింది.

"ఈయన మా ఏజంటు రాధాకృష్ణమూర్తిగారు. వీరు మా వారు." పరిచయం చేసింది.

"కూచోండి" మర్యాద చేశాడు శ్రీనాథ్.

"జస్టేమినిట్" అంటూ జ్యోతి వంటింట్లోకి వెళ్ళింది.

శ్రీనాథ్ మూర్తివంకే చూస్తున్నాడు.

కుడిచేతివేలికి చక్కని ఉంగరం. పెళ్ళినాటిదేమో కొట్టొచ్చేటట్టుగా వుంది. సీట్‌గా క్రీజ్ నిలబడే ట్రౌజర్సూ, అందమైన టై, కూర్చుంటూ నీటుగా మునివేళ్ళతో ట్రౌజర్స్ మీదకు లాక్కుని మరీ కూచున్నాడు. మనిషి సన్నగా, ఎర్రగా, పొడుగ్గా వున్నాడు. డబ్బుతోనూ, హోదాతోనూ వచ్చే వర్చస్సు ముఖంలో పూవులోని తావిలా గుబాళిస్తోంది.

అతనితో ఏదైనా మాట్లాడ్డం మర్యాదని తెలిపినా ఎలా మాటాడాలో తెలియడం లేదు.

మూర్తి ప్రారంభించాడు: "మీ ఫాదర్ నాకు తెలుసు. ఫ గుడ్ బ్యాంకర్! నేను గుంటూరులో పని చేస్తుండగా చాలాసార్లు చూశాను. చాలా హఠాత్తుగా పోయారటగా."

"అవునండీ!" అంత తెలిసినవాడు మిగిలిన విషయాలు తెలుసుకోకుండా వుంటాడా అనిపించింది శ్రీనాథ్‌కి.

జ్యోతి ట్రేతో ఒక కప్పు తీసుకొచ్చి పక్కబల్లమీద పెట్టింది సాసరుతో సహా.

'మీరు తీసుకోరా' అని అడుగుతాడేమోనని, ఇప్పుడే తీసుకున్నానని చెబుదామనుకుంటున్న శ్రీనాథ్‌వైపు చూడనైనా చూడకుండా జ్యోతి కళ్ళల్లోకి చూస్తూ కాఫీ సిప్ చేస్తున్నాడు మూర్తి.

"ఐయామ్ సారీ, మిమ్మల్ని డిస్టర్బ్ చేసినట్టున్నాను. మీరు వెళ్ళాక ట్రంక్‌కాల్ వచ్చింది. విజయనగరంనుంచి బెజవాడ వెళుతున్నాడు మన పెర్సనల్ ఆఫీసర్. స్టేషన్‌కు రమ్మని ఫోన్ చేశాడు విజయనగరంనుంచి అక్కడి ఏజంటు. ఎలాగూ వెళుతున్నాను. మీరుకూడా వస్తే మీ ప్రమోషన్ గురించి మరోసారి మాటాడవచ్చు. ఎలాగైనా సెంట్రల్ ఆఫీసులోకూడా అతనికి మంచి ఇన్‌ఫ్లుయెన్స్ వుంది. ఈఫ్ యూ డోన్ట్ మైండ్."

శ్రీనాథ్‌వైపు చూశాడు.

"దానికేముందండీ, ఆమెకు ప్రమోషన్ రావడం నాకూ ఇష్టమేగా!" నామవాచకానికి బదులు సర్వనామం వాడాడు శ్రీనాథ్.

"టూ మినిట్స్!" అంటూ జ్యోతి లోపలికెళ్ళింది.

జేబులో పెట్టెతీసి సిగరెట్ వెలిగించాడు మూర్తి. తరువాత ఆలోచనగా శ్రీనాథ్‌కూ ఒకటి ఆఫర్ చేశాడు. ఖరీదైన సిగరెట్ పెట్టె. పూర్వాశ్రమంలో తను అలవాటుగా కాల్చే గోల్డ్‌ఫ్లాక్ ఫిల్టర్.

"వద్దండీ నే కాల్చను" అనేశాడు శ్రీనాథ్.

జ్యోతి ముస్తాబై వచ్చి మూర్తివెంట వెళుతూ 'వస్తా అత్తయ్యా' అని చెప్పి వెళ్ళిపోయింది.

"నాన్నా, ఆ వచ్చినతనెవరూ?"

ఏమని చెప్పాలో తెలియక తికమకపడ్డాడు శ్రీనాథ్.

"ఆయన....ఆయన దగ్గర అమ్మ పనిచేస్తోంది."

"నాన్నా, మీరు ఆఫీసుకు వెళ్ళరేం?"

మరో రోకటిపోటు.

"వెళతాలే నాన్నా. వెళతా. నువ్ కూడా చదువుకుంటే నువ్వూ వెళతావ్" ఏదో సమాధానం చెప్పాడు.

పిల్లలిద్దరూ అన్నాలు తిని పడుకున్నారు. మామ్మ కబుర్లూ, కథలూ చెప్తుంటే.

"నువ్ కూడావస్తే వడ్డిస్తా."

"వద్దమ్మా, బాగుండదు. కామేశ్వర్రావ్ రానీ."

"పోనీ, జ్యోతి వచ్చేసినా బావుండును. రైలు లేటయిం దేమో" హైమవతమ్మ కడుపులో బాధ ఆగక బయటికి అనేసింది.

"వస్తుందిలే అమ్మా. తల అమ్ముకున్నాక అనేకమైన పను లుంటాయి. అంతా మన ఇష్టం కాదుగా."

హైమవతమ్మ పిల్లలు తిన్న కంచాలు తీసి, ఎంగిళ్ళెత్తి పెర ట్లోకి వెళ్ళింది కంచాలు తోమడానికి.

శ్రీనాథ్‌కి విలవిలలాడిపోయాడు. తల్లి పెద్దదైపోయింది. చిన్నప్పటినుంచీ కష్టపడి పనిచెయ్యడం అలవాటు లేనిది. సుఖపడ వలసిన ఈ వయసులో ఇంత చాకిరీ చేస్తోంది. తాను తల్లికి ఏం చెయ్యగలుగుతున్నాడు? తెల్లవారుఝామున లేస్తుంది. మడీ తడీ, పూజా పునస్కారం కావాలి. ఓపిక లేకపోయినా, శరీర స్థితి ఎలా వున్నా రోజూ స్నానమే. కోడలు తనకు చేసిపెట్టడం పోయి, తానే కోడలికి కంచంలో అన్నంపెట్టి చెయ్యి కడుగుతోంది. కనీసం ఈ విషయంలోనైనా జ్యోతి కొంచెం విచక్షణ చూపిస్తే బాగుణ్ణు. తనెప్పుడైనా అన్నా జ్యోతినే వెనకేసుకొస్తుంది తల్లి. శ్రీనాథ్ కళ్ళు చెమర్చాయి.

పదవుతుండగా ఆటోలో వచ్చారు కామేశ్వర్రావూ, కామాక్షీ.

హైమవతమ్మకి నిద్ర పట్టేసింది.

"మీరు కాళ్ళు కడుక్కు రండి. నే వడ్డించేస్తా" కామాక్షి పిలిచింది.

చటుక్కున తెలివి వచ్చింది హైమవతమ్మకి. "ఎంత పనే తల్లీ, నిద్ర పట్టేసింది." లేచి వంటింట్లోకి వెళ్ళింది.

"సినిమా ఎలా వుంది కామాక్షీ" మాటవరస కడిగాడు శ్రీనాథ్.

"బావుంది బావా। అక్క ఏదీ?"

"ఏదో పనిమీద వెళ్ళింది. ఎవరో రైల్లో వస్తున్నారట."

శ్రీనాథ్ జవాబు విన్నాక ఎందుకడిగానా అని బాధపడింది.

"అయినా ఈ రోజుల్లో రైళ్ళు వాళ్ళ ఇష్టమే" కామేశ్వర్రావ్ అన్నాడు.

బయట తలుపు చప్పుడు.

"నే లేస్తా" శ్రీనాథ్ వెళ్ళి తలుపు తీశాడు.

"అబ్బ! వెధవరైలు గంటా ముప్పావు లేటు. ఎనిమిదింటికి రావలసింది" జ్యోతి విసుక్కుంది.

"ఆఁ, ఆ, అదే అనుకుంటున్నాం."

అందరి భోజనాలూ అయ్యాయి.

మరో రోజు గడిచిపోయింది శ్రీనాథ్‌కి.

మరి కొన్ని గంటల్లో మళ్ళీ తెల్లవారుతుంది. మరో రోజు మొదలౌతుంది. "భగవాన్, నాకు ఒక దోవ చూపించు. ఏ క్షణంలోనైనా పిచ్చివాడి నౌతానేమో!" మనసులో ప్రార్థించాడు.

కాఫీ కప్పు తెచ్చి ఇస్తూ చెప్పింది కామాక్షి: "బావా, మేం ఈరోజు సాయంకాలం వెళ్ళిపోతున్నాం. ఆయనకు ఇబ్బందిగా ఉందట. ముసలావిడ ఒకామెను వంటకు మాటాడారట. నే వెళ్ళినా, పనిమనిషి వంటమనిషి ఉంటారు కాబట్టి ఏమంత కష్టపడి పని చెయ్యక్కర లేదంటున్నారు."

జ్యోతి లోపలనుంచి వింటోంది. బావతోనే ఈ విషయం చెప్పడంలో కామాక్షి ఆంతర్యం?

ఆదివారం సాయంకాలం కొంపదీసి తనను క్వాలిటీలో చూడ

లేదు కదా! అందుకనే అనుకున్నదానికంటె తొందరగా వెళ్ళిపోతోందా! వచ్చి నాలుగు రోజులున్నంతమాత్రం తండ్రికి రాసి డబ్బు తెప్పించి ఎందుకు ఇచ్చేసింది?

తనను రాధాకృష్ణమూర్తితో చూడకముందే ఆడదానిగా ఇంట్యూయిషన్‌తో జరుగుతున్న విషయం పసిగట్టిందా?

అందుకేనేమో బావతో అంత చనువుగా తిరుగుతోంది.

తనగురించి వాళ్ళిద్దరూ ఏమనుకున్నారు? తెలిస్తే బాగుణ్ణు. కాని ఎలా?

మూర్తి అంత ధైర్యం చేస్తాడనుకోలేదు. తనుచేస్తున్న పని సరైనదికాదని తనకూ తెలుసు. కళ్ళు విప్పి చూస్తూనే ఈ రొంపిలో అడుగుపెట్టింది తను. మూర్తి పెళ్ళయినవాడు. తగుజాగ్రత్తతోనే ఉంటాడని నమ్మింది.

కాని తను ఎందుకు బాధపడుతోంది?

చెల్లెలి ఎదుట పరువుపోయిందనా? భర్తకు అన్యాయం చేస్తున్నదనా?

మనసులో మొదటిసారిగా ఈ ఆలోచనలూ, తర్జన భర్జనలూ ప్రారంభమయ్యాయి జ్యోతికి. తను ఆలోచనలలోనుంచి తేరుకోనే లేదు.

"ఎందుకలా తొందరపడతావ్ కామాక్షీ. తొందరపడితే వచ్చే పరిణామాలు ఎలా ఉంటాయో చూశావ్‌గా! మరోసారి ఆలోచించు. నీ ఆరోగ్యం బాగా కుదుటపడేవరకే ఉండు. నేను సంపాదిస్తున్న వాడిని కాదనుకో. అయినా నీవల్ల అయ్యే ఖర్చు మేరకు సర్దేశావ్‌గా. పైవానివి కాదు. మేనత్తచేత అవసర సమయంలో చేయించుకోడం వింతా?"

'జ్యోతి నీకు అక్క' ఆ మాటమాత్రం అనలేదు శ్రీనాథ్. తనమాట ఎత్తలేదు. అంటే తన విషయం తెలిసిపోయిందన్నమాట. జ్యోతి మనసు చివుక్కుమంది.

ఇప్పుడైనా చెల్లెల్ని ఉండిపోమన్నమాట తన నోటి వెంట రాలేదు. తన స్వార్థం తనకే ఆశ్చర్యాన్ని కలిగించింది జ్యోతికి.

శ్రీనాథ్ మాటాడుతుండగానే కలుగచేసుకున్నాడు కామేశ్వ్రరావ్. "అదికాదు అన్నయ్యగారూ. మీరు పైవాళ్ళని కాదు. అలోచన లేకనూ కాదు."

కామాక్షి తన సంగతి కామేశ్వ్రరావ్‌కి కూడా చెప్పేసిందా? జ్యోతి కంగారుపడిపోయింది.

బయల్దేరేముందు అక్కతో చెప్పింది కామాక్షి.

"అక్కా. నువ్వూ బావా, ఓ ఆదివారం రండే. ఇక్కడే కదా పొద్దున్న వచ్చి సాయంకాలానికి తిరిగి వచ్చెయ్యొచ్చు."

"అలాగేనే. ఉత్తరాలు రాస్తుండు."

గబగబా రెండు మెతుకులు తిని ఆఫీసుకు వెళ్ళిపోయింది జ్యోతి.

బస్సుకి దిగబెట్టడానికి వెళుతూ దోవలో సుధాకర్‌కి నిక్కారూ చొక్కా కొనిచ్చాడు శ్రీనాథ్.

కామాక్షీ, సుధాకర్ ఉన్న కొద్దిరోజులూ కొంత సాఫీగా గడిచి పోయినట్టు అనిపించింది వాళ్ళు వెళ్ళిపోయాక.

తనూ తన ఒంటరితనం మిగిలిపోయారు మళ్ళా. ఆ సాయం కాలం జ్యోతి ఇంటికి పెందరాడే వచ్చేసింది.

శ్రీనాథ్ అలా తిరిగివస్తానని బయలుదేరాడు.

రాధాకృష్ణమూర్తి ఇల్లు తెలుసుకోవడం కష్టంకాలేదు. ఇంటి చుట్టూ కాంపౌండు. ఫెన్సింగ్‌కి బదులు మొక్కలు చక్కగా కత్తిరించ బడి ఉన్నాయ్. కొత్తగా వెల్లవేయబడిన డాబా ఇల్లు కలకలలాడుతూ పెళ్ళిపందిట్లో పెళ్ళికూతురిలా ఉంది.

గేటు తీసుకుని లోపలికెళ్ళాడు శ్రీనాథ్.

వాబిరీ లోపల కుర్చీలూ, సోఫాలూ అందంగా పేర్చబడి ఉన్నాయ్.

మెట్లదగ్గరే నుంచున్నాడు, కుక్కలెక్కడ భౌంయ్‌మంటాయో నన్న భయంతో.

"నువ్ నోరుముయ్యవే అన్నానా?"

"ఆఁ. అంటారంటారు. సిగ్గూ ఎగ్గూ అక్కర్లా? మీకు లేకపోతే

దానికి ఉండద్దూ. దాని మొగుడైనా దాన్ని జాగ్రత్తపెట్టుకోవద్దూ. ఇలా ఊరుమీదికి వదిలేస్తాడా!"

"వదిలెయ్యకేం చేస్తాడూ, కానీ సంపాదన లేనివాడూ, చదువూ సంధ్యా లేనివాడూ, వాడు చెబితేమాత్రం ఎందుకు వినాలీ? అయినా శ్రీదేవీ నీ మంచికే చెబుతున్నా. ఈ విషయంలో నువ్ కలుగచేసుకోకు. నీ మంచికే చెబుతున్నా."

"నేను ఊరుకుంటే, లోకం ఊరుకుంటుందా"

"లోకం సంగతి ఎవడిక్కావాలి. అది నా ఇష్టం."

"నీ ఇష్టమని అనుకున్నంతమాత్రాన చెల్లదుగా. సామెత చెప్పినట్లు తన అన్నం తిని తన బట్ట కట్టుకుంటున్నా లోకానికి వెరవనని సామెత. ఉద్యోగం చేస్తున్నంతమాత్రాన సిగ్గొదిలేసి బజార్న పడుతుందా? ఛీ!"

"నోర్ముయ్! పోనీకదా అని ఊరుకుంటుంటే అదిమాయిస్తున్నావే? నా ఇష్టం! మగాడన్నాక అనేక పనులు చేస్తుంటాడు. నీకేమిటీ అన్యాయం జరగలేదుగా. అన్నింట్లోనూ ఆడవాళ్ళు కలగచేసుకోకూడదు."

"నేను పుట్టింటికి పోతా. అదైనా ఉండాలి. నేనైనా ఉండాలి. హోటళ్ళంట తిరగడానికి సిగ్గులేదూ. ఛీ, ఛీ."

ఆమె కోపం తారస్థాయి నందుకుంది.

అహంకారం దెబ్బిపోయి చెయ్యి చేసుకున్నట్టున్నాడు నగరాజు.

"ప్రసన్నా!"

"వస్తున్నా, నాన్నా!"

పక్కగదిలోంచి వస్తూ బయటికి చూసింది పాప.

"నాన్నా! మీ కోసం ఎవరో వచ్చినట్టున్నారు."

"వచ్చి లోపల కూచోమను."

నిమ్మకు నీరెత్తినట్లు చెప్పాడు సమర్థుడు.

సెకెండులో మూడ్ మార్చుకోగలిగిన అధికారి.

సంభాషణంతా వింటున్న శ్రీనాధ్ ప్రసన్న బయటికి వచ్చే

సరికి గేటుదాటుతున్నాడు.

ఎవరో, ఎందుకు వచ్చారో, ఎందుకు వెళ్ళిపోయారో తెలియదు మూర్తికి. మరో ఐదునిముషాల్లో స్కూటర్‌మీద బయలు దేరాడు విహారానికి. దోవలో శ్రీనాథ్‌ని చూసి ఓ పదిగజాలు ముందుకి వెళ్ళాక ఆపాడు స్కూటర్.

"నమస్తే. మీరు మా ఇంటికి వచ్చినట్టున్నారు?"

"అబ్బే లేదండీ. ఇంకా మంచి ముహూర్తం చూసివద్దామను కుంటున్నా. ఏదైనా పని చూపిస్తారని ... అయినా నేను వచ్చానని ఎలా అనుకున్నారు?"

"ఆఁ ఇటు వస్తుంటే.... పోన్లెండి ఇంటిదగ్గర డ్రాప్ చేస్తా రండి."

"థాంక్స్." వెనక కూచోక తప్పలేదు శ్రీనాథ్‌కి.

స్కూటర్ శబ్దంవిని జ్యోతి తలుపు వేసింది.

"రండి, రండి" ఆహ్వానించింది.

వెనకనుంచి దిగుతున్న శ్రీనాథ్‌ని చూసి తెల్లబోయింది.

"నేను అలా వస్తుంటే ఇంటిదగ్గర డ్రాప్ చేస్తానన్నారు. థాంక్స్!"

మెట్లెక్కి లోపలి కెళ్ళిపోయాడు శ్రీనాథ్.

స్కూటర్ స్టార్ట్ అయింది. మరి కాసేపటికి తలుపు గడియ వేసి లోపలకొచ్చింది జ్యోతి.

"మీరు వస్తారా, నేనూ బాబీ, బీచికి వెళదామనుకుంటున్నాం."

"నే నిప్పుడే తిరిగి వచ్చాగా, మీరు వెళ్ళండి."

జ్యోతీ కిరణ్ వెళ్ళిపోయారు.

శ్రీనాథ్ పడకకుర్చీలో కూలబడ్డాడు.

"విన్నావా అబ్బాయ్, వెనక వీధిలో పట్టపగలు ఓయింటాలో నగలన్నీ దోచుకుపోయారట." తల్లి అంది.

"జాగ్రత్తగా ఉండాలమ్మా. రోజులు బాగులేకపోతే తాడే పామై కరుస్తుందంటారు."

"వీధిలోకి వెళ్ళే పిల్ల దానిమెడలో ఉండక తప్పదు. నా గొలుసు

రేపు తీసుకెళ్ళి బ్యాంకులో పెట్టెయ్. అవసరమొచ్చినపుడు తెచ్చుకు వేసుకోవచ్చు."

"అలాగేలే అమ్మా. రేపు చూద్దాంలే. జ్యోతి చేతికిచ్చెయ్ పడేస్తుంది బ్యాంకులో."

"చెబితే, మెడబోసిగా ఉంచుకోవద్దంది. నువ్వే వేసేయ్."

భగవద్గీత తీశాడు శ్రీనాథ్. ఒక శ్లోకం చదివి కింద తాత్పర్యం చదివి ఆలోచనలో మునిగిపోయాడు.

క్లైబ్యం మాస్మగ మపార్థ! నైతత్త్వయ్యుప పద్యంతే
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప:

ఈ శ్లోకం ఎక్కడో విన్నాడు. చటుక్కున గుర్తొచ్చింది.

రామకృష్ణ మఠంలో తను చదువుతున్న వివేకానందుని సందేశంలోని మాటలు. తామసంతో కూడిన క్లైబ్యం నిర్జీవ సంకేతం. ఈ క్లైబ్యానికి అర్జునుడు లోనవుతున్నాడనే భగవంతుడు గీతాసారాన్ని పార్థునికి ఉపదేశించాడు. భగవంతుని మొదటిమాటలివే అంటూ, వివేకానందస్వామి ఈ శ్లోకాన్ని ఉదహరించాడు. వేలాది సంవత్సరాలుగా దేశమంతటా దైవం పేరుతో గాలి నిండిపోయింది. అంతా దైవాన్ని కోరేవారే. కాని దైవం మానవుల ప్రార్థనల నెందుకు వినాలి? మనిషే తెలివితక్కువ వాళ్ళమాటలు వినడే, దేవుడెందుకు వింటాడు? నిర్జీవ స్థితినుండి బయటపడడానికి ఒకటే మార్గం. క్లైబ్యాన్ని, అంటే మానసికమైన నపుంసకత్వాన్ని విడనాడి ధీరుడై మనిషి పనిచెయ్యాలి. లేచి యుద్ధం చెయ్యమని పరమాత్ముడు బోధించాడు.

గత కొన్నాళ్ళుగా అతను చేస్తున్న ఆలోచన అతని ఎదురుగా పుస్తకంలో జ్ఞానబోధగా సాక్షాత్కరించింది. కార్యదీక్ష వహించి ఏదో ఒక పనిచేయాలన్న నిర్ణయానికి వచ్చేశాడు శ్రీనాథ్.

ముందు ఏడుస్తూ కిరణ్ లోపలికి వచ్చాడు. కంటినిండా నీళ్ళు. బుగ్గలమీద చారికలు. వెనకాలే జ్యోతి.

"ఏం బాబీ, ఏడుస్తున్నావ్?"

"అమ్మకొట్టింది."

"ఎందుకూ?"

"మొన్న వచ్చినాయన స్కూటర్ ఎక్కమన్నాడు. నేను ఎక్కనన్నానూ, నాకు భయం. అమ్మ కొట్టేసింది."

"పోన్లే బాబూ, మరికొట్టదులే. రా, అన్నం తిను" హైమవతమ్మ వచ్చి మనవణ్ణి సముదాయించింది.

శ్రీనాథ్ రాత్రి తనదగ్గరే బాబీని పడుకోపెట్టుకుని మరుసటి రోజు తల్లి గొలుసు పట్టుకెళ్ళి బ్యాంకులో పెడతానని బయలుదేరాడు.

3

మూర్తి ఇంటికొచ్చి చూసేసరికి శ్రీదేవి లేదు. నౌకరు చేతికి తాళాలిచ్చి సాయంకాలం బస్సుకి కాకినాడ వెళ్ళినట్టు చెప్పమంది.

అంతవరకూ శ్రీదేవి అన్నంతపనీ చేస్తున్నదని అనుకోలేదు మూర్తి. ఓ పావుగంట కాలుకాలిన పిల్లిలా ఇల్లంతా తిరిగి శ్రీదేవి పెట్టని ఉత్తరంకోసం ఇల్లంతా గాలించి ఏడున్నరయాక బారుకో సీసా ఒకటి కొనుక్కొచ్చేశాడు.

మరుసటిరోజు ఆఫీసులో మరో షాక్.

జ్యోతి వారంరోజులు సెలవు పెట్టేసింది. అర్జంటుగా చూసుకోవాల్సిన వ్యక్తిగతమైన పనులున్నాయని.

టైపిస్ట్‌మీద విసుగూ, మరో గుమాస్తామీద కోపం, మెసంజర్‌ని గెటౌట్ అనడం చకచకా జరిగిపోయాయ్.

ఆఫీసుపని అయిపోయాక ఎందుకయినా మంచిదని ఇంటి పక్కగా వచ్చాడు. తన తలకాయంత తాళంకప్పవేసి ఉంది.

లోకంమీద కసి వచ్చింది మూర్తికి. తనూ శెలవుపెట్టి వెళ్ళిపోతే?

కాని ఎక్కడికి వెళ్ళాలి?

తండ్రి ఏనాడో భార్యనీ ఇద్దరు పిల్లల్నీ నడిసముద్రంలో వదలి వెళ్ళిపోయాడు. మేనమామలు ఆస్తీ అప్పూ లెక్కలువేసి చూడగా అప్పే మిగిలింది. కొంతకాలం పోషించారు, పెద్దకుటుంబం, పాతకాలపురోజులూ కాబట్టి. తను ఎస్సెల్సీ ప్యాసుకాగానే సుందరశివరావ్‌గారి ప్రాపకం లభించింది. దూరపుబంధువని జాత్యభిమానంతో

ఆయన కొంత సహాయంచేస్తూ తెలిసినవాళ్ళకి చెప్పి సాయంచేస్తూ కాలేజీలో పెట్టారు. తనకూ సరస్వతీ కటాక్షం ఉండడంవల్ల బి.కామ్. ఫస్టుక్లాసులో పాసయ్యాడు. ఉద్యోగాలకోసం దొమ్మీ పరిస్థితులులేని రోజులు. తలచుకోగానే ప్రొబేషనరీ ఆఫీసర్‌గా ఉద్యోగం వేయిం చేశారు. ఉద్యోగం వేయించి, అమ్మాయి నిచ్చి పెళ్ళిచేసి ఇల్లూ నిల బెట్టారు.

జ్యోతి ఎక్కడికి వెళ్ళిందో? తనే తొందరపడ్డాడు. చాటుగా జరుగుతున్న వ్యవహారాన్ని వీధి పాలుచేశాడు. ఆ మేనేజర్ వెధవ నెలాగైనా ట్రాన్స్‌ఫర్ చేయించేయాలి. వాడు చెప్పకపోతే జ్యోతి సంగతి శ్రీదేవికి తెలిసేదేకాదు.

మామగారి దగ్గర అసలే తనకు భయం. ఆమెతో ఏవో బొంకి కాలక్షేపం చెయ్యాల్సింది.

మూడురోజులయ్యాక ట్రంక్ కాల్ చేశాడు.

పదకొండున్నరయింది. భోజనంచేసి చిన్నకునుకు తీస్తున్నారు సుందరశివరావ్‌గారు. శ్రీదేవీ శారదాదేవీ ఏదో మాటాడుకుంటున్నారు.

శ్రీదేవి మూర్తి గురించే ఆలోచిస్తోంది.

పచ్చగా పందిట్లో నలుగురెదుటా పెళ్ళి చేసుకుని సుఖంగా ఉంటున్న తన జీవితంలోకి మరో స్త్రీ ప్రవేశిస్తేసూత్రం జడసి వెనక్కి పారిపోవల్సిన అవసరం తనకేముందీ!

ధైర్యం తెచ్చుకుని జరిగినదంతా తల్లికి వివరించింది శ్రీదేవి.

ఇంతలో టెలిఫోన్ మోగింది.

ప్రసన్న ఎత్తింది ముందు..

"హలో.... ఉండండి మా అమ్మమ్మని పలుస్తా. అమ్మమ్మా, ట్రంక్‌కాల్!" ట్రంక్ కాల్ అనగానే సావిట్లోకి వచ్చింది శ్రీదేవి. ప్రసన్న చేతిలోంచి ఫోన్ అందుకుంది.

"హలో, సుందరశివరావ్‌గారిల్లు. ట్రంక్ కాల్ అన్నారుగా. కనెక్ట్ చెయ్యండి!" ఒకపక్క కోపం, మరోపక్క ఆత్రుత. గుండెలు దడదడా కొట్టుకుంటున్నాయి.

మూర్తి గొంతు వినేసరికి మనసులో కోపమే మిగిలింది.

"హలో, సుందరశివరావ్‌గారిల్లా?"

"నేను శ్రీదేవిని మాటాడుతున్నా."

"శ్రీదేవీ. నాతో చెప్పకుండా ఎందుకు వెళ్ళిపోయావ్...."

"అమ్మ మాటాడుతుంది." ఫోన్ బల్లమీదపెట్టి లోపలి కెళ్ళింది.

"హలో! మూర్తీ, బాగున్నావా బాబూ, అమ్మాయి నువ్ వస్తావని చూస్తోంది. ఎప్పుడూ ఉద్యోగమంటే ఎలా? మాకు ఎవ రున్నారని చెప్పు. కొడుకునైనా అల్లుడివైనా నువ్వే. ఓ రెండు రోజులు సెలవ్‌పెట్టిరా. మావయ్యగారు మేడమీద నిద్రపోతున్నారు. పిలవనా....పోన్లే. ఎప్పుడొస్తావ్....మంచిది. ఉంటా."

ఫోన్ పెట్టేసింది.

తల్లివంక ఆశ్చర్యంగా చూసింది శ్రీదేవి. అల్లుణ్ని ధడామని తిట్టేస్తుందనుకుంది.

"ఏమిటమ్మా అలా మాటాడావేం. నాలుగు దులిపేస్తావను కున్నాను."

"తల్లీ. ఆడపిల్లనిచ్చుకున్నవాళ్ళం. తొందరపడితే ఎలా? ఇప్పుడతన్ని ఏమన్నా నువ్ మాతో విషయమంతా చెప్పినట్టు తెలిసి తెలుస్తుంది. అతనిలో అహంకారం రెచ్చిపోతుంది. దానివల్ల నీ జీవితం చెడిపోయే అవకాశమే ఎక్కువ. మెల్లిగా ఉంటే ఇక్కడికి వస్తే కొంత సర్దుకుపోయే అవకాశం లేకపోలేదు. అతను వచ్చి నప్పుడు వితండవాదం చెయ్యక చక్కగా వెనక్కి వెళ్ళటం మంచిది."

టెలిఫోన్ మోగడం, తల్లీ కూతుళ్ళ సంభాషణా మేడమీద నుంచే వింటున్న శివరావ్‌గారు కిందకి వచ్చారు.

"నే వెళ్ళకపోతే...."

"అతనే ఇక్కడికి వస్తాడమ్మా. ఆవేశపడి ఏంచేస్తావ్. నీ అంతట నువ్ వెళ్ళడం ఇష్టం లేదంటే నీ అభిమానం అడ్డు వస్తోందన్న మాట. సరే అతనే వచ్చి నిన్ను తీసుకెళతానంటే వెళతావ్‌గా...."

డైరీలో టెలిఫోన్ నంబర్లున్న పేజీలు తిరిగేశారు శివరావ్‌గారు.

ఉద్యోగంలో ఉన్నప్పటి హోదా వేరు. ఇప్పుడు శ్రమపడి వెళ్ళినా అవతలమనిషి ఒబ్లయిజ్ చెయ్యకపోవచ్చు. కాని ఫోన్‌లో మాటాడితే పాత గాంభీర్యం ఉండనే ఉంటుంది. ఉత్తరాల వల్లయ్యే పనులు కావు.

"ట్రంక్స్!" అన్నారు ఫోన్‌తీసి.

రెండు గంటల తర్వాత వచ్చింది ట్రంకాల్.

"హలో రంగనాధన్....నేనయ్యా సుందరశివరావ్‌ని....కాస్త తీరికగా విను....ఆ, ఆ, కాకినాడనుంచే. శ్యామల బావుందా.... పెద్దవాడేం చదువుతున్నాడూ....ఎందుకిలా పిలిచానా....మా అల్లుడు రాధాకృష్ణమూర్తి జ్ఞాపకం వుందా....ఆ, ఆ, ఒక్కర్తే కూతురు. ఇంకా ఏదీ ఒకటో క్లాసే....అక్కడ చిన్న పని చేయించిపెట్టాలి. అల్లుణ్ణి కాకినాడ ట్రాన్స్‌ఫర్ చేయించాలి. లేకపోతే సామర్లకోట, తుని, నీ ఇష్టం....అల్లుడుగా రావాలంతే....ముసలాళ్ళమైపోయాంగా ఒక్కర్తే అమ్మాయి, అందుకని....అవన్నీ చెబుతాగా....ప్లీజ్ ఎక్స్టెండ్. విశాఖలో జ్యోతి అని ఓ అమ్మాయి ఉంది. ఆ జ్యోతితో మూర్తి తిరుగుతున్నాడని వినికిడి. ఇల్లాంటివి గోళ్ళతోనే తుంచెయ్యాలి గొడ్డళ్ళవరకూ పెంచకుండా....నో, నో, ఆమెకు కష్టం కలిగచేసే ఉద్దేశ్యం మనకేం లేదు. గుప్‌చప్ కాకుండా ఈ పని చేయించేస్తే వాళ్ళంతట వాళ్ళే విడిపోతారు....ఎన్నిరోజులు పడుతుందంటావ్....సరే, సరే....అక్కడ కోదండరామయ్యనీ, వివేకానంద మూర్తినీ, జోసెఫ్‌నీ అడిగానని చెప్పు. గోవిందాచారి ఎక్కడ? ....ఏదో రామా, కృష్ణా అనుకుంటూ కూచున్నాను. అంతే. మరోమాట. ఈ విషయం బయటికి పొక్కకుండా చూసుకో. కాకినాడ ఫస్ట్ ప్రిఫరెన్స్....ఉంటా .... అవసరమైతే ఫోన్ చెయ్యి....అలాగే ఉంటా" ఫోన్ పెట్టేశారాయన.

## 4

తను పెరట్లో పనులు చేసుకుంటోంది. 'నే వెళుతున్నా. తలుపేసుకో' అని చెప్పి మరీ బయలుదేరాడు అంతకంటే తనకేం తెలియదంది హైమవతమ్మ.

మొదటిసారిగా గుండె కలుక్కుమంది జ్యోతికి.

ఇంతకాలమూ తను చేస్తున్న పని భర్త అసమర్థతకు ప్రతీకారమనే అనుకుంది. జ్యోతి కంగారుపడిపోయింది. అత్తయ్య కూడా తనను వదలి వెళ్ళిపోతే? ఇటు ఇంటిపనీ, అటు ఆఫీసుపనీ రెండూ చేసుకోగలదా తను?

"అత్తయ్యా. ఆయన ఎందుకు వెళ్ళిపోయారో మీకేమైనా తెలుసా?"

"అయ్యో. కట్టుకున్నదానివి నీతోనే చెప్పకపోతే. నాకెందుకు చెబుతాడూ."

ఈ మాటలోని దెప్పి పొడుపే కనిపించింది. భార్యగా నువ్ నీ స్థానాన్ని భర్త జీవితంలో పొందలేదన్న పోటుంది హైమవతమ్మ మాటల్లో.

మూడవ రోజు కార్డు వచ్చింది.

అమ్మకి.

శ్రీనాథ్ నమస్కరించి వ్రాయునది.

నీ గొలుసు అమ్మేశాను. ఏదో చిన్న వ్యాపారం పెట్టుకుని ప్రయోజకుణ్ణి అవాలని ఆశ. అవకాశంరాగానే వెంటనే వచ్చి తీసుకెళ్తాను. బాబీని జాగ్రత్తగా చూసుకో. బాగా చదువుకోమని చెప్పు.

శ్రీనాథ్"

జ్యోతికి ఉత్తరం చూచి నోట మాట రాలేదు.

ఎడ్రసు రాయలేదు. కార్డు అటూ ఇటూ తిప్పి పోస్టుమార్కు మాత్రం పోల్చుకోగలగింది. విజయనగరం. విజయనగరంలో ఏం వ్యాపారం చేస్తాడూ. గొలుసు అమ్మితే మహావస్తే రెండువేలొస్తాయి. దానితో వ్యాపారమే!

"అమ్మాయ్, విజయనగరం నుంచి ఉత్తరం రాశాడంటున్నావ్ నే వెళ్ళి ఓమారు కామాక్షిని చూసివస్తా. అటు వాడి సంగతి తెలుస్తుంది. ఇంతకీ నువ్వూ వాడు ఏమైనా దెబ్బలాడుకున్నారా?"

"లేదత్తయ్యా, ఆయన నాతో మాట్లాడితేగా. అసలు దెబ్బలాడుకోడానికి, కొన్ని నెలలైంది నాతో మాటాడి."

నేను చూస్తూనే వున్నానే. ఎక్కడికి వెళ్ళాడో, ఏమో. నువ్ జాగ్రత్తగా ఇల్లు చూసుకో. సాయంకాలం నేరుగా ఇంటికి వచ్చేయ్. బాబీని కూడా తీసుకువెళ్ళేదా?"

"నే ఒక్కర్తినీ ఉండన త్తయ్యా. ఓవారం సెలవు పెట్టి నేనూ వస్తా. నాకు ఒంటరిగా వుండడం అంటే భయమేస్తోంది. మనసు అదోలా వుంది."

"పాపం! సత్తి కాలపుపిల్ల" తల నిమిరింది హైమవతమ్మ.

ఆరోజు విజయనగరం బయల్దేరారు అత్తాకోడళ్ళు.

"అక్కా, బావ రాలేదేం?" వెళ్ళడంతోనే కిరణ్‌ని చేరదీస్తూ అంది కామాక్షి.

"..........."

"ఏమిటో నమ్మా. బండనై మనసు గట్టిచేసుకుని బ్రతుకు తున్నాను. భగవంతుడి లీల ఏదో ఓ కష్టం. మనసుకి శాంతి లేదే తల్లీ. నా బ్రతుకెలా తెల్లవారుతుందో."

"ఏమిటయిందత్తయ్యా!"

"శ్రీనాథ్ ఇల్లువదిలి వెళ్ళిపోయాడు. ఇవాళటికి నాలుగు రోజు లైంది."

"అత్తయ్య మెడలో గొలుసు బ్యాంకులో వెయ్యమన్నారు. ఈ మధ్య ఇక్కడ దొంగతనాలు చాలా జరుగుతున్నాయిలే. అదే అనుకున్నాను...."

"దొంగతనం చేశాడంటావ్. అంతేనా అక్కా?"

"నేననడమెందుకు?"

"పోన్లే. ఆ తర్వాత మాటాడుకుందాం. కోపం వచ్చి ఎక్కడి కైనా వెళ్ళినా, నాలుగు రోజులుండి వచ్చేస్తాడులే. గొలుసు అమ్మేశా డంటే నేనమ్మను."

"నమ్మక పోవడమేమిటీ, ఈ ఊరునుంచే వుత్తరం రాస్తే. ఇదిగో చూడు."

"ఇక్కడికి వచ్చేడేమోననుకుని వచ్చాం. నాన్న ఎక్కడి వెళ్ళాడని ప్రాణం తీస్తున్నాడు వీడు. ఏమని చెప్పనూ. మాయదారి

గుండె జబ్బు ఆయన కొచ్చింది. నాకు రాకూడదూ." కంట తడి పెట్టుకుంది హైమవతమ్మ.

"జోనీ ఎవరైనా స్నేహితుడింటికి వెళ్ళాడేమో. తెలుసుకున్నారా?"

"లేదు. పొద్దున్న వెడితే రాత్రి వస్తుంది జ్యోతి. వాడి సంగతి పట్టించుకునే వాళ్ళెవరు?"

"ఏం చెంటాడా? ఆయన సంగతి పట్టించుకోడానికి," జ్యోతి కోపంగా అడిగింది.

"అదేనమ్మా వరస. నేను చెయ్యగలిగినది లేదు. అనీ అదే మోస్తరుగా తర్క వితర్కాలు చేస్తుంది."

"అసలు జావకి స్నేహితులున్నారా?"

"మొదటినుంచి వాడికి స్నేహితులా లేరు. ఎవరినీ నిచ్చేవారు కాదు మీ మావయ్య. నీకు పెళ్ళి ట్రాన్స్ఫర్ తరవాత తరచూ ఒకాయన వస్తుండేవాడు జ్ఞాపకం వుందా?"

"అతనా. ఎక్కడో యూడీసీగా పని చేస్తున్నాడని చెప్పాడు. అంతే. అవునే కామాక్షి. మా ఆయన ఇల్లు వదలి వెళ్ళిపోయారు ఎక్కడికి వెళ్ళారో తెలుసా అని ఏ ముఖంతో అడుగుతానే? వాళ్ళు చేసేది లేదు సరికదా మన సంసారం విషయాలు రచ్చ కెక్కడం, నలుగురూ నోళ్ళు నొక్కుకోవడం?"

"ఇందులో తప్పేముందీ, రెండు పనులు చేస్తే తప్పు."

హైమవతమ్మ ఈ వాక్యం అనగానే ఘొల్లుమంది జ్యోతి.

అక్కవైపు చూసి, తల దించుకుంది కామాక్షి.

పెద్దవాళ్ళ గొడవలేమీ పట్టనట్టు హాయిగా ఆడుకుంటున్నారు కిరణ్, సుధాకర్.

కామేశ్వరరావ్ వచ్చి జరిగినదంతా విని సానుభూతి చూపించడం తప్ప మరేమీ చెయ్యలేకపోయాడు.

హైమవతమ్మను తన అత్తయ్యగా కామాక్షి ఎదురింటావిడకీ పొరుగు వాళ్ళకూ పరిచయం చేసింది.

కౌసల్యగారూ, రాజేశ్వరిగారూ అంతా మరునటి రోజు

మధ్యాహ్నం వచ్చారు.

"విశాఖలో వుంటున్నారటగా. ఏమిటి పని మీ అబ్బాయికి?"

వచ్చిన ఐదు నిముషాల్లోనే హైమవతమ్మ ఏం భయపడిందో అదే సంభాషణ వచ్చింది.

"అబ్బాయికి ఉద్యోగం లేదు. ఏవో ఆస్తిపాస్తులు చూసుకోడమే." ముభావంగా సమాధానం చెప్పింది. వచ్చిన వాళ్లు ఆమె బాధను అర్థం చేసుకున్నట్టు మరేం ప్రశ్నలు వెయ్యలేదు.

జ్యోతి ఒకటే చిరాకుపడిపోతోంది.

"పోన్లే అక్కా జరిగిందేదో జరిగింది. పరిస్థితులు వాటంతట అవే సర్దుకుంటాయ్. మనం అలా వెళ్ళి బజారు పని చూసుకుందాం క. సుధాకర్ సాయంకాలం వరకూ రాడు. కిరణ్ నిద్దరో డుగా. ఆయన ఆఫీసునుంచి వచ్చి ఏం వెళతాడు. నేనే కు వెళ్ళడం అలవాటు చేసుకున్నాను."

"ఏం కావాలిప్పుడు?"

"చాలా కావాలి పద చెబుతా."

కామాక్షి సంచులు తీసి ప్లాస్టిక్ బ్యాగ్‌లో పెట్టింది. నూనెకో పిల్ఫర్ క్యారియర్ మరో చేత్తో పట్టుకుంది.

"నే పట్టుకుంటాలే" చేతిలో సంచి అందుకుంది జ్యోతి.

"అత్తయ్యా, మేం వెళ్ళి బజారు పని చూసుకుని వస్తాం. మీరు పురాణం కానివ్వండి. ఇదిగో భాగవతం."

"అప్పుసమ్మా, ఈ లోకాభిరామాయణం ఎప్పుడూ వున్నదే. ఓ గంట రామాకృష్ణా అంటే అదే మనకు మిగిలేది."

"—జోళ్ళు తొడుక్కోవేమే?"

"తెగిపోయాయే. బాగు చేయించలేదు" కామాక్షి సర్ది చెప్పింది.

అలా అంటూనే రెండడుగులు ముందు వేస్తే వెనక వెళ్ళక తప్పలేదు జ్యోతికి. అప్పటికి కాని విషయం అర్థంకాలేదు.

ఫస్టు తారీఖు గడిచి వారం రోజులయినా సామాన్లు తెచ్చుకోలేదు. భార్యకు కనీసం జోళ్ళు కొనలేనంత బీదకరింలో ఎందు

కుండాలి?

కామేశ్వర్రావ్‌ను గురించి మొదటి సారిగా అనుమానం వచ్చింది జ్యోతికి.

ముందు బాటా షాపుకి తీసుకు వెళ్ళింది కామాక్షిని.

"ఇప్పుడెందుకే!"

"ఏమైనా రిడక్షన్‌లో ఉన్నాయేమో చూద్దామని."

"రిడక్షన్ సరుకెందుకు లెద్దూ!"

"ఏం, నాలుగైదు రూపాయలు తక్కువకొస్తే, డబ్బు చేదా? ఇది చూడు ఐదు రూపాయలు రిడక్షన్....ఇది నీకు నచ్చిందా?"

"బాగానే ఉంది."

"అయితే తీసుకో....దీనికి బిల్లేయించెయ్యండీ. వేసేసుకుని పద మరెందుకు?"

"ఇప్పుడొద్దులే."

"నేనిస్తున్నాను" మూతు కొత్త అయిదు కాయితాలు తీసి ఇచ్చింది.

సామాన్లు కొనేసరికి మూడు గంటలు దాటిపోయింది.

"ఏమిటీ చదువుతున్నావ్?" వరండాలో కూర్చుని వారపత్రిక చదువుతూన్న అక్కను పలకరిస్తూ అంది కామాక్షి ఆ సాయం కాలం.

"ఇదిగో, ఈ కథ ఎంత బావుందో. ప్లాట్ చాలా బావుంది. చదువుతున్నంతసేపూ ప్రపంచాన్ని మరిచిపోతాం."

"అదే వచ్చిన చిక్కు. ఇంతకీ దేనిగురించేమిటి?"

"ఒకమ్మాయి తన కాలేజీలో చదువుతున్న మరో కుర్రాడితో ప్రేమలో పడి, షికార్లు కొట్టి...."

"నే చెబుతా మిగిలిన కథ, కార్లలో షోర్లు, పార్కుల్లో దొర్లి చివరకు మోసగించబడి బడిపంతుల్ని పెళ్లాడుతుంది. లేకపోతే పంతులమ్మ అవుతుంది. అంతేనా?"

"లేదు లేదు ఆఫీసర్ భార్యే అవుతుంది."

"మరి కాలేజీమేట్?"

"కారు ప్రమాదంలో చనిపోతాడు."

"మరి ఆమె గుండె బద్దలై పోదూ?"

"ఉంటే బద్దలైపోయేదే....ఆమె భగ్నప్రేమికురాలై పోయి ఆఫీసులో పని చేస్తుంటే ఆమెతో ఆఫీసర్ ప్రేమలో పడి పిచ్చి వాడైతే విరిగిన గుండె, లేని గుండె, మళ్ళీ వచ్చి, చచ్చిన గుండె చిగిర్చి, అతనిమీద జాలికొద్దీ...."

"బావుంది. ఈ అద్భుతమైన ప్రేమ కథ మనల్ని నిజజీవితం నుంచీ, బాధ్యతలనుంచీ ఎక్కడికో ఎగరేసుకుపోతుంది. చదువుతున్న కాసేపూ ఆశా లోకంలోకి, ఊహా సౌధాల్లోకీ, మనం పొందలేక పోయిన రంగుల కలల్లోకీ తీసుకుపోయి చివరన అక్కడనుంచి మనసు విరిగేలా, బుర్ర వాచేలా, జీవితంమీద విరక్తి పుట్టేలా కిందకు వదిలేస్తుంది. అంతేనా.. "

"ఆఁ ఈ కబుర్లు చెప్పడానికేం. చదివిన నాలుగు నిమిషాలైనా కసీసం హాయిగా బ్రతకాలనుకోడంలో తప్పేమిటీ ...నిజజీవితంలో నాకేం ఉందనీ....భర్త చిన్నచూపు చూసిన భార్యను ... వదిలేసిన అబలను...."

"అసలు భర్త చిన్నచూపు ఎందుకు చూశాడూ....వదిలేశాడ' ఎందుకనుకోవాలి?"

"ఎప్పుడో ఆయన ప్రయోజకులై తల్లినీ బిడ్డనీ తీసుకెడతారట. మరి కట్టుకున్న నన్ను పూర్తిగా మరిచిపోయినట్టున్నారు."

"బావ చేసినది, ఆ మేరకు తప్పే. కాని అసలు ఎందుకు చేసి ఉంటాడు?"

"ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్."

"నాకన్న చదువుకున్నదానివే. కాదనను....ఆ కాంప్లెక్స్ అతనిలో ప్రవేశపెట్టినదెవరు? నీ ఉద్దేశంలో బావ ఉద్యోగంలేనివాడు. నీ ధనార్జనమీద ఆధారపడి ఉన్నాడు. కాబట్టి చిన్నతనం పడుతున్నాడని నీ ఉద్దేశ్యం. అలా అయితే నిన్ను చేసుకోనే పోనుగా. ఆ కాంప్లెక్సే ఉంటే ఇన్నాళ్ళెందుకుంటాడూ, ఎప్పుడో వెళ్ళిపోయి ఉండును. నువ్ పొరపాటు పడుతున్నావ్ అక్కా. బావ నిన్ను

ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు. నువ్వంటే బావకి ఎంత అభిమానమో నాకు తెలుసు. ఏ మగాడైనా భార్య పరాయివాడితో... "

"ఏమిటే నువ్వంటున్నది?"

"అక్కా నా దగ్గర దాస్తావెందుకూ? నేను చూశాను. బావ మనసులో ఏదో చెప్పలేనంత విచారం-మనిషి మాటల్లో వైరాగ్యం. బావ ఇల్లాంటిదేదో చేస్తాడని నేను ఆ రోజే అనుకున్నాను."

"ఏ రోజు?"

"నా నోటివెంట చెప్పించాలని ఉంటే విను. ఆ రోజు క్వాలిటీలో....

"చాలు. నువ్ చూసివుంటావని అనుకున్నాను నేను ఆరోజు. ఇన్ని శ్రీరంగనీతులు చెబుతున్నదానివి నువ్వు బావతో ఎందుకు షికారు కెళ్ళావ్?"

"చల్లారిపోయిందా నీ కసి! నువ్వా మాట అన్నంత మాత్రాన నా విలువ ఏం తగ్గిపోలేదు. బావ నాకు తండ్రిలాంటివాడు. పిల్లి కళ్ళు మూసుకు పాలు తాగుతూ లోకమంతా గుడ్డిదనుకుంటుందని సామెత. వచ్చి నాలుగురోజులున్న నాకే నీ ప్రతాపం తెలిస్తే బావకి తెలియకుండా ఉంటుందనుకున్నావా? బ్యాంకులో ఉద్యోగం రాత్రి ఏనిమిదింటివరకూ అంటే ఒకరోజు, రెండురోజులు ఎవరైనా నమ్మగలరు. కాని రోజూనా? బావ అంత మూర్ఖుడా? వేదాంతిలా మాటాడుతుండడం విన్నప్పుడే అనుకున్నాను. చివరికి చెబుతున్నా విను. ఆ రోజు బావతో చెప్పాకూడా, నీకు అన్యాయం చెయ్యవద్దని."

"నువ్ చూసినవి చెప్పావన్నమాట! అంత తెలివైనదానివి నీ సంసారం నువ్ చక్కపరచుకోగలుగుతున్నావా? పెద్ద కబుర్లు చెప్పడం కాదు. ఇంటికేమిస్తాడో ఏమో, రెండో బిడ్డని కనడానికి ధైర్యంలేక చెయ్యకూడని పని చేశావ్. అయిదారు వందలు తెచ్చుకుంటూ ఈ పూట భత్యాలెందుకు? రాత్రి పదింటివరకూ పేకాట, అంతేనా?"

"నేను కాదనలేను. ఆయన ఇల్లు పట్టించుకోరు పేకాట ఆడుతూ. అందుకని నన్ను మరొకరితో ఊరేగమన్నావా? అక్కా మనం ఇంకా బరితెగించేటంత నాగరికులం కాలేదు. మన సంసారం

మన బాధ్యత. దానిని నిలబెట్టుకున్నా, కూలదోసుకున్నా తరవాత అనుభవించవలసింది మనమే. కేవలం డబ్బు సంపాదిస్తూ జీవించ గలుగుతున్న మాత్రాన భర్తను తృణీకరించడం, నేను ఆయన పెద్దతనాన్ని కప్పిపుచ్చడంకంటే ఘోరమైన పొరపాటు. జరిగింది జరిగేపోయింది. నేను నీకు చెప్పవలసినదానిని కాదని తెలుసు. నిజం మాటాడి నీ మనసు నొప్పించాను. బావకు అపచారం చేశానని నేను బాధపడుతున్నాను.... నా సంసారం కూడగట్టుకునేందుకు నువ్ ఏ సలహా ఇచ్చినా సంతోషంగా పాటిస్తాను. నాకు ఒక్కటే కోరిక. నువ్వూ బావా సుఖంగా ఉంటే చూడాలని. భార్యాభర్తల పోట్లాట లలో నలిగిపోయేవీ, ఒకసారి నలిగితే మళ్ళీ తేరుకోలేనివీ, పిల్లల మనసులు...."

గొంతు వణికింది కామాక్షికి.

"ఏమిటో అక్కాచెల్లెళ్ళిద్దరూ మౌనంగా కూచున్నారు—" లోపలికి రాగానే అన్నాడు కామేశ్వర్రావ్.

కామాక్షి చటుక్కున లోపలికెళ్ళిపోయింది. ఆ వెనుకే కామేశ్వరరావూ లోపలికెళ్ళాడు.

—అక్కా, చెల్లెళ్ళమధ్య చర్చ అలా ఆగిపోయినా ఇద్దరి మనసుల్లోనూ ఆ చర్చను గురించిన ఆలోచనలే వున్నాయి.

భోజనాలదగ్గర మాటల్లో అంది జ్యోతి "రేపు ప్రొద్దున్న వెళ్ళిపోతాం" అని. చెల్లెలు, మరదీ సెలవుంది కదా నాలుగురోజు లుండమన్నా వినలేదు.

ఆ రాత్రి "అక్కా, నీ మనసు బాధపెట్టినందుకు క్షమించు. అందుకని కోపంతో వెళ్ళిపోకు. రాకరాక వచ్చావ్. ఈ నాలుగు రోజులూ ఉండు" అంది కామాక్షి అక్కతో వంటరిగా మాట్లాడుతూ.

"లేదు కామాక్షీ, నాకు కోపం రాలేదు. ఆడవాళ్ళ ఉద్యోగాలు చూసేవాళ్ళకి ఆనందంగా ఉంటాయ్. దానికేం మహారాజులా డబ్బు సంపాయించుకుంటోందని నలుగురూ అంటారు. కాని తీరా ఉద్యోగం లోకి వెళ్ళాక మనం ఊహించని పరిస్థితులు ఎదురౌతాయి. మా ఏజంటు చాలా తెలివైనవాడు. నా స్వభావం తెలుసుగా. మగాళ్ళతో

ఫ్రీగా మాటాడడం నాకు బాగా అలవాటు, అమ్మ అంటూనే ఉంది జ్ఞాపకం ఉందా? మూర్తి నన్ను పొగడనిరోజు లేదు. ఆఫీసు పని అయిపోయినా 'ఉండండి, కలిపి వెళదాం' అనేవాడు.

—కొన్నాళ్ళుగా ఆత్మీయతకీ, అనురాగానికీ ముఖంవాచి ఉన్నానేమో కాదనలేకపోయేదాన్ని.

ఏం చేస్తున్నానో తెలుసుననుకునే ఈ వ్యవహారంలో తల దూర్చాను. నా ఉద్యోగంలో మీదకు వెళ్ళే అవకాశాలన్నీ అతనిమీదే ఆధారపడి ఉంటాయ్. ఇది విచారకరమైన స్వార్థం. మూర్తి సహాయంతో రెండు పరీక్షలు ప్యాసయ్యాను. మా స్నేహమూ చిక్కపడింది. ఇలా విషమిస్తుందనుకోలేదు. ఇప్పుడు నన్నేం చెయ్యమంటావ్ కామాక్షీ...."

"ఆడది కాలుజారితే క్షమించగలిగినంత విశాలదృష్టి మన సంఘం సంపాదించుకోలేదు అక్కా! అందుకే ఎంత సమానులమని అనుకుంటున్నా, వేదికలెక్కి ఎన్ని ఉపన్యాసాలిచ్చినా, మన గౌరవం మనం నిలబెట్టుకోవలసిన బాధ్యత కూడా ఉంది. ఇవన్నీ తెలిసినా మానసిక దౌర్బల్యానికి నేనూ లోనయ్యాను. నేనుమాత్రం తప్పు చెయ్యలేదూ? బావకు నేను ఈ విషయం చెప్పాలని అనుకున్నా చూసినదేమిటి? ఏంచెప్పగలను? బావ బాధపడుతున్నడానికి ఒక ఆధారం ఉందని మాత్రం తెలుసుకున్నాను. బావను మూర్తి జాలి వేసింది. అతనిలో ఆత్మవిశ్వాసం పెంపొందిస్తావనుకున్నాను."

"మరింత కుంగదీశాను, దీనంతటకీ కారణం మూర్తి. అతని స్వార్థం. నేను రేపు అతని ఇంటికి వెళ్ళి అతని భార్యను రెచ్చగొడితే...."

"వద్దు అక్కా, వద్దు. ఉద్రేకపడి అలాంటి పని చెయ్యకు. వారిద్దరూ, మీలాగే విడిపోతే మాత్రం నీ సంసారం చక్కబడుతుందా! ఇక బావ మాటా. నాకు మాట ఇచ్చాడు. తిరిగివస్తాడనే నా నమ్మకం."

"లేదు కామాక్షీ. ఆయనతో కాపురం చేసినదాన్ని నేను. ఒక నిర్ణయానికి వస్తే దాన్ని ఏ పరిస్థితుల్లోనూ మార్చుకోరు. ఎన్నోసార్లు

చెప్పాను. మెట్రిక్ ప్యాసుకమ్మని. కొన్ని నెలలు కష్టపడితే సరి పోయేది. ససేమిరా కాదన్నారు. పెద్దలు చేసిన పాపాలకి పిన్నలు శిక్ష అనుభవించాల్సిందే నన్నారు. ఓ ముద్దూ ముచ్చటా లేకుండా యంత్రంలా జీవిస్తూ జీవితంలోకి చాటుగా వెలుగు తెచ్చుకోవాలను కున్నాను. దగా పడ్డాను."

"విచారించకక్కా! ధైర్యంగా నువ్ మంచిదనుకున్నది చెయ్యి. తరవాత...."

"ఎలాగో జరుగుతుంది.... జీవితం....ప్చ్....సరే పడుకో.... ప్రొద్దున్నే లేవాలి....ఫస్ట్ బస్‌కే వెళ్తాను. బాంక్‌కి వీలైతే అందుకోవచ్చుకూడా" లేచింది జ్యోతి.

## 5

విజయనగరం స్టేషన్లో అనిపించింది శ్రీనాథ్‌కి తల్లి మనసు బాధపెట్టినవాడవుతాడని. జ్యోతి తనగురించి విచారించదని తనకు తెలుసు. ఆమెకే తనమీద ఏమాత్రం అపేక్ష ఉన్నా ఇలాంటి నిర్ణయం తీసుకోవాల్సిన అవసరం ఉండేది కాదు. రైలు ఎంతసేపు ఆగు తుందో కనుక్కొని మొదటి ప్లాట్‌ఫారంమీదకొచ్చి కార్డు కొని నాలుగు ముక్కలు రాసి అక్కడే ఉన్న పోస్టుబాక్సులో పడేశాడు.

రైలు పార్వతీపురం చేరేసరికి పది దాటిపోయింది.

అంతరాత్రి స్నేహితుడి ఇల్లు వెదుక్కోవడం కష్టం. తెల్ల వారిన తరవాత ఆలోచించి ఇల్లు వెదకడమా, ఆఫీసులో కలవడమా అన్నది నిర్ణయించుకోవచ్చునని వెయిటింగ్ రూమ్‌లోనే పడుకున్నాడు.

అర్ధరాత్రి. చలి. సిమెంటు దిమ్మ. భవిష్యత్తు గురించి ఆలోచన. ఏదిఏమైనా మళ్ళీ ఇంటికి వెళ్ళడం అసంభవం. వెళితే తన కాళ్ళమీద తను నుంచుని కుటుంబాన్ని పోషించగలిగిననాడే.

చలితో కలత నిద్ర. తెల్లవారింది.

ప్లాట్‌ఫారంమీద కుళాయిదగ్గర ముఖం కడుక్కొని ఊర్లోకి వెళ్ళాడు. కాఫీహోటల్లో టిఫినూ కాఫీ ముగించుకుని రిక్షా స్టాండుకు దూరంగా నుంచున్నాడు వచ్చేపోయేవాళ్ళను చూస్తూ.

ఎనిమిదవుతుండగా ఒక రిక్షావాడ్ని పిలిచాడు.

"ఎక్కడికి వెళ్ళాలి బాబూ?"

"మునిసిపల్ ఆఫీసుకి."

"సలభై పైసలిప్పించండి."

"పద" అంటూ రిక్షా ఎక్కి కూర్చున్నాడు శ్రీనాథ్.

"ఈ ఊరు కొత్తా బాబూ?" దారిలో రిక్షావా డడిగాడు.

"అవును."

ఐదునిముషాల్లో టౌన్ జంక్షన్‌కి వచ్చేశారు. మరో రెండు నిముషాల్లో మునిసిపల్ ఆఫీసూ వచ్చింది.

చిన్న ఇల్లు. బయటినుంచి చూస్తే ఆఫీసులాగే లేదు. బ్యాగు పట్టుకు దిగుతూ అడిగాడు శ్రీనాథ్. "నీ పేరు?"

"వెంటయ్య బాబూ!"

"ఎక్కడుంటావ్, అదే నీ ఇల్లెక్కడ?"

"బెలగాంలోనే గెడ్డెనకాల. ఏం బాబూ అలా అడుగుతున్నారు?"

"ఏంలేదులే. వెళ్ళు." అర్ధరూపాయిచ్చి పదిపైసలిస్తూ ఉంచే 'ఉంచు' అని లోపల కెళ్ళాడు.

"రామచంద్రమూర్తి ఎక్కడుంటాడు బాబూ?"

"మేనేజర్‌గారా?"

"విశాఖపట్నంనుంచి వచ్చాడే ఆయన."

"అవును బాబూ, ఆయనే మేనేజర్‌గారు. పదకొండయ్యాక వస్తారు. తమదేవూరు బాబూ?"

"మాది విశాఖపట్నమే."

"అలాగా, ఇల్లు తెలీదా బాబూ.... నే చూపిస్తా రండి.... ఏమ్ డ్రైవరూ....బాబుని మేనేజరుగారింటికి తీసుకెళ్ళు...."

"నా కెరికే బాబూ, మేనేజరుగారిల్లంటే నేనే తీసుకెళదునుగా. రండి రండి."

"నేనుంటా బాబూ!"

ప్యూన్ లోపల కెళ్ళిపోయాడు.

రామచంద్రమూర్తి పేపరు చదువుకుంటున్నాడు కుర్చీలో

కూచుని.

"ఓరి, నువ్వా, ఎవరో అనుకున్నా, చెప్పాపెట్టకుండా - ఇలా దిగావ్, రా, రా.... మా ఇల్లెలా తెలిసిందీ?"

"నువ్ ఈ ఊళ్ళో ఇంత పెద్దవాడివని తెలీదు. రిక్షావాడికి నీ ఇల్లు తెలుసట!" మరో పావలా ఇస్తే సంతోషంగా పట్టుకెళ్ళాడు వెంటయ్య.

"ఎప్పుడొచ్చావ్. మనిషి వేమిటీ అలా చిక్కిపోయావ్?"

"ఏంలేదులే.... గెడ్డం గీసుకోలేదంతే.... ఇప్పుడే వస్తున్నా."

"ముందు స్నానం చెయ్యి. తరవాత మాటాడుకుందాం.... వసూ, శ్రీనాథ్ వచ్చాడు."

"ఉష్...." చెవిలో చెప్పాడు రామచంద్రమూర్తికి శ్రీనాథ్ నాలుగు మాటలు.

".... ఆఁ పెరట్లో ఉన్నావా! ఇదిగో వీడే నా స్నేహితుడు శ్రీనాథ్...."

"ఆఁ! బావున్నారా? మీ జ్యోతిగారూ, మీ అమ్మగారూ, మీ బాబూ?"

"ఆఁ బావున్నారండీ, చాలా చెప్పినట్టున్నావే, మీ ఆవిడతో."

భోజనం చేస్తూ అడిగాడు మూర్తి.

"కిరణ్ తరవాత?"

"...చాలు చాల్లేరా బాబూ, నీకు ఒకటే విచారం, పిల్లలు కనగానే సరా, ఈ రోజుల్లో వాళ్ళను పెంచి పెద్దచెయ్యడం ఎంత కష్టం? కన్నందుకు మనమీద ఉసూరుమంటారు పెద్దయ్యాక."

ఏదో అనుమానం వేసింది మూర్తికి.

"ఇంట్లో చెప్పే వచ్చావా?"

"లేదు."

"ఆఁ?"

"అంతా చెబుతాగా, నువ్ ఆఫీసుకు వెళ్ళిరా!"

"మరికొంచెం కూర వేసుకోండి. మొహమాటపడుతున్నారు."

"నాకు మొహమాటం లేదమ్మా, ఒరేయ్ అని ఆప్యాయంగా

పిలిచే స్నేహితుడు నాకు వీడొక్కడే! అమ్మా పూర్వజన్మ సుకృతం ఉంటేనే కాని మంచి జీవితం ఎలా వస్తుంది. మావాడు అదృష్ట వంతుడు. మీలాంటి గుణవంతురాలు దొరకడం అదృష్టం. ప్రేమా అనురాగం రక్తసంబంధాల నిచ్చేవి కాదమ్మా! మనసులో ఉండాలి మంచితనం."

వసుంధర శ్రీనాధ్‌కోసం మంచం పక్క ఏర్పాటు చేసింది. రాత్రి నిద్రలేదేమో వెంటనే నిద్రపట్టేసింది శ్రీనాథ్‌కి.

రెండయాక మూర్తి వచ్చాక తెలివివచ్చింది.

లేచేసరికి టిఫినూ కాఫీ ఇచ్చింది వసుంధర.

"ఒరేయ్ రామం! నీ దగ్గరకి ఓ అవసరంమీద వచ్చాను. నువ్ నన్ను ఈ పరిస్థితిలో ఆదుకుని నన్నూ ఒక మనిషిని చెయ్యాలి. తోటిమనిషి సహాయం అర్థించడానికి కూడా కొన్ని అర్హతలు ఉండాలి. అవి నా కున్నాయో లేదో తెలియదు కాని...."

"ఏమిట్రా వచ్చినదగ్గరనుంచి వింతగా మాట్లాడుతున్నావ్. ఏనాటిది మన స్నేహం?"

"అవన్నీ సరేననుకో. అందుకే నా కష్టం నువ్ అర్థం చేసు కుంటావనే నిర్ణయానికి వచ్చాను. కట్టుకున్న ఆడదాని సంపాదన ఆధారపడే మగాడి జీవితంకంటే హీనమైన జీవితం మరొకటి ఉండదు...."

ఏదో అడుగుదామనుకున్నా మిత్రుడు వాక్ప్రవంతిని అడ్డటం ఇష్టంలేక మౌనం వహించాడు రామచంద్రమూర్తి.

"మనిషిగా బ్రతకాలంటే మగాడు డబ్బు సంపాయించాలి. ఇన్నాళ్ళూ ఉపేక్షించడం నా ఖర్మ. ఎస్సెల్సీ పోయినా, తరవాతైనా కన్ను తెరవవలసింది. ఆలోచించి ఆలోచించి ఓ నిశ్చయానికి వచ్చాను. జీవితానికి ఓ మలుపును సాధించాలి. నేను చెప్పినది నీకు రుచించదు, ఎబ్బెట్టుగా, అసహ్యంగా కనపడుతుంది. కాని జీవ చ్ఛవంలా, విలువలేని మనిషిగా బ్రతికేకన్నా, ఏ చిన్న పనైనా చేసి స్వతంత్రంగా బ్రతకడం మేలు...."

బయట సైకిల్ బెల్ చప్పుడైంది.

"ఎవరూ?" అంటూ వసుంధర వీధి వరండాలోకి వెళ్ళింది.

"అమ్మా, బాబుగారున్నారా?"

జిడ్డు మరకలతో ఉన్న ఖాకీబట్టల కుర్రాడు అడిగాడు.

"ఉన్నారు. ఎందుకు?"

"ఓమాట చెప్పాలన్నారమ్మా, చెయిర్మన్‌గారు."

మూర్తి ఈ మాటలు విని ఇవతలకొచ్చాడు.

"చెయిర్మన్‌గారు మిమ్మల్ని ఒకసారి రమ్మన్నారు. ఏదో విషయం మాటాడాలట. ఆఫీసు కెళితే రెండోపూట శెలవుపెట్టారని చెప్పారు. ఒక్క ఐదునిముషాలు వచ్చి వెళ్ళమన్నారు."

"సరే వస్తానని చెప్పు. ఆరింటికి వస్తా."

"నా మనసులో ఈ ఆలోచన చాలా రోజులనుంచి ఉంది. నాకేమని విర్రవీగినందుకు దైవం తగిన సాయం చేశాడు. వడ్డీ వ్యాపారంచేసి రూపాయికి రూపాయి వడ్డీ తీసుకుని ఎంతమంది ఉసురుపోసుకున్నారో. నాకే ఖర్మపట్టింది.

"పోన్లెద్దూ. అవన్నీ ఇప్పుడు ఎందుకు తలుచుకోవడం?"

"నాకు ఉద్యోగం రావడం అసాధ్యం. వ్యాపారానికి మదుపు కావాలి. అమ్మ గొలుసు అమ్మి రెండువేలు తెచ్చా. రెండు రిక్షాలు కొని, ఒకటి అద్దెకిచ్చి, రెండోది తొక్కుకుని కాలక్షేపం చెయ్యాలని ఉద్దేశ్యం. లైసెన్సులూ వ్యవహారం నువ్వే చూసిపెట్టాలి."

"నువ్వు తీసుకున్న నిర్ణయంలో అసహ్యించుకోవలసిందేదీ లేదు. కలిసివస్తే అన్నీ కలిసివస్తాయి. నేను సాయంకాలం చెయిర్మన్‌గారి దగ్గరకు ఎలాగూ వెళుతున్నాను. మంచివాడు. కాస్త కష్టం విలువ తెలిసినవాడు. తప్పకుండా సాయంచేస్తాడు. నీ ప్రయత్నం వసూకి తెలియడంలో నీకేమైనా అభ్యంతరమా?"

"ఆమె నాకు చెల్లెలులాంటిది. నా కష్టాన్ని అర్థం చేసుకోగలిగిన మనిషి. కాని ఏ పరిస్థితుల్లోనూ నా ఉనికి, అమ్మకి కాని, జ్యోతికికాని తెలియకూడదు. అంతే."

* * *

తలుపు తెరవగానే సింహం అంత కుక్క ఒకసారు తలెత్తి చూసింది.

"జానీ....ఏమోయ్ పంతులూ, సెలవ్ పెట్టావట."

చెయిర్మన్‌గారే పలకరించారు రామచంద్రమూర్తిని.

"మధ్యాహ్నంవరకూ ఆఫీసులోనే ఉన్నాను. మా స్నేహితుడు వచ్చాడు. వాడితో మాటాడవలసిన పని ఉండి...."

"అదిసరేలే. ఆ కంట్రాక్టర్ లబో దిబోమంటున్నాడు. వాడి ఉసురుపోసుకోడం మనకి మంచిదికాదు. కౌన్సిలర్లు ఇద్దరూ డబ్బు కొట్టేశారట. చివరకు ఎనిమిదివేలు నష్టం వచ్చిందిట.... ఈసారి టెండర్లో...."

"అలాగేసార్. మీరు తలుచుకుంటే అదెంత పని?" రామచంద్రమూర్తి అంటూండగానే.

"బాబూ, బండికి ఏక్సిడెంటయిందట?"

పరిగెట్టి వచ్చాడొక వ్యక్తి.

"ఎవరికైనా ప్రాణహాని...."

"అదేం లేదుబాబూ. లారీని ఢీకొంది. గ్లాస్‌పోయింది. ఎవరికీ దెబ్బలు తగల్లేదు. లారీ ఇంజనుమాత్రం దెబ్బతిన్నట్టుంది. ట్రాఫిక్ ఇన్‌స్పెక్టర్...."

"ఒరేయ్ డ్రైవర్‌ని కారు తియ్యమని చెప్పు. లారీవాడికి కాస్త డబ్బిచ్చి పంపించే ఏర్పాటు చెయ్యమను. ఫోర్మన్‌ను అక్కడికి వెళ్ళమను. మిగిలినవన్నీ నేను చూసుకుంటా!"

"పంతులూ అలా వెళ్ళివద్దాం వస్తావా? ఈయనెవరూ?"

"మావాడే. చెప్పానుగా విశాఖపట్నంనుంచి వచ్చాడని."

"నమస్కారం పంతులుగారూ, అలా నుంచుండిపోయారు. నా గొడవలో నేను చూడనే లేదు. రండి కూచోండి. నేను ఒక్క నిముషంలో వచ్చేస్తా."

లోపలకెళ్ళి బట్టలు మార్చుకుని వచ్చారు వినయభూషణంగారు. షెడ్‌లోంచి కారు తీసుకువచ్చాడు డ్రైవర్.

"రండిసార్! మా ఊరు చూద్దురుగాని!"

ఛెయిర్మన్‌గారి మాటల తీరులో ఎంతో స్నేహభావం కని పించింది శ్రీనాథ్‌కి.

"మీరు ముందుకు రండి" ఆయనే పిలిచారు.

బితుకు బితుకుగానే కూచున్నాడు శ్రీనాథ్ వినయభూషణంగారి పక్క.

డ్రైవర్ ఇంటిదగ్గరే ఉండిపోయాడు.

ఆ యాక్సిడెంట్ గురించి ట్రేక్ ఇన్‌స్పెక్టర్‌తో మాట్లాడి ఆ వ్యవహారం సెటిలయ్యేవరకూ ఛేయిర్‌మన్‌గారితోనే ఉన్నారు మిత్రులిద్దరూ.

"పద మీ ఇంటిదగ్గర దింపేస్తా!" అన్నారు ఆయన పనంతా అయ్యాక.

"సార్, మీతో మాటాడాలిసార్....అందుకనే స్నేహితుణ్ణీ తీసుకొచ్చా...."

"చెప్పవోయ్."

"రెండు లైసెన్సులు కొత్త రిక్షాలకి మావాడి పేరున. మీరు ఏఓతే కమిషనర్‌గారు కాదనరు."

"ఓస్ అదేనా, రేపు చెబుతా....లేకపోతే నేను చెప్పానని నువ్ చెప్పు....మా ఊరు చూద్దురుగాని...." అలా ఓసారి తిప్పి మూర్తి ఇంటిదగ్గర యిద్దరినీ డ్రాప్‌చేసి వెళ్ళిపోయారు వినయభూషణం గారు.

సాయంత్రం టీ తాగాక "అలా పద వెళదాం" శ్రీనాథ్ బయలుదేరతీశాడు మూర్తిని.

"బెలగాం వెళదాం రా....గెడ్డెక్కడ వుంది?"

"అదెందుకూ?"

"చెబుతాగా పద."

—"బాబూ రిక్షా—"

రిక్షాలో కూచున్నాక రిక్షావాడినడిగాడు "పెంటయ్య ఇల్లెక్కడ" అని.

గెడ్డదగ్గర దింపేశాడు రిక్షావాడు.

అర్ధరూపాయి తీసిచ్చాడు మూర్తి.

"తను దగ్గిర డబ్బు పుచ్చుకుంటానా?"

వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

"ఏమిటి నీ దగ్గర వాడి అవసరం."

"ఇది ఈ ఊరు పద్ధతి. అందుకే నే రిక్షా ఎక్కాను."

—మురికి కంపూ, ఊరిచెత్తా, అంతా ఆ గెడ్డ ఒడ్డునే ఉన్నట్టు ముక్కు బద్దలైపోతోంది. వరసగా పాకలు.

రామచంద్రమూర్తి అయోమయంలో పడ్డాడు. లైసెన్స్‌ల కోసం రికమెండ్ చేశాడేకాని శ్రీనాధ్ రిక్షా ఎలా తొక్కగలడో ఊహించలేదు. ఏదైనా ఉద్యోగమే యిచ్చునేమో, భూషణంగారి నడిగితే.

"ఇప్పుడే వస్తా. ఇక్కడే ఉండు" అని శ్రీనాథ్ పేటలోకి వెళ్ళాడు. రెండు నిముషాలు కాకుండానే వచ్చేశాడు.

"నువ్ రిక్షా ఎప్పుడైనా తొక్కావా?"

"లేదు నేర్చుకుంటా. ఇక ఈ పేటే నా నివాసం."

"శ్రీనాధ్! నన్ను క్షమించు. ముందు ఆలోచన లేకుండా అడిగేశాను. ఆయనకూ తెలిసి ఉండదు. నువ్ రిక్షా లాగటానికి అడుగుతావని అతనెలా అనుకుంటాడూ? ఇవాళా రేపూ, సాధ్యం కాకపోయినా ఓ వారంరోజులు వ్యవధి ఇస్తే ఆయన్ని అడిగి ఏదైనా ఉద్యోగం వేయిస్తాను, పద వెళదాం."

"నువ్ అనవసరంగా ఆవేశపడకు. ఆవేశంతో ఈ నిర్ణయానికి రాలేదు నేను. కష్టపడడంలో సిగ్గు దేనికి? నువ్‌మాత్రం నన్ను ఆపకు. నేను అవసరమొచ్చినప్పుడు నీదగ్గరికి వస్తా."

"పోనీ నేను ఆపకపోతే, వసుంధరో. అది ఊరుకుంటుందా?"

"అయితే నే వెనక్కి వెళ్ళిపోయానని చెప్పేయ్!"

"నువ్ చేస్తున్న పనేమిటో ఆలోచించే చేస్తున్నావా?"

"నిజంగా ఆలోచించాను. ఏనాడో చెయ్యవలసిన పని. పిరికివాడిని. చెయ్యలేకపోయాను. ఇప్పటికైనా మంచి బుద్ధి పుట్టింది. దైవేచ్ఛ."

తిరిగి ఇంటికి వచ్చి ఇద్దరూ భోజనాలుచేశారు.

"పీడి ధర్మమా అంటూ ఓ లారీ చూసిపెట్టాడు. నే వెళతానమ్మా."

"ఇప్పుడే!"

"ఏదో చూడాలని వచ్చాను. వెళతున్నా! మళ్ళీ వస్తాలెండి." బ్యాగ్ తీసుకుని వెళ్ళిపోయాడు శ్రీనాధ్.

వీధివరకూ వచ్చిన మూర్తికి 'ఇది నీదగ్గర ఉంచు' అంటూ ఓ కవరు అందించి ముందుకు సాగిపోయాడు. గెడ్డదగ్గర చాలాసేపు ఆగి పేటలోకి వెళ్ళాడు.

"పెంటయ్యా!"

"ఎవరుబాబూ!" పాకలోపలనుంచి గొంతు.

"ఎవరో వచ్చారు మాఁవా, నీకోసం. ఇందాకోమారు వచ్చేరు."

తలుపులాంటి తడికను తోసుకుని బయటకు వచ్చాడు. దూరంగా ఉంది మునిసిపల్ దీపం.

"నే పొద్దున్న నీ బండి ఎక్కానుగా...."

పెంటయ్యకు భయంవేసింది. కొంపదీసి బండిలో యేదో పడేసుకున్నాడేమో!

"అవునుబాబూ...."

"పెంటయ్యా, నీ సాయం కావాలి."

దీపం కిందకి తీసుకెళ్ళి చెప్పాడు పెంటయ్యకి.

రెండురోజుల తర్వాత టౌన్ స్టాండుదగ్గర అడిగాడు పెంటయ్యని ఒకో డ్రైవరు.

"ఎవ్రోయ్, మాఁవా, కొత్తోడు కూస్త సదువుకున్నోట్టున్నాడూ!"

"ఆడి కతే ఏరు. మా పెత్తండ్రి కొడుకు. బతికిసెడ్డోడు. ఆడినేం నొప్పించకేఁ! నీ పున్నెఁవుంటుంది."

"మీ ఇంటికాడే ఉంటున్నాడా?"

"మా ఇంటో నోటెక్కడిదీ? ఆ సివరిల్లు లేదూ, లారీ

యాసిడెంట్‌లో సచ్చిపోయినోడి ఇల్లు. కాలీగుండిపోనాది. దాంట్లెట్టిం చీసే ఆడిసంసారం. ఆడికేటి ఒంటిగోడు.ఇంత కాసుకుతింటన్నాడు."

"ఆడికేం, ఇటు రికసా అద్దే అటు కూలి డబ్బులూ రెండూ వున్నాయ్‌గా!"

"ఆడెన్ని బాధలు పడ్డాడో నేకేటెరిక? పోలీస్‌టేషన్ ముందు నాలుగురోజులు సెడ బాధపడిపోనాడు. సదువుకుని ఉజ్జోగం సెయ్య వల్సినోడు, ఆడి కరమ. ఇప్పుడలవాటైపోయాడ్లే."

"ఆడి బండెవడి కిత్తన్నాడూ?"

"ఏం నీకు తెలిసినోడెవరేనా ఉన్నాడా?"

"మా అన్నయ్య కొడుక్కి కావాలి. మన సావుకార్లకంటె కూసింత సవగ్గిస్తే...."

"నే కనుక్కుసెస్తాలే."

మొదటి మూడు రోజుల్లో ఖర్చులు పోను మిగిలిన డబ్బు తిరపతి పంపిస్తానని మొక్కుకున్నాడు శ్రీనాథ్.

నాలుగోరోజే జ్వరం.

రెండురోజులు మళ్ళీ వీధిలోకి వెళ్ళలేదు.

మొదటిసారిగా భయంవేసింది. తనకేమైనా అయితే తల్లికెలా తెలుస్తుంది. ఒకవేళ తల్లికేమైనా అయితే....

వెంటయ్యకు అడ్రసిచ్చాడు.

వెంటయ్య రోజుకి నాలుగైదుసార్లు వచ్చి చూసి వెళ్ళేవాడు. డాక్టరు దగ్గరికి వెళ్ళి మందూ మాకూ తెచ్చాడు.

మూడోరోజు జ్వరం తగ్గింది. అయినా మరో రెండురోజులు పని చెయ్యలేకపోయాడు శ్రీనాథ్.

నెలలు గడుస్తున్నాయ్.

మొదట్లో వింతగా చూసినా ఆ పేటలో అందరికీ ఆత్మీయుడై పోయి శ్రీనాథ్ సిరిగాడుగా మారిపోయాడు.

(6)

శ్రీదేవిమీద ఒళ్ళు మండిపోయింది రాధాకృష్ణమూర్తికి. ఆడదైనా ఎంత అహంకారం! ఫోన్‌చేస్తే తల్లిచేతి కిచ్చేస్తుందా!

జ్యోతి ఊళ్ళో లేదు. ఎక్కడికెళ్ళిందో తెలీదు. చెప్పకుండా ఎక్కడికి వెళ్ళి ఉంటుంది చెప్మా. వారం శెలవు పెట్టింది. అంటే చాలా దూరం వెళ్ళివుండాలి.

అయినా మరోసారి ప్రయత్నించేద్దామన్న ఉద్దేశ్యంతో ఆ సాయంకాలం అటు వెళ్ళాడు. ఇంటికి తాళం పెట్టి ఉంది. చిరాకేసింది అతనికి. ఎవరినన్నా అడగాలన్నా ఏమని అడగాలో తెలియని అయోమయం.

చీకటిపడుతుండగా మరో ఆలోచన వచ్చింది. తృప్తిగా నవ్వుకున్నాడు మూర్తి.

అలా ఎకౌంటెంట్ విశ్రలావ్ ఇంటికి వెళ్ళాడు.

"నమస్తేసార్! రండి, రండి."

విశ్రలావ్ ఆహ్వానించాడు.

"ఏమిటండీ విశ్రలావుగారు సాయంకాలం ఇంట్లోనే ఉన్నారు. దొరుకుతారో లేవో అనుకున్నాను."

"ఎక్కడికెళతాను సార్. మా ఆవిడ పేరంటానికి వెళ్ళింది. ఇంటిదగ్గర ఎవరూ లేరు. తాళంవేసి వెళ్ళడమంటే నాకు భయం."

"అవున్లెండి, మనజాగ్రత్త మనకి ఉండాలి. నేను అర్జంటుగా కాకినాడ వెళ్ళాలి. ఈ రాత్రి బస్సుకి బయలుదేరుతున్నా. ఇవిగో తాళాలు—మీరు చూసుకోండి. ఇదిగో కాగితం. సాధ్యమైనంత వేగం వచ్చేస్తా. అవసరమైతే ఈ కాగితం ఉపయోగించండి. మీమీద నమ్మకంతో వెళుతున్నా."

"ఎంతమాట సార్! అవసరాలు అందరికీ వస్తాయ్.... వీలైనంత త్వరగా వచ్చెయ్యండి. వర్క్ ఎలాగో ఎడ్జస్ట చేసుకుంటా!"

స్కూటర్ ఇంట్లో వదిలేసి రిక్షామీద బస్సుస్టాండ్‌కి బయలుదేరాడు మూర్తి.

దోవలో రిపేరు వచ్చి బస్సు కాకినాడ చేరేసరికి నాలుగు గంటలైపోయింది.

శ్రీదేవే తలుపు తీసింది.

"మీరా!?"

"ఏం రాననుకున్నావా?"

ఇంతలో అత్తగారూ, మాంవగారు వచ్చారు.

"బాయిలర్లో నిప్పు నే వేస్తాకాని అల్లుడికి ముందు కాఫీ ఇయ్యి" శారదాదేవిగారు పురమాయించేశారు.

"రాత్రి బస్ ప్రయాణం కష్టమే!" అన్నారు శివరావ్‌గారు.

"అంతే కానండీ, పగటిపూట ప్రయాణానికి శెలవ్ ఎలా వస్తుంది?"

"వాట్! శెలవు పెట్టకుండా వచ్చేశావా?"

"వెంటనే వెళ్ళిపోవచ్చు కదా అని."

"అయితే మాత్రం క్యాష్ కీస్?"

"ఆఁ అదేం ఫరవాలేదు. అందరూ నమ్మకస్తులే. ఎకౌంటెంటు మకీను."

"పొరపాటు మూర్తీ, నీకిస్తున్న జీతం నీ పనికి కాదు. నువ్వు మోస్తున్న బరువు బాధ్యతలకి. నువ్ ఇలా రావడం ఏం బాగా లేదు...."

"మరి ట్రంకాల్ చేసినా శ్రీదేవి రాలేదు" మూర్తి జోరుగానే అన్నాడు.

"టెలిగ్రాం ఇస్తే నేను పంపించేవాడినిగా. ఇలాంటి రిస్క్ తీసుకోడం చాలా తెలివితక్కువ....చూడమ్మా శ్రీదేవీ వెంటనే అన్నీ సర్దుకో....నేను వెళ్ళి టాక్సీ తీసుకొస్తా."

కాఫీ తాగుతూనే శివరావ్‌గారు బయలుదేరారు.

క్యారియర్‌లో వేడివేడి ఇడ్లీ పట్టుకుని మరో గంటకో వచ్చారు.

"టాక్సీ వచ్చేసింది. నేరుగా వైజాగ్ వెళ్ళిపోదాం."

"అదేమిటండీ, అమ్మాయికి పసుపూ కుంకుమా పెట్టుకో వద్దూ...."

"అవన్నీ అక్కడే పెట్టు. అందరం వెళదాం పద.... ఆలస్యం చేయవద్దు."

—"ఆఁ మరేవిటోయ్ విశేషాలు? ఎంతపని చేశావ్, తీరికగా సెలవు తీసుకుని వస్తావనుకున్నాను....ఆరోగ్యం బావుందా?" మామ గారి ధోరణి అర్థం కాలేదతనికి. శ్రీదేవి విషయం బయటపెట్టలేదా? లేచి గదిలోకి వెళ్లాడు.

ఒకపక్క శ్రీదేవి బట్టలు సర్దుతోంది.

"బేబీ, అమ్మ నీ బట్టలన్నీ సర్దిందా?"

"........"

"ఇలారా!"

"........"

"ఏయ్! రమ్మంటున్నానా?"

"........"

"ఏం, మీ అమ్మ ఏమైనా చెప్పిందా?"

"చాలు ఊరుకోండి చిన్నపిల్లల దగ్గర మాటాడే పద్ధతి ఆదేనా?"

"చాలా కోపం వచ్చినట్టుందే!"

"అంటే దెబ్బలుతిన్నా కోపం తెచ్చుకోకుండా ఉండాలన్న మాట."

"అంత గట్టిగా కొట్టానా?"

"సామెత చెప్పినట్టుంది. దెబ్బ ఒక్కక్షణం నొప్పిపెట్టి పోతుంది. కాని మనసుకి తగిలిన దెబ్బ......అయినా ఆడబ్రతుకు ఇంతే:"

"సారీ శ్రీదేవీ, జరిగినదేదో జరిగిపోయింది. ఇంత ధైర్యం చేస్తావనుకోలేదు. కొంపదీసి మీ నాన్నగారితో ఏమైనా చెప్పావా?"

"ఎలా చెప్పగలనూ? ఏ ఆడది మాత్రం తన భర్త గురించి ఇలాంటి విషయం చెప్పగలదు? ఇలా వచ్చి పీకలమీద కూచుని బయలుదేరమనడం ఏం న్యాయం?"

"ఐయాంసారీ శ్రీదేవీ.... జరిగినది మరిచిపోదాం.... పాపాయ్!"

ముందుకు వచ్చి పాపాయిని ఎత్తుకున్నాడు మూర్తి.

మూర్తి ఎత్తుకున్నా తల్లివైపే చూస్తోంది ప్రసన్న.

"అమ్మకి నామీద కోపం వచ్చింది. నీకు కూడా నామీద కోపం వచ్చిందా?"

తల ఊపింది ప్రసన్న.

"బంగారు తల్లి, ఏదీ ముద్దు.... ఇటో...."

"అమ్మాయ్!" అని పిలవగానే వంటింట్లోకి వెళ్ళింది శ్రీదేవి.

"ఇదిగో ఈ డబ్బు, నీ పెట్లో పెట్టు. గొలుసూ అవీ తీసుకో. మెడలోనే వేసుకో ఎందుకేనా మంచిది."

బయట కారు హారన్ మోగింది.

"బయలుదేరండి, ఏడున్నరయిపోయింది...." శివరావ్‌గారు హెచ్చరించారు.

ఇంటికి రాగానే స్నానంచేసి టిఫిన్ తినేసరికి బ్యాంకు టయిం దాటిపోయింది. బ్యాంకు కెళ్ళేసరికి జ్యోతి సీటులోనే ఉంది.

ఆఫీసుకు రాగానే ఫ్లాస్క్ ఇచ్చి కాఫీ తెప్పించుకు తాగాడు మూర్తి. రెండింటికల్లా క్యారియర్ పంపింది శ్రీదేవి.

రీసెస్‌లో తను భోజనం చేస్తుండగా జ్యోతి వచ్చింది.

"రా జ్యోతీ! చెప్పకుండా వెళ్ళిపోయావ్? మీ పెద్దలు క్షేమమా?"

"ఆఁ!"

"అంత అర్జంటుగా వెళ్ళిపోతావనుకోలేదు. ముందు చెబితే మెంటల్‌గా ప్రిపేర్ అవుదును."

"ఈ మాటలకేం కాని సాయంకాలం మీ కోసం ఇంటిదగ్గర వెయిట్ చేస్తూ ఉంటాను. వస్తారుకదూ!"

"సాయంకాలమా! నాకు...."

"అలా నసుగుతున్నారేం?"

"ఎల్లుండి ప్రసన్న బర్త్‌డే. చిన్న పార్టీ ఇద్దామని. ఫాదర్ ఇన్‌లా మదర్ ఇన్‌లా వచ్చారు. నేను నిన్న సాయంకాలం అప్పటి కప్పుడు వెళ్ళి తీసుకొచ్చా!"

"వాళ్ళను తీసుకురావడానికన్నమాట వెళ్లింది మీరు. సరేపోనీ

ఎల్లుండి...."

"బర్త్‌డే పార్టీగా.... నువ్వు రావాలి సుమా."

"నేను రాకుండా ఉందామనుకున్నా. రాకుండా వుండలేను మరి."

మూర్తి నోటి మంచివల్ల అతను ఆరోజు ఆఫీసులో కొన్ని గంటలు ఆలస్యంగా వచ్చినా బ్యాంకు పనిలో ఆలస్యంకాని అంతరాయం కాని కలగలేదు.

ఎకౌంటెంటూ, సబ్‌ఎకౌంటెంటూ వచ్చి అడిగారు "వెళ్ళిన పని సానుకూలమేనా?"

ప్రసన్న పుట్టినరోజు గురించి వాళ్ళకు చెప్పాడు మూర్తి.

ఎకౌంట్ బాలెన్స్ అయ్యేసరికి ఆరయ్యింది.

జ్యోతి ఐదుగంటలకే ఇంటికి వెళ్లిపోయిందన్నాడు మెసెంజరు. నిరుత్సాహపడిపోయాడు మూర్తి. అతను అనుకున్నదేమిటంటే బ్యాంకు తరవాత ఓ అరగంట అక్కడే జ్యోతితో మాటాడుదామనుకున్నాడు. ఆమె అపార్థం చేసుకుందేమో! చెప్పవలసిన విషయం ఎలా చెప్పడమో అని ఆలోచిస్తూనే ఉన్నాడు. మధ్యాహ్నంనుంచీ. ఆ సాయంత్రం కారులో భార్యను తీసుకొని బయల్దేరాడు మూర్తి ముఖ్యులనందర్నీ వ్యక్తిగతంగా ఆహ్వానించేందుకు.

"ఈమె జ్యోతి. మా బ్యాంక్‌లో పనిచేస్తోంది. మై వెరీ గుడ్ ఫ్రెండ్." జ్యోతి ఇంటిలో చెప్పాడు.

తలుపు తీయడానికి వచ్చిన జ్యోతి శ్రీదేవిని చూసి కొయ్యబారిపోయింది. "....జ్యోతీ. మీట్ మై వైఫ్. శ్రీదేవి!"

చివరి మాటల్లో గర్వమే తొణికిసలాడింది.

తనూ తన రంగు వెలిసిపోయిన చీర. జ్యోతికి తనంటేనే తనకి అసహ్యం కలిగింది. తళుకు తళుకుమని మెరిసే బాటిల్‌గ్రీన్ పట్టుచీరతో పచ్చగా లక్ష్మీదేవిలా మెరిసిపోతోంది శ్రీదేవి.

"రండి.... రండి" ఒకక్షణం బిత్తరపోయినా తెప్పరిల్లుకుంది జ్యోతి.

"ఇన్నాళ్లై ఉంటున్నాం. ఎప్పుడూ మీ ఇంటికి రావడం

కాలేదు. ఇప్పుడైనా వీలైంది. మా పాప ప్రసన్నకి పుట్టినరోజు. ఐదో ఏడు వచ్చింది. మా అమ్మా నాన్నగారూ కూడా వచ్చారు: ఎల్లుండి సాయంకాలం ఆరుగంటలకి పేరంటం. తప్పక రావాలి. ఈః అబ్బాయి."

"మా బాబు."

"పేరు."

"కిరణ్. అమ్మా, ఈవిడ...."

"ఆంటీ, నమస్తే పెట్టు."

"నమస్తే."

"నమస్తే బాబూ. తప్పక వస్తావుకదూ. మా పాపను చూద్దువు గాని రా. వెళ్తామండీ. ఇంకా స్టాఫ్ ఇళ్ళు అన్నీ ఉండిపోయాయ్!"

లేచినుంచుంది శ్రీదేవి, భర్తవైపు చూసేసరికి అతను జ్యోతి వైపు చూస్తున్నాడు. ఆ ముఖంలోని భావంచూసి శ్రీదేవి మనస్సు చివుక్కుమంది.

"బొట్టుంచుతా" అంటూ లోపల కెళ్లింది జ్యోతి.

బొట్టుపెట్టించుకుని ఆమె ముఖంవైపు చూడకుండా ఇవతల కొచ్చేసింది శ్రీదేవి.

"ఎవరే ఆ వచ్చిందీః" హైమవతమ్మ అడిగింది.

"మా ఏజంటూ, ఆయన భార్యా. ఎల్లుండి వాళ్ళమ్మాయి పుట్టిన రోజుకి పిలవడానికి వచ్చారు."

"ఆంటీ చాలా బాగుందమ్మా!"

"నోర్ముయ్ వెధవా. ఆంటీ ఏ మైసూర్‌పాకా, గుత్తి వంకాయ కూరా బాగుండడానికి."

"వాడిమీద ఎందుకు విసుక్కుంటావ్ః కుర్ర నాగన్న ఏదో అన్నాడు."

కిరణ్ కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

దుఃఖం దిగమింగుకుని తెలుగువాచకం తీసి దడదడా చదివేస్తున్నాడు: "ఆకాశమున మబ్బులు క్రమ్మెను. అవి మొదట మంచువలె తెల్లగా ఉండెను. కాని వెంటనే అవి నల్లగా మారెను. అప్పుడు ఒక

నెమలి పురివిప్పి ఆడెను. చల్లని గాలి వీచెను. పెద్దపెద్ద చెట్లు మరిమరి ఊగెను. చిన్నచిన్న చెట్లు మెల్లగా ఊగెను. ఎంత చెట్టుకి అంతగాలి అందురు. పదినిముషములు వాన జోరుగా కురిసి వెలిసెను. ఇంద్రధనుస్సు ఒకటి ఆకాశములో కనిపించెను...."

"బాబూ, ఆ పద్యం చదువు...." హైమవతమ్మ దగ్గిరగా వచ్చింది.

"ఆ పాఠం అంటే మామ్మకి ఇష్టం. బొర్రయ్య బురదలో పడి మొర్రో...."

—విసుక్కుంది జ్యోతి.

"పోనీలే బాబూ, తరువాత చదువుకుందువుగాని. రా, అన్నం పెడతా!"

"వస్తున్నా!" కిరణ్ లోపలికెళ్ళాడు.

కళ్ళలో నీళ్ళతో కుర్చీలో కూలబడింది జ్యోతి.

ప్రసన్న పుట్టినరోజు వేడుకలు ప్రారంభమయ్యాయి.

ప్రసన్న పుట్టినరోజు పండుగకు వెళ్ళిన జ్యోతిని సాదరంగా ఆహ్వానించింది శ్రీదేవి.

లక్షణంగా ముస్తాబై ఖరీదైన చీర కట్టుకున్న శ్రీదేవి ముందు జ్యోతికి తన అందం ఆమె అందంతో పోల్చి చూస్తే తీసి కట్టేననిపించింది. శ్రీదేవి స్వతహాగా పచ్చని మనిషి. దానికి తోడు జావరాబందీ లేదు. చేతినిండా డబ్బు. అలంకరించడానికి కావలసి నంత తీరిక.

"రండి, రండి, మీరు వస్తే కాస్త పాపదగ్గర కూచుంటారని మీకోసమే ఎదురుచూస్తున్నా!....రండి....టిఫిన్ కాఫీ తీసుకోండి.... కాస్త ఈ ప్రెజెంటేషన్లు అందుకుందురూ....ప్రసన్నా, జ్యోతి అంటీ అని చెప్పావే. ఆవిడే....ఇదుగో కిరణ్" మూర్తి పని అప్ప చెప్పేశాడు.

ఎంతయినా అధికారి అధికారేనని ప్రసన్న పక్కనే కూర్చుంది జ్యోతి.

కిరణ్ ప్రసన్నవంకే చూస్తూ నుంచున్నాడు.

మరో పదినిముషాల్లో శ్రీదేవి ఆటొచ్చేసరికి కిరణ్ అడిగాడు.

"పిన్నీ, పొట్లాలు అయిపోయాయి. ఇంకా కావాలి."

—బిత్తరపోయింది జ్యోతి.

"లెస్తాబాబూ, అక్కడ పేకెట్లు పిన్ చేస్తున్నారు."

"బాబీ, ఆంటీని 'పిన్ని' అని పిలుస్తావేం?"

"ఆంటీ అంటే పిన్నికదూ, కామాక్షి ఆంటీ పిన్నే కదా!"

—ఆ పరిస్థితుల్లో మరేం అనాలో తోచలేదు జ్యోతికి.

కిరణ్ ప్రసన్న పదినిముషాలలో ప్రాణస్నేహితులై పోయారు.

"రాత్రికి భోజనంచేసి వెళుదురుగాని. నిన్ననే చెబుదామను కున్నాను. మరేం అనుకోకండి... మీరు ఉండితీరాలి. ప్లీజ్" మెల్లగా వచ్చి చెప్పింది శ్రీదేవి జ్యోతితో.

—ఏమనడానికీ తోచలేదు జ్యోతికి.

ఇంతలో మూర్తి వచ్చాడు.

"జ్యోతీ, నువ్ భోజనం చెయ్యకుండా వెళ్ళడానికి వీల్లేదు. తర్వాత నేను డ్రాప్‌చేస్తాగా."

"ఆవిడ మనమాట కాదనదులెండి.... హలో.... చంద్రిక గారొచ్చారు, రండి...."

—శ్రీదేవి తనమీద ఆపేక్ష చూపిస్తున్నదెందుకు? చెప్పకుండా చెయ్యకుండా ఇక్కడ భోజనానికి ఉండిపోతే, అర్ధరాత్రి ఇంటి కెళ్ళాక అత్తయ్య ఏమనుకుంటుంది?

మనసు మనసులో లేదు. అయినా తను తొందరపడే లాభమూ లేదు. లేచి సరదా తెచ్చుకుని ప్రసన్నతో మాటాడడం ప్రారంభించింది జ్యోతి.

వచ్చేవాళ్ళు వస్తూనే ఉన్నారు, వెళ్ళేవాళ్లు వెళుతున్నారు. బ్యాంకు స్టాఫ్‌నే కాకుండా, బ్యాంకు ఖాతాదార్లనీ, ఊళ్ళో ప్రముఖుల్నీ ధనవంతుల్నీ పిలిచాడు మూర్తి.

నిజంగా మూర్తి స్థితిగతులు తెలియని జ్యోతికి కళ్లు జిగ్గు మన్నయ్. పుట్టినరోజు పండుగకే అయిఉంటయ్ సుమారు పదిహేను

వందలు.

పెళ్ళయినవాడని తెలిసినా, అతని వాక్చాతుర్యానికి ముగ్ధురాలై పోయింది. 'సరదాలు' లేని జీవితంలోకి, జీవనోపాధికోసం ఉద్యోగం చేస్తున్న కటిక నిజంలోకి ఊహా ప్రపంచపు సరదాలూ, విలాసాలూ, వింత సౌరభం గుబాళింపూ తీసుకొచ్చాడు మూర్తి.

అటు ఆఫీసులో పనీ, ఇంటికి రాగానే భర్త ఈసడింపూ, విసుగెత్తించే మౌనం, అడపా తడపా ఇంటిపనీ, వీటితోనే సతమత మయ్యేది జ్యోతి.

లాలనగా ముచ్చటగా చూడడం శ్రీనాథ్‌కి తెలియనే తెలియదు.

నవ్వుల గలగలలూ, కొత్త దంపతుల ఎకసక్కాలు దూరంగా తెరమీదా, నిజజీవితంలోనూ చూసినప్పుడు మనసు దేవుకుపోయేది జ్యోతికి.

ఇంతలోనే విశాఖ బదిలీ అయింది.

తను ఆఫీసులో చేరిన మొదటిరోజే మూర్తి తనకు చాలా ఆకర్షణీయంగా కనపడ్డాడు.

మొదటి పరిచయంలోనే చూస్తూనే తనకు తెలియకుండానే హద్దుమీరింది తను.

చీకటిలో బీచిలో అతని గుండెమీద తలపెట్టుకుని వలవలా ఏడ్చేసింది.

కారణం అడిగాడతను. ఏమని చెప్పగలదు?

మూర్తి తను హృదయంలోని వ్యథను అర్థం చేసుకున్నాడను కుంది. అంతే అతనే తన సర్వస్వం అనుకుంది. మనసును అర్థం చేసుకున్న మనిషి దొరికితే అతనికోసం ఏ స్త్రీ ఐనా అంతే చేస్తుం దేమో!

తనకి కావలసినవి సుఖం, తృప్తి, ఆనందం, సరదా!

మరి వీటిలో శ్రీనాథ్ తనకు ఏమివ్వగలడు?

....ఆహ్వానితుల సంరంభం కొంత తగ్గింది.

అప్రయత్నంగా గడియారం చూసుకుంది జ్యోతి. తొమ్మి దయింది.

"నీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి.... ఏమంటారో ననుకున్నాను. ఈ సందర్భంలో నీతోపాటు భోజనం చెయ్యడం, అందరి ఎదుటా, నాకెంతో గర్వకారణంగా ఉంది." మూర్తి జ్యోతి దగ్గరకొచ్చి అన్నాడు.

"ఈ పొగడ్తలమాటకేంకాని, మీతో చాలా మాటాడాలి. ఎలా?"

"రేపు సాయంకాలం ఇంటికి రానా?"

"వద్దు. నన్ను ఎక్కడికైనా తీసుకెడుదురూ."

"వడ్డించేశా, రండి."

జ్యోతి తత్తరపాటు చెందింది శ్రీదేవి తనమాట విన్నదేమోనని. వింటేనేం, తనదగ్గరికి వచ్చి శ్రీనాధ్‌లో అనుమానం రెచ్చగొట్టలేదూ మూర్తి!

అప్పటికప్పుడే మూర్తి మీద కసి!

డైనింగ్ టేబుల్ బార్‌లైట్ వెలుతుర్లో తళతళలాడుతోంది. కళ్లు జిగ్గుమనిపించే వెండిసామాను. అంతా ఒకేసారి కూచున్నారు భోజనాలకి.

వంటమనిషి కాబోలు టేబుల్‌మీద ఉన్న వస్తువులు తెచ్చి వడ్డిస్తోంది.

అటు అమ్మమ్మా, ఇటు అమ్మా పిల్లలకు కావలసినవి చూస్తున్నారు. జ్యోతికి కావలసినవి ఒకవంక ముసలాయనా, మరో వంక మూర్తీ చూస్తున్నారు.

"అయితే అమ్మాయ్, మీ నాన్నగారిది ఏ ఊరు?" శారదాదేవి గారు అడిగారు.

"బెజవాడండీ!"

తర్వాత మరిన్ని వివరాలు. జ్యోతికి అసహనంగా ఉంది.

"అబ్బ వద్దంటుంటే...." నవ్వుతూనే తన ప్లేట్లో వేసిన లడ్డూ శ్రీదేవి ప్లేట్లో వేశాడు మూర్తి.

"పోనీ, ఈ సగం" ఓ ముక్క వేసింది శ్రీదేవి.

జ్యోతి లోలోపల కుతకుతలాడిపోతోంది. తన ఎదురుగా

భర్తతో బూజం బంతులాడడానికా తనని భోజనానికి పిలిచింది శ్రీదేవి?!

"మీ అన్నగారికి మాటలుంటే చాలు. భోజనం అక్కరలేదు" జ్యోతివంక చూసి నవ్వుతూ అంది శ్రీదేవి.

"అన్నగారికి మాటలే వడ్డిస్తారు, వదినగారు."

గొంతులో తడి ఆరిపోతున్నా వెనక్కి అనేసింది జ్యోతి.

ఇక ఉండ బుద్ధికావడం లేదు జ్యోతికి. కాని బయటపడడ మెలాగో తెలియలేదు.

భోజనాలయినంతసేపూ స్వంత ఆడబిడ్డకంటే ఎక్కువగా సరసాలాడుతూ, 'మీ అన్నా చెల్లెళ్ళొకటే' అని శ్రీదేవి అంటూంటే జ్యోతికి కడుపు రగులుకుపోయింది.

"రాత్రయ్యింది నే వెళతా, మీరూ అలసిపోయారు. ఉండండిక."

"బావుంది అలసటేమిటీ, పదినిముషాల్లో దిగబెట్టేస్తారు. కారు తీయండీ."

శ్రీదేవి చిన్నసైజు ఆర్డరు జారీ చేసింది.

"డాడీ! నేనూ వస్తా!"

"నువ్వెందుకమ్మా, ఇప్పుడే వచ్చేస్తాగా."

"పోనీ తీసుకెళ్ళండీ. వచ్చేటప్పుడు మీకు కంపెనీ."

"నువ్వే రారాదూ?"

"అయ్యో! నాకింకా చాలా పనులున్నాయ్. ఎక్కడివక్కడే ఉన్నాయ్. అన్నీ సర్దుకునేసరికి పదకొండవుతుంది."

"వస్తానండీ." అని చెప్పి బయటకొచ్చేసింది జ్యోతి.

"ఏమిటో చాలా మాటాడాలన్నావ్?" మలుపు తిరగ్గానే అడిగాడు మూర్తి.

"పిల్లలు...."

"దట్సాల్‌రైట్."

"రేపు రాత్రి, లెట్ అజ్ మీట్. నేను రేపు సినిమా కెళతా!"

"నేను వస్తానమ్మా." కిరణ్ కలుగచేసుకున్నాడు.

"నన్నూ తీసుకెళ్ళు డాడీ!"

"సరే అలాగే, టిల్ టుమారో...."

జ్యోతిని డ్రాప్‌చేసి వెంటనే వెళ్ళిపోయాడు మూర్తి.

ఇంటికొచ్చాక జ్యోతికి మనసు మనసులోలేదు. తననే ప్రత్యేకంగా భోజనానికి పిలవడంలో ఉద్దేశ్యం? తనకూ వుండక తప్పలేదు. మరి శ్రీదేవి సంభాషణ పేరు అలా ఉండడం కేవలం యాదృచ్ఛికమా. ఎత్తుగడా?

అన్నా చెల్లెలి వరస ఎందుకు పెట్టినట్టు? శ్రీదేవికి తమ సంబంధం తెలిసిపోయిందా? తెలిస్తే బుసలు కొట్టవలసిందే?

పాపం ఆమె మంచిదేమో! తనే పొరపాటుపడుతోందేమో, పాపం ఎక్కడుంటే, భయం అక్కడుంటుందంటారు.

భర్త గురించి మూర్తితో చెప్పకుండా ఎలా ఉండడం? చెప్పి తన సమస్యలను అతని దగ్గరకు తీసికెళ్ళడంవలన వచ్చే లాభం?

ఒకవంక హైమవతమ్మను చూస్తే జాలివేస్తోంది. నాలో మంచితనం ఎందుకు మిగిల్చావ్ భగవాన్! నన్ను క్రూరురాలినిగా చెయ్! ఆమెను అన్యాయం చేస్తున్నాననే బాధ, భర్తకు దూరమయ్యాననే భయం, మూర్తిని పోగొట్టుకుంటానేమోనని ఆవేశం, గందరగోళంగా ఉంది మనసు.

ఒక రాత్రికి కడుపులో ధేవేసినట్టనిపించింది జ్యోతికి.

గడియారం కొడుతున్న గంటలన్నీ వింటూనే ఉంది జ్యోతి. అర్ధరాత్రికి దోకులు ప్రారంభమైయ్యాయి.

తను లేవడం పెరట్లోకి వెళ్ళడం హైమవతమ్మకు తెలియనే తెలియదు.

పొద్దున్నే వెనకవీధిలో ఉన్న మరో కలీగ్ ఇంటికి కలవు చీటీ పంపేసింది జ్యోతి.

## 7

—శ్రీనాధ్ వెళ్ళి వారాలూ, నెలలూ గడిచిపోతున్నాయి. ఒక్కొక్కరోజూ అవుతుంటే మరి అతను వెనక్కి తిరిగిరాడన్న విషయం వెల్లడి అవుతుండగా, భయమూ పెరుగుతోంది.

జ్యోతి ఆరోజు పెందరాడే ఇంటికి వెళ్ళాలనుకుని తొందరగా పని పూర్తిచేసుకుంది.

సాయంకాలం అవుతుండగా మూర్తి మెసంజర్‌చేత రమ్మని కబురు పంపించాడు.

వెంటనే వెళ్ళింది.

"రమ్మన్నారా?"

"ఆఁ. నిన్ను కలవాలని ఎంత ప్రయత్నంచేసినా ఏదో అవాంతరం వస్తోంది. ఈరోజు సాయంకాలం మా ఫాదర్ ఇన్‌లా, మదర్ ఇన్‌లా వెళ్ళిపోతున్నారు. బస్సుకి దిగబెట్టాలి."

"పోనీ రేపు సాయంకాలం కలుద్దాం."

"ఆరుగంటలకి బీచిలో...."

"వెయిట్ చేస్తుంటా."

జ్యోతి వెళ్ళిపోయింది.

కిరణ్, ప్రసన్నా సన్నిహితులయ్యారు. వారి స్నేహానుబంధం ఇటు జ్యోతికీ, అటు శ్రీదేవికీ చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. తల్లిదండ్రుల సలహా పొందిన శ్రీదేవి పరిస్థితులతో రాజీ పడడం నేర్చుకుంది.

జ్యోతి వస్తూనే ఉంది. భర్తతో ఆమెకున్న అనుబంధం ఎలాంటిదైనా తన హక్కులను తను పోగొట్టుకోకుండా ఉన్నంత కాలం తను ఇంకేమీ చెయ్యలేదు శ్రీదేవి.

తెలివిగా తప్పుకు తిరుగుతున్నాడు మూర్తి. శ్రీదేవితో సరదాగా తిరుగుతూనే తన పని చూసుకుంటున్నాడు.

జ్యోతికి కత్తిమీద సాముచేస్తున్నాననే భయం తగ్గింది. శ్రీదేవి ఆమెను కించపరచడానికే భోజనానికి పిలిచిందన్న భావం సన్నగిల్లడం మొదలైంది. మూర్తి తనతో మామూలుగానే ఉంటున్నా బయటికి దూరంగా ఉన్నట్లు నటిస్తుండడం అన్నివిధాలా శ్రేయస్కరమనుకుంది.

హైమవతమ్మ మనసు భక్తిమార్గాన పెట్టింది. సాయంకాలం అయేసరికి ఎక్కడికో ఒక దగ్గరకు పురాణ కాలక్షేపానికో, భజనకో

వెళ్ళడం అలవాటు చేసుకుంది.

ప్రశాంతంగా మరికొన్నివారాలు గడిచాయి.

ఒకనాడు కిరణ్ సాయంకాలం ఆడుకోడానికి ప్రసన్న ఇంటికి వెళ్ళాడు మామూలుగా.

తలుపు తాళంవేసి ఉండడం చూసి దిగులుగా ఇంటికి వచ్చేశాడు. తల్లి నడుగుదామనుకున్నా ఆమె ముఖంవంక చూసి అడగడానికి భయపడ్డాడు.

"ఆఫీసులో ఏదైనా గొడవ జరిగిందా?"

—వస్తూనే పడకకుర్చీలో కూలబడ్డ జ్యోతి ఎర్రబడిన ముఖంచూసి అడిగింది హైమవతమ్మ. కోడలి మౌనం చూసి లోపల కెళ్ళి కాఫీ తెచ్చియిచ్చింది.

"అబ్బాయి గురించి ఏమైనా తెలిసిందా?"—ఎంత అడుగకూడదనుకున్నా అడగకుండా ఉండలేకపోయింది హైమవతమ్మ.

"లేదత్తయ్యా!" చీర మార్చుకోకుండానే పక్కమీద వాలింది జ్యోతి.

ఎంత ఆలోచించకూడదనుకున్నా మనసులో ఆ సంఘటనే మెదలుతోంది. మామూలుగా పనిచేసుకుంటూండగా పదకొండు గంటలకే కబురువస్తే మూర్తి గదిలోకి వెళ్ళింది.

"రా జ్యోతీ...."

డ్రింకులకి పంపాడు మెసంజరుని.

"నేను భయపడినదంతా జరిగింది....నాకూ ట్రాన్స్ఫర్ అయింది. వెంటనే బెజవాడ వెళ్ళి ఛార్జి వేసుకోవాలి. సబ్‌స్టిట్యూట్ వచ్చేశాడు, ఈరోజే ఛార్జి ఇచ్చేస్తున్నా. ఇంతకీ దీనంతటకీ కారణం నా తెలివితక్కువే. ఆడవాళ్ళని నయవంచన చెయ్యడమే క్షేమకరం. గల్లీలోకి దిగి పోరాడడం తప్పే!"

"ఎవరితో పోట్లాడారు?" కన్నీళ్ళను అదుపులో పెట్టుకుంటూ అడిగింది.

"ఇంకెవరితో, శ్రీదేవితో....అసూయకు పెట్టనిపేరు ఆడది. వాళ్ళ నాన్నగారి పనే ఈ ట్రాన్స్ఫర్....నేను వెళ్ళి నీకూ ట్రాన్స్

ఫర్ అయ్యేటట్లు చూస్తా!"

"అది జరగకపోతే...."

"జరగకపోతే...." మాటమార్చి ప్రోగ్రాం చెప్పాడు మూర్తి.

మూర్తి మళ్ళీ కనపడలేదు.

నీటిలోంచి తీసి పడేసిన చేపలా గిలగిల్లాడింది జ్యోతి. తన కష్టం ఎవరికి చెప్పుకోవాలి? ఎవరు తనని ఓదార్చగలరు?

మరుసటిరోజు లంచ్ టైమ్‌లో క్యాంటీన్ దగ్గరకు వెళ్ళింది జ్యోతి.

"కాఫీ తీసుకుంటారా?" తనవంకే చూస్తూ అడిగాడు శ్యామసుందర్. మూర్తికంటె బాగా చిన్నవాడు.... మొత్తం ఒక ఐదేళ్ళ సర్వీసుంటుందేమో!

"ఆఁ!"

లోపలకు వెళ్ళి స్పెషల్‌గా కలిపించి పట్టుకొచ్చాడు.

"థాంక్స్!"

"పత్రిక చూస్తారా?" ఇచ్చి వెళ్ళిపోయాడు.

శ్యామసుందర్ మూడునెలలైంది ఆ బ్రాంచికి వచ్చి. అందరితోనూ నవ్వుతూ సరదాగా మాట్లాడుతాడు. ఎప్పుడూ నవ్వుతూ కులాసాగా తిరగడం అతని ప్రత్యేకత అని కొందరూ, రంగేళీరాజా అని కొందరూ అనుకుంటూండడం వింది దూరంనుంచే జ్యోతి.

మర్నాడు లంచ్ టైమ్‌లో తన టేబిల్ దగ్గరకొచ్చాడు.

"క్షమించాలి జ్యోతిగారూ, మీ ఏకాంతానికి భంగం కలిగించాను.... నావల్లే మీరు క్యాంటీన్‌కు రావడం మానేస్తే ఐయామ్ సారీ.... మీరు నన్ను అపార్థంచేసుకున్నట్టున్నారు...."

"నో, నో, అదేం లేదే...."

"మీదగ్గరకు ఓ పనిమీద వచ్చా...."

"చెప్పండి."

"యూనివర్సిటీకి కూచిపూడి బృందం వస్తోందట. ఉషాపరిణయం వేస్తారట. మన కొత్త ఏజంటుగారికి ఆ బృందం నాటకమంటే ఇష్టంట. మనవ్వసోసియేషన్ తరఫున వాళ్ళను పిలిచి టౌన్

హాల్‌లో వేయించాలని అతని కోరిక. నూటికి నూరుపాళ్ళూ తెనుగు దనం ఉట్టిపడే నృత్యం కూచిపూడి నృత్యం. నృత్యకళకి తెలుగు వాళ్ళ ప్రత్యేకమైన కంట్రిబ్యూషన్. మీదీ పడమటే కాబట్టి చూసే ఉంటారు.''

"మాశా, తప్పకుండా పెట్టించండీ. మరోసారి చూస్తా!"

"పెట్టించడం మీవంతే! మీరు ఎప్పుడూ ఎవరినీ దేనిగురించీ అడగలేదు కాబట్టి మీరు చెబితే అందరూ యస్ అనేస్తారు. మీరు ఒకసారి నలుగురితోనూ ఈ విషయం ప్రస్తావిస్తే ఆ తర్వాత విష యాలు ఏంచెయ్యాలో చెబుతానన్నారు ఏజంటుగారు."

"ఓస్, అదా, తప్పకుండా చెబుతా అందరికీ...."

"రైట్ అయిదయింతర్వాత వస్తా, ఏజంటుదగ్గరకెళదాం. అతని కిదో పెద్ద హాబీ....ఇన్‌ఫ్యాక్ట్ అతని ఉద్దేశ్యం తెలియగానే ఈ పని మీవల్లనైతే సానుకూలమౌతుందని సజెస్ట్ చేసింది నేనే!"

"అలాగా, పోన్లెండి, మిమ్మల్ని డిసెపాయింట్ చెయ్యను లెండి."

"వస్తా థాంక్స్!"

—అతను వెళ్ళినవైపే చూస్తూ ఆలోచనలో పడింది జ్యోతి.

## 8

"ఆ సిరిగాడి నొకసారి రమ్మనిచెప్పరా—" పెంటయ్య కన పడితే, ఆఫీసునుంచి వస్తూ చెప్పాడు రామచంద్రమూర్తి.

రాత్రి ఏడింటికి ఓరంమీద టౌన్ వచ్చి వెంటనే కలిశాడు శ్రీనాథ్.

"ఒరేయ్ నువ్ చేస్తున్న పని నీకైతే బావుందేమోకాని నాకు చాలా బాధగా ఉంది. వసూ కూడా నా ప్రాణం తీస్తోంది. ఇంటి దగ్గర చెప్పకుండా వచ్చేశానన్నావ్. వసు పుట్టింటికి వెళతోంది. నీ విషయం మీ వాళ్ళకు చెప్పమన్నావా?"

"వద్దు! ఆ పనిమాత్రం ఎప్పుడలా చెయ్యకు—నేను కాస్త నిలదొక్కుకున్నాక నేనే వెళ్ళి వాళ్ళను తీసుకొస్తా."

"మరి జ్యోతి ఉద్యోగం?"

"....ఆరోజే వస్తే చూద్దాం!"

"చూడు శ్రీనాథ్, మీ అమ్మను దృష్టిలో పెట్టుకుని ఆలోచించు...."

"ఒరేయ్ అవన్నీ నాకూ తెలుసు....పోనీ నీమాట కాదనడ మెందుకు ఒకపని చెయ్యమను. ఈ వందా ఇచ్చిరమ్మను. నేను రైల్లో ఎక్కడో కనపడినట్లు చెప్పి మిగిలినదేమీ బయటపెట్టకుండా ఈ డబ్బు అందచేస్తే బావుంటుంది. ఇదిగో మావాళ్ళ ఎడ్రస్, నా ఉనికి వాళ్ళకు తెలియకూడదు. ప్లీజ్!"

శ్రీనాధ్ రిక్షా తొక్కుకుంటూ వెళ్ళిపోయాడు.

మరో పదిరోజుల తర్వాత వసుంధర వచ్చిందన్న కబురు విని వెళ్ళాడు శ్రీనాధ్. ఇల్లు తెలుసుకోవడం కష్టం అయిందనీ, తను పంపించిన డబ్బు అందజేశాననీ అంతా కులాసాగా ఉన్నారని చెప్పింది వసుంధర.

జ్యోతిని మాత్రం చూడడం వీలుకాలేదని చెప్పింది. తిరిగి వస్తున్న శ్రీనాధ్‌కి కళ్ళ నీళ్ళపర్యంతం అయింది. ఆలోచనల్లో పరధ్యానంగా రిక్షా తొక్కుతూన్న శ్రీనాధ్ స్పీడుగా వస్తున్న లారీని చూడలేదు. చూసి రిక్షాను పక్కకు లాగేలోపలే రిక్షాను ఒక మూలగా గుద్దేస్తూ ముందుకు పోయింది లారీ.

శ్రీనాధ్ చెయ్యి పటుక్కుమంది. "అమ్మో!" అంటూ కేక వేశాడు శ్రీనాధ్.

వెనకాల వస్తున్న బండిలో డాక్టరు దగ్గరకు తీసుకెళ్లారు. ఎక్స్‌రే తియ్యాలన్నాడాయన.

ఆడుకుని అప్పుడే ఇంటికొచ్చిన డాక్టరుగారి అమ్మాయి రత్నమాల "అయ్యో! నీకు దెబ్బ తగిలిందా?...." అంటూ దగ్గరగా వచ్చింది.

ఈలోగా పెంటయ్యా వచ్చాడు.

"చేతిలో డబ్బులేదు పెంటయ్యా, బ్యాండేజీ కావాలేమో?"

"నే నిస్తాలే....ఆ రోజు మా అమ్మాయిని తీసుకొచ్చింది నువ్వేకదూ! నువ్వెళ్ళి బ్యాండేజీ తీసుకురా....తొందరగా...."

"అమ్మా!" మెల్లగా మూలిగాడు శ్రీనాథ్.

"సిరిగాడికి చెయ్యి విరిగిపోయింది కాఫీ ఇయ్యమ్మా పాపం!" ఆవిడా వచ్చింది ఆస్పత్రిలోకి.

"నీ ఇల్లెక్కడ? ఇంట్లో భార్యాపిల్లలూ ఉన్నారా?"

"నాదంతా ఒక కథ లెండి....అబ్బ....స్!"

అతని పరిస్థితి చూసి మరి ప్రశ్నలు వెయ్యలేదెవరూ.

ఓ అరగంటలో బ్యాండేజీ వెయ్యడం పూర్తయింది.

"నాన్నగారూ! సిరి చెయ్యి బాగవుతుందా?"

"అవుతుందమ్మా. అదృష్టవంతుడివోయ్. సింపుల్ ఫ్రాక్చర్ అయింది. ఫరవాలేదు. రెండు నెలల్లో బాగయిపోతుంది. కాని పాపం...."

"భగవంతుడి లీల! మనిషి చేతిలో ఏం లేదని తెలిసిపోయింది. కష్టపడి పని చేసుకుందామన్నా అదీ వీలుకాకుండా చేశాడు. ఏ జన్మలో ఏ పాపం చేశానో...." కంట తడిపెట్టుకున్నాడు శ్రీనాథ్.

డాక్టరుగారు ఆశ్చర్యపోయారు అతని మాటలు విని.

ఊసుపోకకి పెంటయ్య కొడుకు చిట్టిగాడికి పాఠం చెప్పడం ప్రారంభించిన శ్రీనాథ్ దగ్గరకి చూస్తుండగానే ఓ పదిమంది పేటలోని పిల్లలు పోగయ్యారు.

ఒకటి రెండుసార్లు రత్నమాల వచ్చి చూసివెళ్ళింది.

ఒకరోజు డాక్టరుగారి దగ్గర కెళ్తుండగా ఛైర్మన్‌గారు శ్రీనాథ్‌ని చూశారు.

"ఏమండోయ్ పంతులుగారూ, చేతికి ఆ కట్టేమిటి?" కారాపి, దిగి పరామర్శించారు.

"చిన్న దెబ్బ!"

"హలో! రండి, రండి...." కారుశబ్దం విని బయటకు వచ్చారు అప్పుడే ఆస్పత్రిలోకి వచ్చిన డాక్టరుగారు.

"ఈయన మీకు తెలుసా?" ఛెయిర్మన్‌గారి నడిగారు డాక్టరుగారు.

"ఆఁ శ్రీనాథ్ అని మా మేనేజర్ ఫ్రెండ్....మీతోనూ

ఫ్రెండ్‌షిప్ చేసినట్టున్నాడే.... శ్రీనాథ్‌గారూ ఓమారు సాయంకాలం వస్తారా, మీతో చిన్న అవసరం పడింది. సాయంకాలం అయిదు తరవాత.... డాక్టరుగారూ మీతో మాట్లాడాలి... "

డాక్టరుగారూ భూషణంగారూ లోపలి గదిలోకి వెళ్లారు. లోపలికి వెళుతూ పాప లోపల ఉంది వెళ్ళమన్నారు డాక్టరుగారు.

"అమ్మా! శ్రీనాథ్‌గారు వచ్చారు..." పాప లోపలికి కేక వేసింది.

చేతిలోని పుస్తకం ఇచ్చాడు శ్రీనాథ్ పాపకి. పాప అతనికి ఇల్లంతా చూపించింది.

"మీ దేవూరు?" పాపతల్లి అడిగింది.

"విశాఖపట్నం" అనేసి వెంటనే చేర్చాడు. "రిక్షావాడికి ఊరేమిటని, వెళ్ళొస్తానమ్మా" పాప బుగ్గమీద చిటికేసి వెళ్ళిపోయాడు శ్రీనాథ్.

ఇంటికి వచ్చేసరికి పిల్లలంతా వచ్చేశారు పాఠాలకి. పిల్లలకి చదువు చెబుతుంటే తన బ్రతుక్కి సార్ధక్యం వచ్చినట్టనిపిస్తోంది. ఉండి ఉండి మనసు కిరణ్‌వైపు పోతూనే వుంది.

## 9

భూషణంగారు ఐదింటికి రమ్మంటే ఐదు నిముషాలు ముందే ఇంటిముందు నుంచున్నాడు శ్రీనాథ్.

"లోపల కూచోండి బాబూ!" బంట్రోతు పిలిచాడు.

ఉండన్నట్టు సైగ చేశాడు శ్రీనాథ్. "వచ్చేదు బాబూ, మీ కోసం చేసూ త్తన్నారు."

"రండి రండి, పంతులుగారూ...." తను లోపల అడుగు పెట్టేసరికి ఆహ్వానించారు భూషణంగారు.

"రిక్షా తొక్కడం ఎలా ఉంది?"

"కష్టార్జనతో తృప్తి వచ్చింది" సూటిగా అడిగిన ప్రశ్నకి సూటిగానే ఇచ్చాడు జవాబు.

"మీరు అంతకంటే విలువైన పనులు చెయ్యగలరనే మిమ్మల్ని పిలిచాను. చాలా నెలలనుంచీ ఆలోచిస్తున్నాను....

కూచోండి....ఫరవాలేదు కూచోండి. నేనూ లారీ క్లీనర్‌నే ఒకప్పుడు. మీరు నిశ్చయంతో నిలబడగలరో లేదో అనుకున్నా....తగని పని చేసి చెయ్యి విరుచుకున్నారు చూశారా....కష్టం విలువ తెలుసు కున్నారు. కష్టమంటే ఏమిటో తెలుసుకున్నారు. నా వర్క్‌షాప్ చూసుకుంటున్న మనిషికి మరో మంచి అవకాశం వచ్చి వెళ్ళిపోతా నన్నాడు. కాదనలేకపోయాను. మీరు అతని పనిలో చేరితే...."

"క్షమించాలి. అది నాకు తెలియని పని."

"బాబూ. ఇది బ్రహ్మవిద్యకాదు. కిందటి సంవత్సరం మీకు రిక్షా తొక్కడం వచ్చా? మనకి కావలసింది పట్టుదల. వళ్ళు వంచి పని చెయ్యడం....అది చెయ్యగలిగినవాళ్ళు నలుగురిచేత వాళ్ళ కష్టం కూడా ఆలోచించి పని చేయించలేరూ. అతనికి నేను ఐదొందలు ఇచ్చేవాడిని. ఎకౌంట్లు చూసుకోడం, కావలసిన సామాన్లు కొనడం. పనివాళ్ళమీద అజమాయిషీ ఇవీ మీరు చూసుకోవలసిన పనులు. నమ్మకమైన మనిషికోసం వెతుకుతున్నాను. దయచేసి నా మాట కాదన కండి. ఈరోజు వర్క్‌షాప్ శెలవు. రేపు పొద్దున్న పదింటికల్లా అక్కడికి రండి. నేను వచ్చి అంతా చూపెట్టి ఏమేమిటి చెయ్యాలో చెబుతా.

మరి వాదించడానికీ, సమాధానం చెప్పడానికీ వీలు కలగలేదు శ్రీనాథ్‌కి.

"సరే వస్తా. నమస్కారం....నామీద చాలా బరువు పెడు తున్నారు."

"నాన్నా!" లోపలనుండి ఓ పదేళ్ళపిల్ల వచ్చింది.

"రామ్మా! ఇది నా కూతురు సరళ... ఆరో క్లాసు చదువు తోంది. మావయ్యమ్మా. శ్రీనాథ్ మావయ్య....నే వస్తా లోపల పని ఉంది."

అమ్మాయితో లోపలకు వెళ్ళిపోయారు భూషణంగారు.

*            *            *

రోజులు గడుస్తున్నయ్. జ్యోతి మూర్తి దగ్గరనుంచి ఉత్తరం కోసం చూస్తోంది. ఆఫీసుకి వెళ్ళేసరికే మెసంజర్ పోస్ట్ తెచ్చేసేవాడు.

అందరికీ తెచ్చి ఇస్తున్నప్పుడు తనవంక చూసి, 'మీకు ఏంలేవమ్మా' అంటూ ఉండేవాడు. ముల్లు గుచ్చుకున్నట్టు ఉండేది ఆమాట వింటే.

మనసు పరిపరివిధాల పోతూ ఉండేది. చక్కటి భార్య, కొత్త ఊరు. ఇంకా తను జ్ఞాపకం వుంటుందా? అంత అందమైనవాడికి ఎంతమంది రాశపోరు. తనను జ్ఞాపకం ఉంచుకోవాల్సిన అవసరమేంవిటీ?

"ఏదో ఆలోచనలో ఉన్నట్టున్నారు. ఎంతవరకూ వచ్చాయి ప్రిపరేషన్స్?" శ్యామసుందర్ పలకరించాడు.

"ఏవో జరుగుతున్నయ్!"

"విన్నాలెండి. నిన్న మీరూ ఏజంటూ వెళ్ళారుగా. ఏమన్నాడు ట్రూప్ లీడర్?"

జ్యోతికి మొహం ఎరుపెక్కింది. అంటే తను, ఏజంటు కారులో వెళ్ళగా అందరికీ తెలిసిందన్నమాట.

వెంటనే ఆపదలచుకుంది ఆపోహాలకు ఆస్కారం.

"లేదండీ! నన్ను ఇంటిదగ్గర డ్రాప్‌చేశారు. మన ఏజంటుగారబ్బాయినీ, అమ్మాయినీ ఇక్కడ కాలేజీలో చేర్చారట."

"ఓ అలాగా. ఈ సాయంకాలం మనం ఇద్దరమూ వెళదాం, వస్తారా?"

"సరే, ఏజంటుగారితో చెప్పండి."

"వెహికిల్ ఇస్తారేమో. పోన్లెండి. మీకు అభ్యంతరం లేకపోతే స్కూటర్‌మీద వెళదాం. లేదా నంబర్‌టెన్ ఉండనే వుంది."

శ్యామసుందర్ మాటలలోని ఆంతర్యం గురించి ఆలోచనలో పడింది. తనకీ కొత్త ఏజంటుకీ స్నేహం ఎంతవరకూ పెరిగిందో. తెలుసుకోవాలని అతను ప్రయత్నం చేస్తున్నాడు. కొంపతీసి....

నాలుగవుతుండగా శ్యామసుందర్ వచ్చాడు.

"నేను అడిగా ఏజంటుని, కావలిస్తే కారు ఇస్తామన్నారు. మన ఇద్దరినీ వెళ్ళమని ఆయన ఉద్దేశ్యం."

"ఆయన కారెందుకులెద్దురూ. మనపాట్లు మనం పడదాం."

"రైట్. నువ్వెళ్ళి చెప్పవోయ్, కారు అవసరంలేదని"

వెంటనే మెసెంజర్‌చేత కబురు పంపించేశాడు శ్యామ్.

ఆఫీసుపని పూర్తిచేసుకుని మరోసారి అన్నీ చూసుకునేసరికి అయిదు దాటిపోయింది.

జ్యోతి ఒకసారి టాయిలెట్‌కు వెళ్లి ముఖంకడుక్కుని పౌడర్ పఫ్ చేసుకుని తయారైంది.

"ఇలా బయలుదేరడమేనా, ఇంటికి వెళ్ళాలా?" శ్యామ్ అడిగాడు.

ఒక్కక్షణం ఆలోచించింది.

హైమవతమ్మ తన రాకకోసం నిరీక్షించి వర్రీ అయిపోయే రోజులు పోయాయ్. కిరణ్ కూడా తనని 'అమ్మా' 'అమ్మా' అని కొంగుపట్టుకు తిరగడం మానేశాడు.

"పదండి, ఇంటికి వెళ్ళవలసిన పనిలేదు."

జ్యోతి స్కూటర్ వెనకాల కూచుంది.

"గురుడు మెల్లగా సాధించాడే! అసాధ్యుడు."

మెసంజర్ మరో గుమాస్తాతో అనడం స్కూటర్‌మీద వెళుతున్న ఇద్దరికీ వినపడలేదు. వేదాంతం శర్మగారు సద్ధర్మసదనం గెస్టురూమ్‌లో ఉన్నారు. బ్యాంకువాళ్ళు వస్తారన్న విషయం ముందుగా ఫోన్‌లో చెప్పడంవల్లా, రాత్రి తొమ్మిదింటివరకూ ప్రోగ్రాంలేక పోవడంవల్లా తీరికగా వచ్చేవాళ్ళకోసం ఎదురుచూస్తున్నారు. ఆయనతో మాట్లాడి ప్రోగ్రాం ఫిక్స్ చేసుకొని అరగంటలో బయటపడ్డారు.

స్కూటర్ అప్సరాముందు డౌన్ దిగుతోంది.

"నాకు కాఫీతాగాలని ఉంది. వస్తారా వెళదాం" వెనక్కుతిరిగి అన్నాడు శ్యామసుందర్.

"రైట్!"

ఇద్దరూ లోపలికి వెళ్ళారు.

కాఫీలయ్యాక, బేరర్ ఇచ్చిన ఛేంజ్ తీసుకుంటూ అన్నాడు శ్యామ్.

"మా రూమ్‌లో కాసేపు కూచుని వెళుదురుగాని రండి."

"అలాగే!"

రూమ్‌లోకి వెళ్ళాక ఏజంటు గురించిన ప్రస్తావన వచ్చింది.

"ఈయన భలే బిజినెస్ లైక్. పాత ఏజంటులాకాదు. నాట్ ఏ సోఫ్టిస్టివ్ మ్యాన్." అన్నాడు శ్యామసుందర్.

"పుస్తకాలు చాలా కొన్నారే" మాట మరిపించింది.

"ఆ, ఏదో.... సారీ, మరేం అనుకోకండి."

జ్యోతి ఒక పుస్తకం తీస్తే దానివెనక కనపడింది విస్కీ సీసా.

"ఐ డోన్ట్ మైండ్ ఎటాల్!"

"నే ముఖం కడుక్కుని వస్తా" బాత్‌రూమ్‌లోకి వెళ్ళి వచ్చాడు శ్యామ్. అతని మనస్సుని అర్థంచేసుకున్న జ్యోతికి తన మనస్సును విప్పటానికి అట్టేసేపు పట్టలేదు.

నిండా మునిగిన తరవాత చలివెయ్యదంటారు. కొత్త ఏజంటు వంశీ ఇతను లక్ష రెట్లు నయం. బ్రహ్మచారి. ఇదివరలోలా చిక్కులుండవ్.

"అబ్బ! చాలా అలసిపోయాను." జ్యోతి అంది.

"ఇలా మంచంమీద కాస్త రిలాక్స్ అవండి" టవల్‌తో ముఖం తుడుచుకుంటూ అన్నాడు శ్యామ్.

పుష్టి అయిన శరీరం. కట్ బనియన్‌లోంచి విశాలమైన ఛాతీ, గళ్ళలుంగీ, సగానికి ఎత్తి కట్టుకున్నాడు బాత్‌రూమ్‌లో తడిసి పోకుండా.

పూర్తిగా రిలాక్స్ అయిపోయింది జ్యోతి.

ఎనిమిదిన్నర అయిపోయింది. "డార్లింగ్ నే వెళతానుమరి."

జ్యోతి లేచి నలిగిన చీర సర్దుకొంటూ అంది.

"నే దిగబెడతా" లేవబోయాడు శ్యామ్.

"డోన్ట్ వర్రీ. నేను నడిచి వెళ్ళగలను. సంసారుల ఇల్లులా ఉంది. మళ్ళీ ఇక్కడకు రమ్మనకు."

"నో బెడ్ ఫర్ ఫ్యూచర్ గైడెన్స్!"

నవ్వుతూ బయటికివచ్చి "బై!" అన్నాడు శ్యామ్.

* * *

"అబ్బ! నిద్ర ముంచుకొస్తూంది" అనుకుంటూ ఇంట్లోకి

వచ్చింది జ్యోతి.

"అయినా ఇంతవరకూ పనే!" కిరణ్ ఆశ్చర్యపోయాడు.

"తల అమ్ముకున్నాక ఏ పనైనా తప్పదు. ఏంచేస్తాం. రామ్మా కాసిని మెతుకులు తిని పడుకుందువ్‌గాని...."

"నువ్వెళ్ళి భోజనంచేసి పడుకో అమ్మా. నేను చదువుకుని అమ్మదగ్గర పడుకుంటాలే!"

"ఇదిగో అమ్మాయ్!" వడ్డిస్తూ అంది హైమవతమ్మ. "నీ వేళా, వాడివేళా కుదరడంలేదు. వాడికి స్కూల్ యూనిఫారం కావాలట. రెండు జతలు తీసేస్తే దర్జీ రెండు రోజుల్లో ఇచ్చేస్తాడు."

"సరే అత్తయ్యా. రేపు పెందరాడే వచ్చేస్తా."

తన గదిలోకి వెళ్ళిపోయింది జ్యోతి.

మనసులో శ్యామసుందరే మెదులుతున్నాడు. నిట్టూర్చి నిద్ర వడిలోకి వెళ్ళిపోయింది మరి కొన్ని క్షణాల్లో.

మరుసటిరోజు సాయంకాలం బట్టలు కొనడం, బజారుపనీ అయింది. తరవాత రోజు హైమవతమ్మనీ కిరణ్‌నీ తీసుకుని టౌన్ హాల్‌కి ప్రదర్శన చూడడానికి వెళ్ళడం అయింది.

ప్రదర్శనమధ్య శ్యామ్ తన దగ్గరకు వచ్చినా హైమవతమ్మతో ఏదో మాటాడుతున్నట్లు నటించింది జ్యోతి. మూర్తి కొంపముంచడం వల్ల వచ్చిన అనర్థాలు చాలు.

ఒకరోజు ఇంటికి వచ్చేసరికి జ్యోతికి కిరణ్ చెప్పాడు: "అమ్మా నాన్నగారు డబ్బు పంపించారు. ఇదిగో...."

"ఎవరొచ్చారూ?" అని మాత్రం అడగగలిగింది.

"ఎక్కడో ఉద్యోగం చేస్తున్నాడట. రైల్లో వెళుతూ తన స్నేహితుడి భార్యచేత పంపించాడు. వస్తానని కూడా చెప్పాడట." హైమవతమ్మ చెప్పింది.

"మరి ఎడ్రస్?"

"అది మనకు తెలియదని వాళ్ళకెలా తెలుస్తాదూ? ఏదో దోవలో కలిసినట్టు కలిసి వచ్చేసరికి కొన్నాళ్ళవుతుందని మాత్రం చెప్పి బాబీకి బట్టలు కొనమని డబ్బు ఇచ్చాడట. ఆ స్నేహితుడి భార్య మన ఇల్లు

వెతుక్కుంటూ వచ్చింది."

భోజనాలయ్యాక కిరణ్‌ను అడిగింది జ్యోతి.

"డబ్బు తెచ్చి ఇచ్చినావిడ ఎలా ఉంటుంది?"

"అచ్చం పిన్నిలాగే ఉంటుంది. చాలా మంచావిడ. నీ గురించి చాలా అడిగింది."

"బట్టలు కొనుక్కుంటావా?"

"మామ్మకి ఇచ్చేస్తా. నువ్ నాకు మొన్న కొన్నావ్‌గా."

కిరణ్‌కు తనమీదకంటె మామ్మమీదే అభిమానం ఎక్కువను కుంది.

మరుసటిరోజు లంచ్ టైమ్‌లో శ్యామ్ వచ్చాడు జ్యోతి దగ్గరకి.

"సారీ! మిమ్మల్ని కలవడం అవలేదు."

"అంటే?"

"ఆరోజు ప్రదర్శనలో...."

"మా అత్తగారు నా దగ్గర కూచున్నారు. మావాడు ఆవులిస్తే పేగులు లెక్కపెడతాడు."

"పోనీ ఈరోజు...."

"సారీ మరో మూడురోజులవరకూ ఐయామ్ బిజీ!"

"బోధపడింది."

మళ్ళీ మూడురోజులవరకూ పలకరించడనుకున్న జ్యోతి పొరపాటు పడినట్టు మరునాడే గుర్తించింది.

"సినిమాకు వెళదాం. వస్తారా!"

"చెప్పాగా బిజీగా ఉన్నానని. బోధపడిందన్నారూ?"

"అయితే నాకు బోధపడలేదు."

"మీకు పడదు లెండి."

"నామీద కోపం వచ్చినట్టుంది!"

"ఎందుకట?"

"మీరే చెప్పాలి."

"నో, నో, అదేం లేదు. మూడ్ సరిగాలేదు. నేను పిలుస్తా

నని చెప్పాగా....సరేనా....?"

మరో నాలుగురోజులు మాటాడలేదు జ్యోతి.

శ్యామసుందర్ కూడా పలకరించలేదు. తను మాట్లాడడం కోసం వెయిట్ చేస్తున్నాడనిపించింది. అయినా అతనితోనూ తగువు పెట్టుకుంటే వచ్చే సుఖం?

మరుసటిరోజు తనే పిలిచింది సీటుదగ్గరకు వెళ్ళి.

"హలో!" శ్యామసుందర్ ముఖం చేటంత అయింది.

"నాకు కాఫీ అక్కరలేదు కాని ఈరోజు సాయంకాలం సినిమాకి...."

"రూమ్‌కి వెళ్ళి వెళదాం" సీటుదగ్గరనుంచి వరండామీదకి వచ్చి చెప్పాడు.

తోటి గుమాస్తాలు తలెత్తి చూడడం ఇద్దరూ గమనించినా చూడనట్టే మాటాడుకుంటూ బయటకు నడిచారు.

"రూమ్‌కి వద్దులెండి. హాల్లోకి నేను నేరుగా వచ్చేస్తా. జగదాంబా ఫోయర్‌లో ఉండండి."

"థాంక్యూ!" గట్టిగా అందరికీ వినిపించేటట్టు అని గేటు దగ్గరకు వెళ్ళిపోయింది జ్యోతి.

స్నేహితురాలితో సినిమా అని చెప్పింది కిరణ్‌కి. 'నువ్ కూడా వస్తావా' అంటే 'నేను హోంవర్క్ చేసుకోవాలి రాను' అనేశాడు కిరణ్.

"అత్తయ్యా, నువ్ రాకూడదూ?"

"నేనెందుకులే అమ్మా. నాకు సినిమా ఇష్టంలేదు."

ఆలస్యంగా బయలుదేరింది.

హాలుదగ్గరకు వెళ్ళేసరికే ఆరూ నలభై అయిపోయింది. న్యూస్ రివ్యూ అయిపోయి ఉండాలనుకుంది.

ఫోయర్‌లో సిగరెట్టు కాలుస్తూ గేటువంకే చూస్తూ నుంచున్నాడు శ్యామ్.

"సారీ, ఆలస్యం అయిపోయింది."

"అసలు రారనుకున్నా, టిక్కెట్లు ఏంచెయ్యడమా అని ఆలో

చిస్తున్నా!"

"పదండి."

చీకట్లో నంబర్లు వెనక టార్చిలైటు చూపించే కుర్రాడి సాయంతో వెదుక్కుని కూర్చున్నారు.

ఐదునిముషాలు కాకుండా శ్యామ్ జ్యోతి చెయ్యిని తన చేతిలోకి తీసుకున్నాడు.

"అబ్బ! నిద్రవస్తోంది!" జ్యోతి మెల్లగా ఆవులించింది.

"పడుకోండి."

జ్యోతి తలను తన భుజాలమీదకు తీసుకున్నాడు.

పది నిముషాల్లో జ్యోతికి నిద్రపట్టేసింది.

ఇంటర్వల్ గంటమోగింది. లైట్లు జిగ్గుమన్నాయి.

"ఇంటికి పోదామా?" బయట డ్రింక్ తాగుతూ అడిగాడు శ్యామ్.

"సరే."

ఒక పావుగంటలో ఇద్దరూ శ్యామ్ గదికి వచ్చేశారు.

"జ్యోతీ. డియర్....ఈరకం బ్రతుకు నేనింక సహించలేను. నన్ను పెళ్ళిచేసుకో!"

"వాట్!?"

"అవును. అన్నీ తెలిసే అడుగుతున్నా....మిమ్మల్ని మూర్తి మోసంచేశాడు.... నన్ను చేసుకోడానికి ఇష్టపడితే.... ఐ విల్ బీ హాపీ...."

"శ్యామ్. నిజంగా నువ్ ఇంత అనుభవంలేనివాడి వనుకోలేదు. అనుకుంటూ ఉంటే నీ జోలికి వచ్చేదాన్ని కాదు. నువ్ వర్జిన్ వని నేను ఊహించలేదు. అయాం సారీ...."

"ఎందుకు?"

"నిన్ను అనవసరంగా ఈ ఊబిలోకి దింపినందుకు. ప్రేమ అంటే నాకు నమ్మకం పోయింది. పడక నిజం. ప్రేమ భ్రాంతి."

"నువ్ అలా మాటాడకు జ్యోతీ. నేను నిన్ను ప్రేమిస్తున్నాను."

"అమాయకుడివి శ్యామ్. ఈ పడకమైకం వదిలిపోగానే నువ్ అనుకుంటున్న ప్రేమ ఇగిరిపోతుంది. నువ్ నా జీవితంలో మరో మూర్తిలా నిష్క్రమిస్తావ్. నేను మళ్ళీ మొదటికొస్తాను."

"సినికల్‌గా మాటాడుతున్నావ్ జ్యోతీ! ఎవరు ఎదురొచ్చినా సరే నిన్ను పెండ్లిచేసుకుంటాను. నిజంగా...."

"ఏం? ఇలా సుఖంగా గడపడం నీ కిష్టంలేదా?"

"ఉంది. ఈ సుఖాన్ని శాశ్వతం చేసుకుందామని...."

"సరే, నిన్నెందుకు కాదనాలి? మూడునెలల తరవాత నువ్ ఇంకా నన్ను చేసుకుంటానని అంటే నేను అభ్యంతరం చెప్పను. సరేనా?"

"ఓ డియర్." మీదకు వాలిపోయాడు శ్యామ్.

శ్రీనాథ్‌ను మరిచిపోయినట్టే మూర్తి ముఖం కూడా మరిచి పోయాననుకుంది జ్యోతి. కలలో మూర్తి అప్పుడప్పుడూ కనపడుతూ ఉండేవాడు. ఇప్పుడు కలలోకూడా శ్యామ్. తనెంత మారిపోయింది! ఎంత మారిపోతోందీ?

కొత్త సంవత్సరం దగ్గరపడుతోంది.

న్యూ ఈయర్ గిఫ్ట్ శ్యామ్‌కి ఒకటి ఇవ్వాలనుకుంది. ఏమిటి ఇస్తే బావుంటుంది?—చటుక్కున మూర్తి షేవర్ జ్ఞాపకం వచ్చింది. శ్యామ్‌కి అలాంటి ఎలక్ట్రిక్ షేవర్ ఇస్తే....

ఆలోచిస్తూ డ్రాఫ్ట్ రాస్తోంది.

మెసంజర్ పోస్ట్ పట్టుకొచ్చి ఎవరి ఉత్తరాలు వాళ్ళకిస్తున్నాడు.

"జ్యోతిగారూ, మీకు కవరు...."

బయట ఫ్రమ్ ఎడ్రస్ లేదు. దస్తూరీ పోల్చుకోడానికి వీలుగా లేదు. పెద్ద కవరు. గ్రీటింగ్‌లా ఉంది.

కవరు చింపింది.

ఊహించినట్లే గ్రీటింగ్....చాలా సింపుల్‌గా అందంగా వుంది.

"యు ఆర్ అవుట్ ఆఫ్ మై సైట్. అవుట్ ఆఫ్ మై మైండ్!" కింద సంతకం "రాధాకృష్ణమూర్తి".

ఈ చమత్కార స్వభావమే తన మతిని పోగొట్టింది.

'అవుట్ ఆఫ్ సైట్, అవుట్ ఆఫ్ మైండ్' అని సామెత. అంటే మనిషి ఎదురుగా ఉన్నంతసేపూ జ్ఞాపకం, మనిషి మరుగైతే మరుపేనని.

నువ్ నా ఎదుట లేవు. మరి నాకు మతిపోయింది. సామెతను ట్విస్ట్ చేశాడు....గ్రీటింగ్ తయారుచేసిన రచయిత.

మూర్తి నవ్వుతున్నట్టు కనపడ్డాడు కార్డులో.

కవరులోకి చూపింది ఆశగా.

ఉత్తరమూ ఉంది.

గుండెలు దడదడలాడుతుండగా కాగితం మడత విప్పింది.

"డియర్ దీపం.

ఇన్నాళ్ళ ఉత్తరం రాయలేదని కుతకుతలాడిపోతుంటావ్. నాకు తెలుసు. ఆరునెల్లు సావాసం చేస్తే వారు వీరవుతారని సామెత. కాని ఇక్కడ గొడవల్లో ఐదు నిముషాలు ప్రశాంతంగా లేనంటే నువ్ నమ్మాలి.

సుఖంగా ఎందుకులేనో, రాయడమెందుకులే! బెజవాడనుంచి హైదరాబాదు వెళ్లాను. అనుకున్నట్టే జరిగింది. వడ్డించేవాడు మన వాడే....కాని వడ్డించేవరకూ....

జీవితంలో అర్థం చేసుకుని అభిమానించే వ్యక్తి దొరకటం పూర్వజన్మ సుకృతం. ఉద్యోగం విసుగెత్తుతోంది....శెలవు పెట్టేస్తున్నా....శెలవంటే ఆడదానికి పుట్టిల్లే. మరి నాకు....నువ్వే!

కొత్త సంవత్సరానికి కలిసే ఉందాం.

నీవాడై నీవాడు కాలేకపోయిన

మూర్తి."

ఛీ! మూర్తిని తనెంత అపార్థం చేసుకుంది!

జవాబు రాయడం ఎలా? మాటలు వెదుకుతూ డ్రాఫ్ట్ రాయడం పూర్తిచేసి ఏజంటు సంతకానికి పంపించేసింది.

"ఏమిటో చాలా గాఢంగా ఆలోచిస్తున్నారు?"

—శ్యామసుందర్.

"ఆ, ఏముంది మామూలే!"

"నిన్న పూర్తి చేయని ..."

"ఇవాళ పూర్తి చేస్తారా?"

"అంటే మీరు రారా?"

"చూడు శ్యామ్ సాయంకాలం మాటాడుకుందాం.... చూశావా మొహం ఎంత సీరియస్‌గా పెట్టేశావో?"

చిన్న నవ్వు నవ్వి వెళ్ళిపోయాడు శ్యామ్.

ముందు ఏజంటుని మంచి చేసుకోవాలి. కొత్త సంవత్సరం ముందు శెలవు తీసుకోడమే సులువు. మళ్ళీ ఫిబ్రవరినుంచీ పని ఎక్కువగా ఉంటుంది.

బ్యాంకు ఉద్యోగులందరికీ సంవత్సరానికి నెలరోజులు కంపల్సరీ శెలవు ఇస్తేకాని మనసుకి పట్టిన తుప్పు వదిలిపోదేమో! అవే కాగితము, అవే ఫారాలు. అవే టిక్కులు అవే సంతకాలు.

ఐదు గంటలకల్లా లేచి ఏజంటు గదిలోకి వెళ్ళింది.

"రండి, రండి, కూర్చోండి."

పిలుపు ధోరణి వాతావరణం, నిర్మలంగా ఉన్నట్టు సూచించాయ్.

ఏజంటుకి దొంగ కారణమేదో చెప్పి సెలవు సంగతి చెప్పి ఒప్పించుకొని బయటకొచ్చేసరికి పది నిమిషాలు పట్టింది.

మెట్లమీదే నుంచుని ఏజంటు గదివైపు చూస్తున్నాడు శ్యామ్.

"అబ్బ! ఇప్పటికైనా వచ్చారు."

"నాట్యకళ గురించి తలుచుకుంటే కాలం తెలియలేదు. నాక్కాదు ..." ఏజంటు గదివంక చూపించింది జ్యోతి.

"అలా వెళదాం...."

"నాకు ఇంటిదగ్గర పని ఉంది. రేపు కలుసుకుందాం."

"అదేమిటి? సాయంకాలం వస్తానన్నావ్?"

"సాయంకాలం ఆలోచిస్తానన్నాను. ప్లీజ్. నాకు పని ఉంది" ఓ అడుగు ముందుకు వేసింది.

"జ్యోతీ నన్నెందుకిలా హింపిస్తావ్?"

"డయలాగ్ వండర్‌ఫుల్‌గా ఉంది. నాకు పనుందని

చెప్పాడా....వస్తా....బై!"

నవ్వేసి వెళ్ళిపోయింది జ్యోతి.

తెల్లబోయి నిలబడ్డాడు.

జ్యోతి హైమవతమ్మతో ఇంటికి వెళ్ళగానే చెప్పింది. శెలవు పెట్టి బెజవాడ వెళ్ళే ఆలోచన గురించి.

"తాతగారింటికి వెళ్దామా" హైమవతమ్మ కిరణ్ నడిగింది.

"అమ్మకి శెలవో?" ఎదురు ప్రశ్న వేశాడు.

"అసలు వెళదామా?"

"మరి నా చదువో....శెలవల్లో కూడా మేష్టారు ప్రెయివేటు పెడతానన్నారు."

"అయితే నువ్వూ, మామ్మా ఇక్కడ ఉండిపోండి. నేను వెళతాను."

"అదేవిటీ నీకు శెలవు దొరక్క దొరక్క దొరికితే మేం ఇక్కడ ఉండి ఏం చేస్తాం?"

"నాన్నగారు వచ్చేస్తే?"

"అందుకేగా మిమల్ని ఉండమంటున్నది?"

"సరే నేనూ మామ్మా, ఉంటాం."

"చూద్దాంలే....ఇంకా టైముందిగా...."

అక్కడికి ఆ ప్రస్తావన ముగిసింది.

తన సీటులో కూచుని ఉత్తరం రాస్తోంది జ్యోతి.

శ్యామ్ వచ్చాడు. ఉత్తరం రాస్తున్నట్టు చూసి వెనక్కు వెళ్ళిపోయాడు. జాలి వేసింది జ్యోతికి.

ఇంతలో ఏజంటు పిలిచాడని కబురువస్తే రాస్తున్న ఉత్తరం ప్యాడ్ కింద పెట్టి ఏజంటు గదిలోకి వెళ్ళింది.

తిరిగి వచ్చేసరికి టేబిల్ మీద రాయవలసిన డ్రాఫ్ట్లు ఉన్నాయ్. అవి పూర్తిచేసి ఉత్తరం తీసింది. ఇన్లెండ్ లెటర్ పూర్తిగా అయిపోయింది. చెప్పవలసిన విషయం పూర్తికాలేదు.

నిట్టూర్చింది జ్యోతి.

రెస్టు ఇన్ పెర్సన్ అని చేర్చి ఉత్తరం మడిచి అంటించి

బ్యాగులో పడేసుకుంది వెళుతూ స్వయంగా పోస్ట్ చెయ్యడానికి.

## 10

డిసెంబరు పదిహేను కింకా పదిరోజులుంది.

తన ఒక్కర్తే వెళ్ళడమా, అందరూ కలిపి వెళ్ళడమా అన్నది తేలనేలేదు.

"అత్తయ్యా. నువ్వా వస్తే ఓ పదిపదిహేనురోజులుండి రావచ్చు. పెట్టడానికేం నెలరోజులు పెట్టాననుకో!"

"అబ్బాయి తిరిగొస్తాడనిపిస్తోంది. పాలమీద వెన్నా. పుట్టింటి మీది మమకారమూ అన్నారు. నువ్వెళ్ళి ఉండిరా....కిరణ్‌కీ చదువుంది. ఎంత చిన్న క్లాసయితే మాత్రం వాడి బరువు వాడికి ఉంది."

"సరే అత్తయ్యా మీ ఇష్టం. ఓ పదిరోజులుండి వచ్చేస్తా. నీకు కావలసినవన్నీ చూసే వెళతాలే!"

"నువ్వేంచూడక్కర్లా! నేనే చూసుకుంటా!"

"అంతవాడివైతే ఇంకేం కావాలి."

బ్యాగు మెడలో వేసుకుని బూట్లు టక్‌టక్‌లాడించుకుంటూ వెళ్ళిపోయాడు కిరణ్.

ఆరోజు ఆఫీసులో అనుకోని సంఘటన జరిగింది. లంచ్ రీసెస్‌లో శ్యామ్ వచ్చాడు తన గదిలోకి. వచ్చినదే తడవు ఉత్తరం రాయడం పూర్తి అయిందా అని అడిగాడు.

"ఏం ఉత్తరం?"

"యువర్ లవింగ్ ఫ్రెండ్‌కి."

"ఓహో! అదా, ఇంకొకరి ఉత్తరాలు చదవటం నాగరికమైన అలవాటు కాదు. నాకు చిన్నపుడే స్కూల్లో టీచర్ చెప్పింది."

"మనుషుల్ని బానిసల్ని చేసుకోడం...." ఎదురుగా కుర్చీలో కూచుంటూ అన్నాడు శ్యామ్.

"నేను చేసుకోవాలనుకున్నంత మాత్రాన ఎవరైనా బానిసలౌతారా?"

"స్వాతీ, అవన్నీ ఎందుకు? నేను చెప్పినది ఏంచేశావ్?"

"............?"

"అదే, మన పెళ్ళి?''

"ప్లీజ్ బోయ్. ఈరోజు రాత్రి వస్తా.... అనవసరంగా మనసు పాడుచేసుకోకు.''

"బయట వెయిట్ చేస్తుంటా, అయిదయాక.''

"వద్దు. మెడలో దుమ్ముకెందుకు. తినేది ఎలానూ తింటూ! నేనే రూమ్‌కి వస్తా.... ఓకే?''

నవ్వుతూ వెళ్ళిపోయాడు శ్యామ్.

అతని మనసుని కష్టపెట్టడమంటే బాధగా ఉంది జ్యోతికి. పాపం! చిన్నవాడు. అమాయకుడు. లోకం తీరు తెలియనివాడు.

మాట నిలబెట్టుకుంది జ్యోతి.

ఇంటినుంచి, అలా వెళ్ళివస్తానని చెప్పి, చెంగల్ రావ్ పేట బయలుదేరింది. వీధిలోంచే ఆహ్వానించి ఆమె లోపలకు వెళ్ళగానే తలుపు గడియపెట్టేశాడు శ్యామ్.

"ఐ డోన్ట్ వాంట్ టు బీ డిస్టర్బ్‌డ్!'' అంటూ.

"ఎన్నాళ్ళయింది మనం కలిసి!"

"ఎన్నాళ్ళయింది. మొన్ననేగా....''

"కాఫీతీసుకుంటావా?" ఫ్లాస్క్ తీశాడు. "జస్ట్ ఎ స్నాక్!" బిస్కెట్ పేకెట్టు విప్పాడు.

పరాకుగా చూస్తోంది జ్యోతి.

"ఏమిటో ఆ ఆలోచన?''

"ఆఁ! అబ్బే. ఏంలేదు.''

శ్యామ్ ముఖం వాడిపోయింది.

ఫ్లాస్క్‌లో కాఫీ కప్పుల్లో పోసి ఒక కప్పు జ్యోతికిచ్చి, ఒక గుక్క తాగి కప్పు కిందపెట్టి సిగరెట్ వెలిగించాడు.

"అబ్బ!'' జ్యోతికి దగ్గువచ్చింది.

సిగరెట్ పొగ గదంతా వ్యాపిస్తోంది.

"జ్యోతీ, ఐ లవ్ యూ, వై డోన్ట్ యూ మేరీమీ?"

"మళ్ళీ అదే ప్రశ్నా? కొన్నాళ్ళు ఆగి చెప్తమన్నానుగా. ఇప్పుడేం తొందర వచ్చింది?"

"నిన్ను ఎవరైనా తాకితే నే చూడలేను.''

"నువ్ మరీ అమాయకుడివి. అదెలా సాధ్యం చెప్పు?'"

"అంతే?"

"నేను ఇక్కడికి వచ్చానని తెలిస్తే మూర్తి ఏమంటాడో తెలుసా?"

"తెలీదు....నాదగ్గరకు వచ్చినట్టే అతని దగ్గరకూ వెళ్ళిం....."

"పూర్ డియర్. నీ బాధలో నన్ను నొప్పించాలని ప్రయత్నంస్తున్నావ్."

"నీకు మనసు లేదూ?"

"లేకపోతే?"

"జ్యోతీ, అన్నీ సులువ్‌గా తీసిపారేస్తావ్. నువ్ దేన్నీ రియస్‌గా తీసుకోవా?"

"తీసుకోకూడదనే నీతో చెప్పాలని ప్రయత్నం. సరియైన టలు వెదుకుతున్నానంతే!"

"రేపు ఏం జరుగుతుందా అనే ఆలోచన లేదా నీకు?"

"ఆ ప్రశ్నలకు సమాధానం చెప్పలేను. నాకు అలసటగా ది. వేగం వెళ్ళిపోవాలి...."

"వద్దు. వెళ్ళొద్దు. ఇలా రా. రిలాక్స్ అవుదువుగాని."

మంచంమీద వెల్లకిలా పడుకుంది జ్యోతి.

గదిలో శ్యామ్ వెలిగించిన ఊదువత్తుల వాసనని తరిమేసి కమించుకుంది సిగరెట్టు పొగ.

"మూర్తి దగ్గరకు వెళ్ళిపోతున్నావ్ కదూ, జ్యోతీ, నిజం ప్పు." శ్యామ్ సూటిగానే అడిగాడు.

"నువ్ చెప్పు. ఉత్తరం ఎంతవరకూ చదివావ్?"

"........"

"నిజం చెప్పు."

"........"

"సరే. నే వెళుతున్నా!" చటుక్కున లేచింది జ్యోతి.

"వద్దు. జ్యోతీ, వెళ్ళొద్దు. నువ్ లేకుండా నేను బ్రతకలేను
ఉత్తరం, నేను చూడలేదు. గెస్ చేశానంతే. కాని...."

"సరే, ఆ విషయం మరి మాటాడుకోవద్దు మనం. సరేనా?"

"కాని, కాని...."

"ఏమంటావ్. నేను వేగం వస్తానని ఇంటిదగ్గర చెప్పా
తల్లిగా, కోడలిగా కూడా నాకు కొన్ని బాధ్యతలున్నయ్."

"సారీ జ్యోతీ. నేను పశువుని కాను. అన్యమనస్కయయి
స్త్రీతోని బలాత్కరించలేను. నువ్వన్నట్టు బొత్తిగా అనుభవంలే
వాడిని.... నన్ను చేసుకుంటే నీకు ఏ లోటూ రాకుండా చూస్తాను.

"నా కొడుకునీ, అత్తగార్నీ కూడా.... ఇంకా వస్తే...."

"వాళ్ళకి నీ జీతం పంపించెయ్."

"మన పెళ్ళికి మీ అమ్మా, నాన్నా, వస్తారా?"

"వాళ్ళతో ఏం పని, రిజిస్టర్డ్...."

"అవును కాగితం ముక్కయితే చింపి పారెయ్యవచ్చు
అంతేనా?"

"అదికాదు. నీకు దేవుడంటే నమ్మకం ఉంటే గుళ్ళో...."

"ఆ తరవాత?"

"హాయిగా...."

"అవును నువ్ ఆఫీసునుంచి వచ్చేసరికి నేను మరో
నిముషాలు ముందే వచ్చి కాఫీ టిఫిన్ తయారుచెయ్యాలి.
వండి, వడ్డించి పనులు చూసుకుని నీతోబాటు ఆఫీసుకు రావా
చూడు శ్యామ్ పెళ్ళిలేకుండా ఇలాగే జీవించలేమా? ఒకసారి చే
తప్పు మళ్ళీ చేస్తామా?"

"పెళ్ళయితే ఒక గాడీలో పడుతుంది జీవితం...."

"ప్చ్! మై డియర్ బోయ్! నా జీవితం ఒక గాడీలో
మూడు గాడీలలో పడింది. మూడు వంకల్లో వెనక్కి వెళుతున్నా
నేను. నాకు ఇంక దేనిమీదా మోజులేదు. రేపటి గురించి ఆలోచి
ధైర్యమూ లేదు. నిన్ను చూసి పొరపాటుపడ్డాను. నాకు తగిన మ
వనుకున్నాను. నాలాంటి వాడివేననుకున్నాను. పొరపాటు. ఈ రక

జ్యో

బంధాలు నాకు సరిపడవ్. సీసాలు ఎక్కడా కనపడటంలేదేం.... పెళ్ళి చేసుకోబోతున్నానని మంచివాడి వయిపోయావేమిటి?"

"నిజమే. నేను ఏకాకిననే కసితోచేసే పనులు ఇంకెలా చేస్తాను. నేను ఇంక ఏకాకి కాదు. నాకూ ఓ మనసిచ్చిన మనిషి దొరికింది."

"మనసైతే ఇచ్చిందికాని మనువుకు రానంటే?"

"ఓర్మితో ఏ పనినైనా సాధించగలననే నమ్మకం ఉంది నాకు."

"నీ నమ్మకం పొగడదగినదే. ఏడున్నర అయిపోయింది. మావాడి ప్రశ్నలు తట్టుకోవడం కష్టం. ఇక వెళతా!"

"ఉండు."

మెల్లగా వచ్చి మంచంమీద కూర్చుని జ్యోతిమీదకు వంగి ఆమె కళ్ళలోకి చూశాడు.

"ఏమిటలా చూస్తున్నావ్?"

"జ్యోతీ, నీ కళ్ళలో వెలుగు ఎవరి కళ్ళలోనూ చూడలేదు. యూ హేవ్ వెరీ పవర్‌ఫుల్ అయిస్!"

"అవే కొంపమీదకు తెచ్చాయ్! పొగడ్తలంటే నాకు గిట్టదు."

"ఇది పొగడ్తకాదు నిజం."

నిట్టూర్చి లేచి కూచుంది జ్యోతి.

"మరో రోజు మళ్ళీ వస్తా" లేచి బట్టలు సవరించుకుని జోళ్ల తొడుక్కుని వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది.

తను విటుడిగా మొదలై ప్రేమికుడిగా ఎలా మారిపోతున్నాడో ఆలోచిస్తున్నాడు శ్యామ్.

## 11

వర్క్‌షాప్‌లోని పనివాళ్ళు చేతికి కట్టున్న కొత్త వ్యక్తిని చూసి వింతగా ఆలోచించడం మొదలెట్టారు. కొంతమంది రిక్షా సిరి గాడితో శ్రీనాథ్‌ని కనెక్ట్ చెయ్యగలిగారు. అతని బట్టలుచూసి మనిషిని పోలిన మనిషి ఉండవచ్చని మరికొందరి ఆలోచన.

"ఒరేయ్, ఈ ఇంజను దింపాలి. అందర్నీ ఓమారు కేకెయ్!"

ఫోర్‌మెన్ పిలిచాడు. ఎక్కడి పనులు అక్కడ వదిలేసి వచ్చారు అందరూ. ఇంజనుకూ ఒక కాడికీ పెద్ద మోకులు కట్టి ఒక్క ఉదుటన దింపేశారు, మీదకెత్తిన ఇంజన్ని.

బయట ఒక స్కూటర్ ఆగింది.

"పొగ తెల్లగా వస్తోంది" సూట్‌వాలా అన్నాడు ఫోర్‌మెన్‌తో.

"ఎన్నాళ్ళయింది కొని?"

"రెండు నెలలు. మొదటి సర్వీసింగ్ కూడా కాలేదు."

"చూస్తా!"

పనిముట్లలో ముందుకొచ్చాడు: "పెట్రోల్ కన్‌సమ్షన్ ఎలా వస్తోంది సార్?"

"పదిహేడూ, పద్దెనిమిదీ...."

"స్పార్కింగ్ చూడాలి.... పోనీ ఓ రెండురోజులు ఆగ కూడదూ. మొదటి సర్వీసింగ్‌వరకూ...."

"మీరు ఒకసారి చూడండి."

శ్రీనాథ్ ఒక విషయం గుర్తించాడు. రిక్షావాడిని ఒరేయ్ అని పిలిచే ఈ ఊళ్ళో మోటర్ మెకానిక్‌ని ఏమండి అంటున్నారు.

"రావోయ్ బావా! నాకంటే ముందెలా వచ్చేశావ్?"

భూషణంగారు వెనకాలే వస్తూ పలకరించారు. శ్రీనాథ్ చెయ్యి చేతిలోకి తీసుకుని వర్క్‌షాప్ అంతా చూపిస్తున్నారు.

ఒకదగ్గర వెల్డింగ్ చేస్తున్నారు, మరోదగ్గర మరో రకపు వెల్డింగ్.... టైర్ డి త్రేడింగ్ సెక్షన్. ప్మితే, కార్పెంట్రీ, వివిధ భాగాలూ చూశారు.

"ఇక రిపేరింగ్ వర్క్స్ మనకి వస్తాయి. రోజూ చిన్నా పెద్దా ఒక పదిపనులు చేస్తూంటాం. వాటికి ఎంతెంత అవుతుందో అది ఎస్టిమేట్...." చెప్తున్నారాయన.

"సార్! నాకు తలకు మించిన పని అవుతుందేమో...."

"సార్ అనకు. బావ అను. వీళ్ళందరికీ నువ్ మా బావమరిది వని చెప్తాము.... ఎస్టిమేట్ నీకు ఫోర్‌మెన్ చెబుతాడు. మంచి కాగితంమీద అంకెలు వెయ్యడంవరకే నీ బాధ్యత."

ఇద్దరు చుట్టూ ఓమారు తిరిగివచ్చి ఆఫీసు గదిలోకి వెళ్ళారు. ఓ పక్క టెలిఫోన్ ఉంది ఒక ఎత్తు బల్లమీద.

భూషణంగారు కుర్చీలో కూచుని ఎదురుకుర్చీ శ్రీనాథ్‌కి చూపించారు.

"ఆ పెయింటర్ని ఇలా పిల్చుకురా!" అబ్బాయి వెళ్ళి పిలుచుకొచ్చాడు.

"పిలిచారట."

"ఆ కారు సాయంకాలానికి ఇచ్చెయ్యాలి ...."

"బాబూ!"

"ఏమిటది?" హుంకరించారు భూషణంగారు.

ఆయన గొంతులో అంత ఆగ్రహం ఎప్పుడూ వినని శ్రీనాథ్ త్రుళ్ళిపడ్డాడు.

"ఏం, ఒళ్ళు పొగరుబలిసి తాగి పడుకున్నావ్. ఆ ఇల్లాలు లబోదిబో మంటూంటే వినకుండా ఏం నీకు తాగుడేం? సరే మరో రోజు టైమిచ్చాను. రేపు సాయంకాలానికి చెయ్యకపోతే మక్కెలు విరిగిపోతాయి....వాళ్ళకు నేను ఎలాగో సర్దిచెప్పాలి."

తల వంచుకు వెళ్ళిపోయాడు పెయింటర్.

"మనుషుల్ని మనుషుల్లా చూడాలి. కాని ఒక్కొక్కప్పుడు కొరడాకు మించిన ఆయుధం లేదు. ఈ వెధవ రోజుకి పదిరూపాయలు తెచ్చుకుంటాడు. అందులో మూడు రూపాయలు తాగుడికే అయిపోతాయ్. ఈడొచ్చిన పిల్ల పెళ్ళికుంది ఇంట్లో. అతని భార్య నాదగ్గర కొచ్చి ఏడుస్తుంది. నేనేం చెయ్యను? నా బాధలు ఎవరితో చెప్పుకోను? నామాటంటేనే భయం. చెయ్యి చేసుకుంటే అసలు ఊరు వదిలి వెళ్ళిపోతాడని భయం, అప్పుడు ఆ సంసారం బాధ్యత అంతా నామీదే పడుతుంది."

శ్రీనాథ్‌ని అందరికీ పరిచయంచేసి వెళ్ళారు భూషణంగారు.

శ్రీనాథ్‌కి ఉద్యోగం కొత్త. పెద్ద బాధ్యత. ఎవరితోనూ గట్టిగా మాటాడి ఎరగని మనిషేమో చాలా ఇబ్బందిపడవలసి వచ్చింది పని బాగా అలవాటు అయ్యేవరకూ.

రోజూ ఏడున్నరకల్లా వర్క్‌షాప్‌కి రావడం, మధ్యాహ్నం ఒంటిగంటవరకూ ఉండి ఫోర్‌మెన్ భోజనంచేసి వచ్చాక వెడు తుండడం జరుగుతుండేది. పని పూర్తి అయేసరికి రాత్రి ఎనిమిదవు తుండేవి. పద్దులూ రాతకోతలూ చాలా ఉండేవి.

ఇంతలో రెండు రిక్షాలూ రిపేర్ చేయవలసివచ్చింది. ఒక దాని ఫోర్క్ దెబ్బతింటే, రెండోదాని ఫ్రేం విరిగింది.

పెంటయ్యతో చెప్పాడు వర్క్‌షాప్ కివ్వమని. ఫోర్‌మెన్ చెప్పినట్టు వాటికయ్యే ఖర్చు తను ఇస్తానని చెప్పాడు.

చిన్న రిపెయిర్లన్నీ చేయించి బళ్ళను మళ్ళీ నడుపుపెట్టాడు. వాటికయ్యే ఖర్చుల ఎస్టిమేట్ ఫోర్‌మెన్ చెప్పిన ప్రకారం ఫెయిర్ కాపీచేసి పెంటయ్యకిచ్చి డబ్బు ఇచ్చెయ్యమని వసూలు చేశాడు. సాయంకాలానికి ఆ డబ్బు ఎకౌంటు పుస్తకంలో జమగాపడింది.

కొత్తలో కొంత కష్టంగా ఉన్నా కొత్త ఉద్యోగానికి అలవాటు పడిపోయాడు శ్రీనాథ్.

ఒకనాడు జేబులో డబ్బు పెట్టుకుని మూర్తి ఇంటికి వెళ్ళాడు. అతన్ని చూడగానే అంది వసుంధర: "మీకు కబురు చెయ్యమని చెప్పాను. మేం రేపే బయలుదేరి విశాఖ వెళ్ళాలనుకుంటున్నాం. బస్సులో టిక్కెట్లు కూడా చెప్పేశారు. మీవాళ్ళ దగ్గరకి వెళతా. ఏమైనా చెప్పమంటారా?"

"చూశారా, ఈ వర్క్‌షాప్ గొడవలో మళ్ళీ రావడానికి వీలు కాలేదు. మీరు ఈ ఐదు వందలూ మా అమ్మకివ్వండి. క్షేమంగా ఉన్నానని చెప్పండి. నేను త్వరలో వచ్చి తీసుకెళతానని చెప్పండి. ఈ పాకలో ఏం ఉండగలదు? మొదటినుంచి సుఖానికి అలవాటుపడ్డ మనిషి. ఒకటిరెండు నెలల్లో ఏదైనా ఇల్లు చూసి వెళ్ళి తీసుకువస్తా. కిరణ్‌ని బాగా చదువుకోమని చెప్పమన్నానని చెప్పండి."

"ఉత్తరం ఏమైనా ఇస్తారా?"

"ఉత్తరం ఎందుకులెండి. రైల్లో నే కనిపించి ఇచ్చానని చెప్పండి. వస్తా."

వర్క్‌షాప్‌కి చేరగానే భూషణంగారి దగ్గరనుంచి కబురు

వచ్చినట్టు తెలిసింది. వెంటనే ఆయన ఇంటికి వెళ్లాడు.

"రావోయ్ బావా, కూచో!"

చుట్టుపక్కల ఎవరూ లేకపోయినా ఇలా పిలవడానికి కారణం ఏమిటో శ్రీనాథ్‌కు అవగాహన కాలేదు.

"అదేమిటీ, ఆ పుస్తకమేమిటీ?"

"ఎకౌంట్ బుక్!"

"అవి చూడడానికి నేను నిన్ను రమ్మనలేదు. నేనంటే అందరికీ అభిమానంకంటె భయమే ఎక్కువ. నన్ను ప్రేమించే మనిషి ఒక్కర్తే ఉంది. నా భార్య సుబ్బలక్ష్మి....నువ్ నన్ను అభిమానిస్తావని ఆశ...."

"మీరు నాకు దైవసమానులు."

"అంతమాటనకు. నేను నీ అభిమానాన్ని పొందగలిగితే చాలా సంతోషం. నీతో చాలా మాటాడాలని పిలిచాను. రిక్షాలమీద డబ్బు సరిగా వస్తోందా?"

"ఏం డబ్బు! ఈ రోజే వాటిమీద చాలా మదుపునుపెట్టి బాగుచేయించాను."

"మన వర్క్‌షాప్‌లో చేయించలేకపోయావా?"

"అక్కడే చేయించాను."

"ఎంత అయింది?"

ఎకౌంటు పుస్తకం ఇచ్చేశాడు శ్రీనాథ్.

"నీ నిజాయితీ నాకు తెలుసు. పాపాయ్! మావయ్యకి కాఫీ తీసుకురా. నాకున్నదల్లా ఈ అమ్మాయి ఒక్కతే. నాకు ఏ ప్రమాదం జరిగినా దీనిని ఆదుకోవలసింది నువ్. మామయ్య అనే చెప్పాను నీ గురించి. నేను ఎవరినీ ఏదీ అడగలేదు. నువ్ నాకు ఒక ఉపకారం చెయ్యాలి."

కప్పులు పట్టుకుని వచ్చింది పాప.

"ఈయనేనమ్మా, శ్రీనాథ్ మామయ్య. చెప్పాగా సైన్యంలో పని చేస్తున్నాడని. ఇక మనతోనే ఉంటాడు."

"పది దాటిపోయిందే, నే వెళతా." శ్రీనాథ్ లేవబోయాడు.

"కూచో! వెళదువ్‌గాని .... ఈ రోజు మంచిరోజు. ముహూర్తం బావుంది. ఇవాళనుంచీ నీ బసా, భోజనం అన్నీ ఇక్కడే. నేను ఫోన్‌చేస్తా. ఫోర్‌మెన్ అంతా చూసుకుంటాడు. నా ప్రవర్తన నీకు ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. సమంజసమే. నమ్మక మైన, నిజాయితీపరుడైన మనిషి అభిమానాన్ని సంపాదించడం చాలా కష్టం. నిజానికి అల్లాంటిమనిషికోసం చాలా రోజులనుంచీ వెదుకు తూనే ఉన్నాను. ఆ మేనేజర్ ధర్మమా అంటూ నువ్ తారసిల్లావ్. ఏకవచనప్రయోగం చేస్తున్నానని ఏమనుకోకు. ఆత్మీయతకీ, అను రాగానికీ, గౌరవవాచకాలకీ పొత్తు కుదరదు.

ఇక నా జీవితం. దీని గురించి నేనెవరికీ చెప్పలేదు. ప్రజలు రకరకాలుగా ఊహాగానాలు చేస్తున్నారని నాకు తెలుసు.

స్వయంకృషిమీద భరోసా ఉంది. కష్టపడి పనిచేసేవాళ్ళంటే నాకు చాలా అభిమానం. కారణం నేనూ అలాంటివాడిని కావడమే!

మా నాన్నగారు ధనవంతులే. కాని నాన్నని నాన్నా అని పిలిచే అదృష్టం నాకు లేదు. మా నాన్నగారు బుగత్‌గారు. మా అమ్మ ఒక పల్లెటూరి మనిషి. బుగత్‌గారింట్లో పనిచేసేది. బుగత్‌గారికి తనను పెళ్ళిచేసుకునే ధైర్యం లేకపోయినా, నే పుట్టి బట్టకట్టడానికి భయపడ లేదు మా అమ్మ. చాలా చిన్నవయసులోనే తను పాపంచేసిందన్న ప్రజల భావానికి ప్రాయశ్చిత్తంగా కన్నుమూసింది. ఐదేళ్ళవాడిని. బుగత్‌గారికి పిల్లలు లేరు, పెళ్ళి చేసుకున్న భార్య ద్వారా. అతని అక్కగారికి ఆయన ఆస్తిఅంతా సంక్రమించింది. ఆ ఊళ్ళోనే ఉండే వారు వాళ్ళు. నేనూ ఆ ఇంట్లోనే ఉండేవాడిని.

బుగత్‌గారు ఉన్నన్నాళ్లూ నాకే లోటూ లేదు. ఆ ఊళ్ళోనే అ, ఆలు నేర్చుకున్నాను. ఆయన పోయిన తరవాత నా కష్టాలు ప్రారంభమయ్యాయి. అప్పటికింకా ఐదో తరగతి చదువుతున్నాను.

అప్పటికి సుబ్బలక్ష్మి ఐదేళ్ళది. నేనంటే దానికి ప్రాణం. బుగత్‌గారి అక్క కూతురు.

ఆస్తి చేతచిక్కిందే తడవు సుబ్బలక్ష్మి తల్లీ, తండ్రీ నన్ను ఇంట్లోంచి వెళ్ళగొట్టేశారు. దిక్కులేనివాడికి దేవుడే దిక్కు. పల్లె

వదిలి పట్నం చేరాను. లారీలో పనిలో కుదిరాను. బస్సులు కటిగాను. అనేకమైన ఊడిగాలు చేశాను. కాని సుబ్బలక్ష్మిని మరిచిపోలేదు. దొంగచాటుగా గ్రామం వెళ్ళి ఆమెను చూస్తూండేవాడిని. ఆమె అనురాగమే నా బ్రతుక్కింత సార్థక్యాన్ని చేకూర్చింది. పార్వతీపురం వచ్చి సుమారు పాతికేళ్ళయింది. మా ఓనర్ చలవ. నా చరిత్ర విని నన్ను పెళ్ళిచేసుకోమని ప్రోత్సహించాడు. సుబ్బలక్ష్మి మాటాడకుండా నాతో వచ్చేసింది తన అన్ననూ, తల్లినీ, తండ్రినీ, ఆస్తినీ, అంతస్తునీ వదిలేసి.

అంతేకాదు. ఈనాటికి కూడా సుబ్బలక్ష్మి వాళ్ళవాళ్ళని తలచుకోలేదు.

దేవుడు దయచూశాడు. ఆస్తిపరుడినయ్యాను. హోదా పెంచుకున్నాను. మనుషుల్ని కొనగలం కాని మనసుల్ని కొనడం సాధ్యం కాదు. మనసిచ్చి పుచ్చుకోవడం సంస్కారం. మేనేజర్ నీ గురించి చెప్పాడు. స్వయంకృషిమీద బ్రతకాలనుకోవడం చాలా గౌరవించదగిన ఉద్దేశ్యం. అప్పుడే నీకు ఉద్యోగం ఇవ్వాలనుకున్నాను. కాని నిగ్రహించుకున్నాను. నిజంగా నువ్ వచ్చిన నిశ్చయానికి కట్టుబడి జీవితంలోని మార్పును సహనంతో మలుచుకోగలవా? చూసి నీకు ఉద్యోగమిచ్చి నిన్నొక వరం అడుగుదామనుకున్నాను. వరమనే అడుగుతున్నాను. ఇది నీ మనసులో దాచుకోవాల్సిన విషయం."

గాజుల గలగల....కర్టెన్‌వంక చూశాడు శ్రీనాథ్.

"సుబ్బలక్ష్మి ఆరోగ్యం చెడిపోయింది, పాప కడుపులో పడకముందే. నిజంగా స్త్రీ ప్రేమకి అర్హుడవగలగడం పురుషుడి అదృష్టమే. ఆమె వేదన చూడలేకపోయాను. ఆమె బ్రతకదు. ఆమెను బ్రతికించాలని పట్టుదల. మా అనుమానం నిజమని డాక్టరు దగ్గర తెలుసుకున్నాం. ఈ చిన్న ఊళ్ళో వైద్యసహాయం, అందులో ఆ రోజుల్లో అంతంతమాత్రంగా ఉండేది. ఆమెకు నేనే సర్వస్వమని నచ్చచెప్పాను. అందుకు ప్రతిఫలమే పాప. పాప పుట్టిన తరవాత సుబ్బలక్ష్మి ఆరోగ్యం మరీ క్షీణించడం మొదలైంది. నా అనురాగం, ఆత్మీయతా చూసి ఆమె మైమరిచిపోయింది. తత్పరిణామంగా

ఆమె జబ్బు ముదిరింది.

ఒకవంక వ్యాపారం అభివృద్ధి చెందుతోంది. చేతినిండా డబ్బు. కాని వ్యాధిగమనాన్ని ఆపవచ్చన్నాడు డాక్టర్. మరో రెండు సంవత్స రాలు వైద్యం చేయించాను. వ్యాధిగమనం ఆగింది. తను చెయ్య గలిగిన భీభత్సమంతా చేసి మరి ముందుకు వెళ్ళలేకపోయింది రోగం."

అప్రయత్నంగా శ్రీనాధ్ కర్టెన్‌వంక చూశాడు.

గాజుల గలగల వినపడలేదు.

ఇంతకీ సుబ్బులక్ష్మి చనిపోయిందా? చనిపోతే ఈ గాజుల గలగల ఎక్కడనుంచీ వస్తోంది?

అతని గురించి అనేకమైన కథలువిన్నా. తాను స్త్రీల విష యంలో నిప్పులాంటివాడనే విన్నాడు.

మరి ఈమె ఎవరు?

"మీ కోసం ఎవరో వచ్చారు." పనివాడొచ్చి చెప్పాడు.

"ఉండమను."

"చాలాసేపయింది వచ్చి."

వెంటనే బయటకు వెళ్ళారు "చూసివస్తా?" అంటూ. మరో పదినిముషాలు తరవాత వచ్చి "నేను ఆఫీముకు అర్జంటుగా వెళ్లాలి." బట్టలు మార్చుకుని వెళ్ళిపోయారు భూషణంగారు.

ఆయన చరిత్రవెనక అతని మంచితనం తేటతెల్లమయినా ఆయనకి తను చెయ్యగలిగిన సహాయం ఏమిటో ఎంత ఆలోచించినా బోధపడలేదు శ్రీనాథ్‌కి.

మరుసటిరోజు శ్రీనాధ్ స్నానం చేస్తుండగానే కబురొచ్చింది. గబగబా స్నానం ముగించుకొని తుండుగుడ్డతోనే బయటికి వచ్చాడు. వచ్చిన మనిషి చీటీ ఇచ్చాడు.

"నిన్ననే చెప్పాలనుకున్నాను. అసలు విషయం వదిలేసి ఏమిటేమిటో చెప్పాను. లారీలో సామాను వేసుకుని వచ్చెయ్."

తలెత్తి చూసేసరికి ఎదురుగా రోడ్డుమీద లారీ.

"నేవచ్చి మాటాడుతా. లారీ తీసుకుని వెళ్ళిపోమను."

వంట పూర్తిచేసుకుని వర్క్‌షాపుకి బయలుదేరాడు శ్రీనాధ్.

వెళ్ళిన మరో అరగంటకి ఫోన్ చేశారు వినయభూషణంగారు.

"లారీ తిరగ్గొట్టేశావెందుకనీ?"

"నాకు లారీ కావలసినంత సామానేం వుందీ? అందుకని ..."

''సామాను తరవాత తెచ్చుకోవచ్చు. భోజనానికి ఇక్కడికి వచ్చెయ్."

"సరే. వస్తాకాని నా కోసం ఎదురుచూడకుండా మీరు ముందు చేసెయ్యండి.''

ఫోన్ పెట్టేశారు భూషణంగారు.

"పూర్ణమ్మా, శ్రీనాథ్ వచ్చాడు వడ్డించెయ్!" తను లోపల వస్తూనే చెప్పేశారు.

వెండిపువ్వులున్న పీటలు. వెండి కంచాలు. పక్కనే వెం మరచెంబుతో నీళ్ళు, వెండి గ్లాసులూ.

భోజనాల గదిలోనే ఒకవంక ఎత్తుగా దేవుడి తీను.

"నెయ్యి వెచ్చపెట్టేరా?" లోపల గదిలోంచి సన్నటి గొంత

"పెట్టానమ్మా. కూచోండి బాబూ."

"ఈమె పూర్ణమ్మగారని. నిజంగా అన్నపూర్ణ."

"వడియాలూ, అప్పడాలూ వేయించారా?" మళ్ళీ లో గొంతు.

"వేయించానమ్మా."

శ్రీనాథ్‌కి ఇదంతా కలలా తోచింది. భోజనాల తరవాత పక గదిలోకి వెళ్ళారు. చిన్న బల్లమీద ఓ వెండి అడ్డాకులో వక్క ఆకులూ, సున్నాం, ఏలకకాయలూ.

మెల్లగా ఆకులకి సున్నం రాస్తూ భూషణంగారు తన మన లోని విషయాన్ని బయటపెట్టారు.

"సుబ్బలక్ష్మి ఇంకెంతో కాలం బ్రతకదు. ఇప్పటికే ఒకసా రక్తం ఎక్కించడం జరిగింది, బొంబాయిలో. శరీరంలో ర పూర్తిగా తీసేసి కొత్త రక్తం ఎక్కించడం ఒక్కసారే సాధ్యమ ఆమెతో నే కూడా, పాపని చూసుకునే బాధ్యత నీదే. నువ్ నేను పనిని దేనినీ చెయ్యవద్దని వారించవద్దు. ఎంతో ఆలోచన చెయ్యి

నేను ఏమీచెయ్యను. ఆమె తనకువచ్చిన జబ్బుకంటె అసహ్యంతో ఎక్కువ బాధపడింది. ఆమెను మనిషిని చెయ్యడానికి నేను ఆమెకు మాట ఇచ్చాను. మాట నిలబెట్టుకుంటాను. పాపను ఎవరికి అప్ప గించాలా అనే ఆలోచిస్తున్నాను. నా పాపను నీ పాపగా చూసుకుంటా నని మాట ఇస్తే పోయేప్రాణాలు తృప్తిగా, సంతోషంగా పోతాయి. ఇక రా లోపలికి వెళదాం."

"సుబ్బలక్ష్మీ!"

"ఆఁ!" మెల్లగా వినిపించింది ఆమె వింతైన గొంతు.

"ఇడుగో, ఇతనే శ్రీనాధ్."

ఆమె మంచంమీద పడుకుని ఉంది. కాళ్ళవరకూ దుప్పటే ప్పి ఉంది. పాలిపోయిన తెల్లని ముఖంలో నల్లటి కళ్ళు శ్రీనాథ్ ంక చూశాయి.

"నమస్కారం! మిమ్మల్ని ఒకటి అడగాలని చాలారోజులుగా అనుకుంటున్నాను. నా తదనంతరం ఆయన్నీ-పాపనీ మీరు ఒక కంట నిపెట్టాలి. ఏనాటి పాపఫలమో ఈ రోగం. మీరు నాకు సోదరులు. యన ఏదో ప్రమాణం చేశానంటున్నారు అది అబద్ధం. ప్రాణం సుకోడానికి ఏ వ్యక్తికీ హక్కులేదు. అలా అయితే ఏనాడో నా ాణం తీసుకునే ఉందును. నేను నిశ్చింతగా మరణించడానికి ద్ధంగా ఉండి ఆ భగవంతుడి పిలుపుకోసం ఎదురుచూస్తున్నాను. రు ఆయనకు ఆసరాగా ఉంటారు కదూ!"

అప్పటికే ఆమె కంఠస్వరం చాలా హీనంగా వినపడుతోంది. మె అలిసిపోయింది. కళ్ళు మూతలుపడ్డాయి. నిద్రపోయినట్టుంది. ానసికమైన అలసట ఆమె శరీరస్థితికి ప్రమాదకరమైనదేమో!

శ్రీనాధ్ తన సమస్యలతోనే సతమతమవుతూ ఉంటే ఇదొకటి. ంత దంపతులు, వింత వ్యక్తులు, వింత జీవితాలు.

చనిపోతున్నానని తెలిసి,శరీరంలో శక్తిక్షణక్షణం క్షీణిస్తున్నా. మెలోని ఏమి హుందా! భర్తమీద ఏమి ఆ అనురాగం!

శ్రీనాధ్ ఆమెవంకే చూస్తున్నాడు.

ఇక వెళదాం అన్నట్టు సైగచేశారు వినయభూషణంగారు.

---

"ఇది నీ ఇల్లనుకో. మేడమీద గది నీ కోసం ఏర్పాటు చేశాను. మీ కుటుంబం విశాఖలో ఉందట కదా?"

"అవునండీ."

"పాపా, మావయ్య గది చూపించు" హాల్లోకి వచ్చిన పాపకి చెప్పారు.

తన భార్య ప్రస్తావన రానందుకు శ్రీనాథ్ సంతోషించాడు.

## 12

పాకలో ఉన్న బ్యాగ్ తెచ్చుకోవడానికి వెళ్ళినప్పుడు, అక్కడ ఇంతకాలమూ ఆత్మీయత చూపినవారిని వొదిలొస్తున్నందుకు చాలా బాధపడ్డాడు శ్రీనాథ్. బ్యాగ్ తన గదిలో పడేసి వర్క్‌షాప్‌కి వెళ్ళాడు శ్రీనాథ్. అక్కడికి వచ్చాడు రామచంద్రమూర్తి.

"విన్నా, నాకు చాలా ఆనందంగా వుంది. 'దేవుడున్నాడు', 'అంతా మన మంచికే' అన్న మాటలు శుష్కప్రియాలు కావు. ఆలోచనమీదా, అనుభవంతోనూ చెప్పినవి. వసుంధర నిన్ను భోజనానికి పిలవమంది. పొద్దున్నే వచ్చింది. విశేషాలన్నీ మాటాడుకోవచ్చు. ఇంటికెళదాం పద!"

"ఒరేయ్ మూర్తీ, నేను ఈరోజే భూషణంగారింటికి మకాం మార్చేశాను. వాళ్ళంతా నాకోసం ఎదురు చూస్తుంటారు. ఆయనతో చెప్పకుండా ఎలా?"

"పోనీ, చెప్పే వెళదాం."

"ఆయన ఏమనుకుంటారో...."

"నే చెబుతాగా పద...."

"వద్దు, నేనే చెప్పి వచ్చేస్తా. నువ్వింటికి వెళ్ళు. ఓ అరగంటలో వస్తా...."

జంక్షన్‌దగ్గర విడిపోయారు మిత్రులు.

ముందు పాపతో చెప్పాడు శ్రీనాథ్, తన మిత్రుడి ఇంటికి వెళ్ళాలని. భూషణంగారు ఇంట్లో లేరు. తల్లితో చెప్పమని చెప్పి ఆమె అవునన్నాక మూర్తి ఇంటికి వెళ్లాడు.

మూర్తి తీరికగా కూచుని వసుంధరతో కబుర్లు చెబుతున్నాడు

శ్రీనాథ్ వెళ్ళేసరికి.

"ఏంరా, భూషణంగారి ఆజ్ఞ అయిందా?"

"ఆ! అయినట్టే! మరేం అనుకోకండి. ఆయన చాలా వింత మనిషి. చెప్పకుండా వచ్చేస్తే బాధపడతారు. అందుకని ..."

"పోన్లెండి. మీవాళ్ళ ఇంటికి వెళ్లాను. అంతా కులాసాగా వున్నారు. బాబీ బాగా చదువుకుంటున్నాడు. తలుపుతట్టగానే వచ్చి మీ అమ్మగారే తీశారు. ఏ నిముషాన్నైనా వస్తారని చూస్తున్నానట. నన్ను చూడగానే ఒకటే ప్రశ్నలు. త్వరలో ఇంటికి వస్తారని చెప్పాను."

"మరి జ్యోతి?"

అడగకూడదనుకున్నా ప్రశ్న వచ్చేసింది. ఆ ప్రశ్న తన పెదవులెలా దాటిందో, మనసు ఎంత కొద్దిసేపులో అదుపు తప్పిందో అని కించపడ్డాడు.

"భోజనానికి లేవరా! తీరికగా కూచుని మాటాడుకోవచ్చుగా!" మూర్తి కుర్చీలోంచి లేచాడు.

"వడ్డించేస్తా" అని వసుంధర లోపలికి వెళ్ళింది.

వర్క్‌షాప్ విషయాలు అడుగుతున్నాడు మూర్తి. యాంత్రికంగా సమాధానాలు చెబుతున్నాడు శ్రీనాథ్. అతని మనసు అతని ప్రశ్నమీదా, తన ఆతృతకి కారణంమీదా ఉంది.

ముభావంగా, తల వంచుకుని భోజనం చేస్తున్న శ్రీనాధ్ మనసులో మెదులుతున్న ఊహను తెలుసుకున్న వసుంధర చెప్పింది: "అన్నయ్యగారు ఏదో అడిగితే అడ్డొచ్చారు మీరు. మీ జ్యోతిగారిని నేను కలవనేలేదు."

"అంటే?"

"నే వెళ్లేసరికి ఇంటిలో లేరు. సాయంకాలం ఏడింటివరకూ కూచున్నా, ఆవిడ రాలేదు. ఆ మరుసటిరోజు సినిమాహాల్లో కనిపించారు. మాటాడుదామనుకున్నాను. పక్కనెవరో ఉన్నారు. మళ్ళీ వెళ్ళడానికి వీలుపడలేదు. ఆమె ఆరోగ్యంగా ఉన్నారు. మీరేం కంగారు పడనక్కర్లా!"

మరి భోజనం సహించలేదు శ్రీనాథ్‌కి.

అంటే జ్యోతి తన స్వభావం మార్చుకోలేదన్నమాట.

మౌనంగా ఉన్నాడు కొంతసేపు. ముఖం జేవురించింది.

"పోనీ అంతా క్షేమంగా వున్నారని చెప్పారు అంతే చాలు. ఇక ఈ దాగుడుమూతలు అనవసరం. నే వెళ్ళి వాళ్ళందరినీ తీసుకొచ్చేస్తా."

అప్పటికప్పుడే ఓ నిశ్చయానికి వచ్చేశాడు శ్రీనాథ్.

భార్య తప్పటడుగు వేసినంత మాత్రాన ఆమె తన భార్య కాకపోలేదు. పరిస్థితులు మనిషిని ఏ స్థితికైనా దిగజార్చివేస్తాయి. తను వివశుడెలా అయ్యాడు? ఆమెకు తన అశక్తితో, అసహ్యం కలిగించాడు. పైగా ఆర్జనలేని వాడిమీద భార్యకు ఎందుకు గౌరవం ఉంటుంది? అతని అసమర్ధతకు ఆమెను నిందించి ప్రయోజనం ఏముంది? తన కుటుంబాన్ని పోషించుకునే ఆర్థిక స్తోమత లేని అసమర్థుడు తను!

ఇంతకు ముందే ఉత్తరం రాసి ఉండవలసింది. కొడుకుగా కన్నతల్లిని వార్ధక్యంలో సాకే బదులు ఆమెకు కష్టాన్ని కలిగించాడు.

తప్పు చెయ్యనివాళ్ళూ, వానకి తడవనివాళ్ళూ ఎలా ఉంటారు? క్షమించడం దైవలక్షణమన్నారు పెద్దలు. భరించేవాడు భర్త. భర్త పుణ్యంలో భార్యకి భాగం ఉంది. కాని భార్య పాపంలో భర్త భాగం ఉంది.

"అలిసిపోయా, వెళ్ళి పడుకుంటా!" దంపతులదగ్గర సెలవు తీసుకుని నేరుగా ఇంటికి వచ్చిన శ్రీనాథ్‌ను ముందు హాల్లోనే భూషణంగారు పలకరించారు.

మాటల్లోనే అన్నాడు "నా కుటుంబాన్ని తెచ్చుకోవాలనుకుంటున్నాను."

ఒక్క క్షణం ఆలోచించారు వినయభూషణంగారు.

"సంతోషం. ఎక్కడికో ఎందుకు ఇక్కడే ఉండనియ్ వాళ్ళనీ. వాళ్ళకి ఏ విధమైనా ఇబ్బంది కలిగినా ఇష్టం లేకపోయినా వేరే ఇల్లు చూసుకోవచ్చు. మరొకమాట. వర్క్‌షాపుమీద వచ్చే రాబడి పూర్తిగా నువ్ తీసుకో. అవి నీకు చాలవంటే టాక్సీల ..."

"మీ అభిమానానికి చాలా ధన్యవాదాలు."

"ఉత్తరోత్తరా ఏమైనా గొడవలు లేకుండా....నాకు ఏదైనా ప్రమాదం జరిగినా గొడవలు రాకుండా వర్క్‌షాప్ నీపేర రాసేస్తాను. ఇది మన ఇద్దరికీ తప్ప మూడో వ్యక్తికి తెలియకూడదు. తెలియవలసిన అవసరమూ లేదు....లాయర్ని పిలిచి రాయించేస్తా....నువ్ వెళ్ళి పడుకో...."

# 13

డిసెంబర్ పదిహేను దగ్గరగా వచ్చింది. కొత్త ఏజంటు శెలవు మంజూరుచేసి వెంటనే కాగితం పంపించేశాడు జ్యోతికి. తన పని ఎడ్జస్ట్ చెయ్యడం విషయంలోనూ కావలసిన నిర్ణయాలు తీసుకోడం జరిగిపోయింది.

తృప్తిగా ఆఫీసునుండి ఇంటికి వెళ్ళింది జ్యోతి.

"నాన్నగారి దగ్గరనుంచి డబ్బు వచ్చింది." కిరణ్ తను ఇంట్లో అడుగుపెట్టగానే చెప్పాడు.

"ఎవరు తెచ్చారు?"

"ఆఁ. అల్లావిడ, ఆరోజు వచ్చారే, ఆవిడ."

"ఎలా ఉంటుంది?"

"చెప్పాగా పిన్నిలాగానే ఉంటుందని."

"నువ్ బెజవాడ వస్తావా?"

"నే రాను, చదువుపోతుంది. మామ్మ నేనూ ఉంటాం."

"పోనీ, నువ్వెళ్ళవే. నేను ఈమధ్య ఎలానూ వెళ్ళి వచ్చానుగా. అబ్బాయి ఇక వస్తాడని నాకు గట్టినమ్మకం ఉంది. ఆవిడతో చెప్పాడట సాధ్యమైనా త్వరలో వచ్చి తీసుకువెళతానని."

జ్యోతి మరి మాటాడకుండా సూట్‌కేస్ సర్దుకుని ఆ సాయంకాలం బస్సుకే వెళ్ళిపోయింది.

ఇంటికి వెళ్ళగానే ముందు జ్యోతిని ఆశ్చర్యపరచిన విషయం కామాక్షి అక్కడే ఉండడం.

కుశలప్రశ్నలవగానే తల్లి నడిగింది జ్యోతి.

"నీ వంట్లో ఇంత అనారోగ్యం ఉందని నాకు రాశావ్ కాదేం?

వెంటనే వచ్చేదాన్నిగా!"

"ఎవ్వేలా వస్తావమ్మా! నీ ఉద్యోగం శెలవు దొరుకుతుంది దొరక్కపోతుంది. అందుకని కామాక్షికి రాశాను. దానిమొగుణ్ణి ఒప్పించి అది వచ్చింది. పదిహేను రోజులైంది అప్పుడే!"

చటుక్కున అడిగింది జ్యోతి "నేనూ కామాక్షీ విజయనగరం నుంచీ వ్రాసిన ఉత్తరం అందలేదూ?"

"ఎక్కడో మిస్ అయిపోయి ఉంటుంది. ఇంతకీ గొడవలో ఎడ్రస్ రాశామో లేదో.... పోన్లే ముఖ్యవిషయాలేం లేవుగా!"

కామాక్షి మాటాడుతుంటే అలాచూస్తూ ఉండిపోయిందిజ్యోతి.

ఆ తరవాత కామాక్షి చెప్పింది.

"బావని గురించి వీళ్ళకు చెప్పిమాత్రం లాభమేం ఉంది. అత్తయ్యా చెప్పలేదట. ఆ మధ్య ఇక్కడికి వచ్చిందటగా. అప్పుడు: పైగా అమ్మకి హార్ట్ డిసీజ్. పెద్ద ఎటాక్ వచ్చింది. ఆమె ఉద్రేక పడకూడదని డాక్టరు సలహా. అందుకే అలా అనేశాను. జ్యోతీ న్నువ్ శెలవుపెట్టావుకదా. అత్తయ్యనీ. కిరణ్‌నీ ఎందుకు తీసుకు రాలేదు?"

"వాళ్ళు రాలేదు. నేనేం చెయ్యను?"

"బావ దగ్గరనుంచి ఏమైనా?"

"ఈమధ్య వాళ్ళమ్మకి రెండుసార్లు డబ్బు పంపారు. ఎక్కడ నుంచో తెలియనివ్వలేదు. ఆమెకు రైల్లో కనిపించి డబ్బిచ్చారని ఆమె కథనం? ఎప్పుడూ ఆమెకే ఎందుకిచ్చి పంపాలి? కాని మళ్ళీ మళ్ళీ వస్తోందంటే. నాకు అనుమానం వేస్తోంది. ఇద్దరూ కలిసి ఒక చోటే సంసారం వెలగబెడుతున్నారేమో!"

"ఛప్! ఏమిటక్కా ఆ మాటలు! బావ అలాంటివాడు కాదు. చాలు నీ తెలివితేటలు. డబ్బు పంపుతున్నాడంటే. ఏదో సంపాదిస్తున్నా డన్నమాట. చాలా సంతోషం అక్కా. బావ తప్పకుండా వస్తాడు. తొందరపడి ఇలాంటి మాటలుమాత్రం అనకు.నీ పుణ్యం ఉంటుంది."

'నే డాక్టరు దగ్గరకువెళ్ళి అమ్మ స్థితిని గురించి అడిగివస్తా' అని జ్యోతి బయలుదేరింది సాయంకాలం.

తను అనుకున్నవేళకు కనకదుర్గ ఆలయం దగ్గరకు వెళ్ళి వెయిట్ చేసింది. ఎంతకీ రాలేదు రాధాకృష్ణమూర్తి. అప్పటికే వెళ్ళి కొబ్బరికాయ కొట్టి దర్శనం చేసుకుంది.

పదిహేడో తారీఖు సాయంకాలం అని స్పష్టంగా రాసింది తను ఎక్కడ కలవాలీ అన్న విషయం గురించి ఉత్తరప్రత్యుత్తరాలు జరిగిన తరవాత.

ఆరున్నరవుతుండగా ఇంటి ముఖంపట్టింది.

"హలో!" తలవంచుకు నడుస్తున్న జ్యోతికి మూర్తి కంఠ స్వరం వినిపించింది.

"నమస్కారం" ముందు శ్రీదేవి చేతులెత్తింది.

"నమస్కారం."

తనలో ఎన్నో ఆశలు రేకెత్తించి భార్యతో అక్కడికి రావడంలో మూర్తి ఉద్దేశ్యం?

"మీరు దర్శనం చేసుకుని వెళుతున్నట్లున్నారు! కాసేపుండండి అందరం కలిసే వెళ్ళిపోదాం. మరోసారి రండి దర్శనం చేసుకుని మిమ్మల్ని ఇంటిదగ్గర డ్రాప్‌చేస్తాం."

"పదండి. ప్రసన్న బాగుందా? కిరణ్ అడుగుతూనే ఉంటాడు. ప్రసన్న పంపిన గ్రీటింగ్స్ అందాయి." శ్రీదేవితో అంది.

"స్నేహబంధం గొప్పది."

ప్రదక్షిణచేస్తూ జ్యోతి కాలుతొక్కాడు మూర్తి. అంటే గ్రీటింగ్ కార్డుల గురించి శ్రీదేవికి తెలియదన్నమాట.

ఏమి మాటాడితే ఏం చిక్కోనని మాటాడకుండా ఊరుకుంది జ్యోతి. ప్రదక్షిణ చెయ్యడం అయిన తరువాత లోపలికెళ్ళారు ముగ్గురూ.

అర్చకుడు గోత్రనామాలడిగి అభిషేకం చేశాడు.

"మా ఆడపడచు" పూజారికి చూపించింది జ్యోతిని శ్రీదేవి.

తల తిరిగినట్టయింది జ్యోతికి. కళ్ళు మూసుకుని చేతులు జోడించింది.

దర్శనం అయిన తరవాత అంతా బయటికి వచ్చేశారు. సంద

జ్యో

లన్నీ దాటాక రోడ్డుమీద ఒకపక్క పార్క్ చేసి ఉంది కారు.

"రండి. ఈ ఊర్లోనే ఉంటున్నారా? ఏ వీధిలో ఉన్నారు? మీ కెప్పుడు ట్రాన్స్‌ఫర్ అయింది? వచ్చే ముందు మిమ్మల్ని కలుసు కోవడానికి వీలుకానేలేదు."

ప్రశ్నలన్నీ ఒకేసారి వేసేసింది శ్రీదేవి.

"నాకు ట్రాన్స్‌ఫర్ కాలేదు. అంతా అధికారుల దయ. మా అమ్మ వంట్లో బాగులేదు. అందుకని శెలవ్ పెట్టి వచ్చాను."

—ఏమీ మాటాడలేని స్థితిలో ఉన్నాడు మూర్తి.

రైలుకట్ట దాటారు.

"ఎడమచేతి పక్క!" అంది జ్యోతి.

మూర్తి ఆపాడు.

"వస్తా, శెలవ్!" జ్యోతి కారు దిగిపోయింది.

"శెలవ్‌మీద ఉన్నానన్నారుగా. ఇంకా ఉంటే మా యింటికి రండి."

"మీరు రండి ఇంతవరకూ వచ్చారుగా."

"మరొకరోజు వస్తా. ఉంటారుగా."

కారు మలుపు తిరిగిపోయాక జ్యోతి మెట్లెక్కింది. కారు చప్పుడు విన్న కామాక్షి అంతా చూసింది.

"ఎవరిదే ఆ కారు?"

"రాధాకృష్ణమూర్తిగారని అక్కడ ఏజంటుగా ఉండేవాడు."

"ఓహో అదా! పనిమీదే వచ్చావన్నమాట!"

మరేం అనలేదు కామాక్షి. మరి మాటాడలేదు జ్యోతి.

"అమ్మా, ఇదిగో కనకదుర్గ ఆలయానికి వెళ్లాను. కుంకుమా, ప్రసాదం! వసుంధర దగ్గరకెళ్ళి తల్లికిచ్చింది. కామాక్షికి ఇవ్వబోతుండగా "ఉండవే చేతులు కడుక్కుని వస్తాను" అని లోపలికి వెళ్ళింది.

సాయంకాలం కనకదుర్గ గుడి కెళతానని జ్యోతి అంటే కామాక్షి అక్కలో పరివర్తన వచ్చినందుకు సంతోషించింది. కాని ఆమెలో ఒక వంక దైవచింతన వస్తుంటే మరొకవంక మూర్తితో ఈ స్నేహమేమిటి?

ఎటూ అంతుపట్టలేదు కామాక్షికి.

ఒకరోజు ఉదయం తల్లికి బట్టలు మార్చుతోంది.

బయట కారు హారన్. "జ్యోతీ, జ్యోతీ!" అంటూ పిలుపు తలుపు తీసిన చప్పుడు.

బట్టలు మార్చడం అయినతరువాత అంది తల్లి "వెళ్ళి చూపిరా! ఎవరో ఏమిటో!" అని.

ద్వారందగ్గర నుంచుంది కామాక్షి. లోపలనుంచి మాటలు స్పష్టంగా వినపడుతున్నాయ్.

"ఛీ. మగాళ్ళంతా ఇంతే!" ఉద్రేకంగా అంటోంది జ్యోతి.

"ఐయామ్ సారీ జ్యోతీ! నేను చాలా జాగ్రత్తగా ప్లాన్ చేశాను. తీరా కారు తీస్తుంటే ఎక్కడికని అడిగింది. చెప్పాను. శుక్రవారంగా నేనూ వస్తానంది. ఇంకేం చెయ్యను....అందుకే ఆలస్యం అయింది కూడా. అరగంటసేపు ముస్తాబైంది. నిన్నా క్షణం తీరికకాలేదు. ఈరోజు పొద్దున్నే స్నేహితుడి ఇంటికి వెళ్తున్నానని చెప్పి వచ్చేశాను."

"అంటే సాయంకాలం మిమ్మల్ని మీ శ్రీదేవి నమ్మదన్న మాట!"

"పోనీ అను. మాటాడవలసిన విషయాలున్నాయ్. ఎక్కడ కలుద్దాం?"

"ఇక్కడ కలిశాంగా....మీ భార్యదగ్గర మీకు భయం.... ఇంతకీ బరితెగించినదాన్ని నేనేగా....నాన్నగారు వీధిలోంచి వస్తే నా తల పగలకొడతారు. మీరు దయచేసి వెళ్ళండి."

"జ్యోతీ!"

"ఇప్పటికైనా కన్ను తెరిచాను. దయచేసి వెళ్ళిపోండి. కట్టుకున్నవాళ్ళ అభిమానానికీ గౌరవానికీ ఎలానూ దూరమైయ్యాను. కనుకున్నవాళ్ళ దృష్టిలో కూడా నన్ను నీచురాలిని చెయ్యకండి!"

మూర్తి ఏదో చెప్పబోయాడు. "నువ్ బ్రతకనేర్చిన వాడివి మూర్తీ. చెడినదానిని నేను....శ్రీదేవిగారిని అడిగాననిచెప్పు! వస్తా."

లోపలికి వెళ్ళిపోయింది.

ఒక్కక్షణం చూసి మూర్తి వెళ్ళిపోయాడు.

ఆ మరునాడే వెళ్ళిపోయింది జ్యోతి.

*    *    *

శెలవు ఉండగానే వచ్చి శెలవు కాన్సిల్ చేసుకుని జాయిన్ అయిపోయిన జ్యోతిని చూసి ఆశ్చర్యపోలేదు శ్యామసుందర్.

మధ్యాహ్నం లంచ్ టైమ్‌లో వచ్చి ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు శ్యామ్.

"అప్పుడే వచ్చేశావేఁ మూర్తిగారు కనిపించలేదాః ఆయన భార్య ఎదురైందాః"

"ప్లీజ్ షటప్."

"ఉన్నమాట అన్నాననా, అంత కోపం!"

"నాతో మాటాడవద్దు."

"అంత మాటెందుకూః మై ఆఫర్ ఈజ్ స్టిల్ ఓపెన్."

"నీతో దెబ్బలాట నా కనవసరంశ్యామ్. నా ఇష్టం నాది. నీ కిష్టం లేకపోతే మాటాడడం మానెయ్."

"ఇష్టం కాబట్టే—నిన్ను చేసుకుంటానని నేను ముందుకొస్తే నీకేమిటి అభ్యంతరం."

"నాకోసం ఒకరు త్యాగం చెయ్యడం ఇష్టంలేక. విశాలదృష్టి శాశ్వతం కాదు కాబట్టి. నీకంటే పెద్దదాన్ని చెబుతున్నా విను. నన్ను మరిచిపో. నువ్ నన్ను ప్రేమిస్తున్నా ననుకోవడం కేవలం భ్రమ. కళ్ళు తెరిచి ఇందులో ఉరుకుతున్నావని నేను అనుకోలేదు. తెగిన గానిపటం నా భవిష్యత్తు. కుక్క చింపిన విస్తరి ఈ బ్రతుకు. నాలాంటిదానికోసం నీ జీవితం పాడుచేసుకోకు. నామీద జాలిపడకు. నన్ను నీ జీవితంలోంచి గెంటిపారెయ్!"

కళ్ళనిండా నీళ్ళతో తల దించుకుంది జ్యోతి.

"జ్యోతీ నీ జీవితాన్ని గురించిన తర్జనభర్జన నాకు అనవసరం. ఆరాధిస్తున్న నన్ను కాదనకు."

"వెర్రివాడివి శ్యామ్. అసలు పెళ్ళి ఆలోచన ఎలా వచ్చింది నీకు....పడుకున్న ప్రతి జంటా పెళ్ళి చేసుకుంటే ప్రపంచం తల్ల

కింద లవుతుంది....జ్వరంతో, ఆవేశంతో మాటాడుతున్నావ్. నీకు పాతికేళ్ళు నిండలేదు. నేను పతితురాలిని....భ్రమరానివనుకున్నాను. ఇంతవరకూ చేసినవి చాలు."

"నేను పెళ్ళి చేసుకుంటే అది నిన్నే."

"నేను లేకపోతే...."

"ఎక్కడికి వెళ్ళిపోతావ్ నువ్?"

"నే చచ్చిపోతే?"

"నేనెలా మిగులుతానూ?"

"అంతమాటనకు. పరిస్థితులు ప్రమాదవశాత్తు కలిసిన మనుషులం. అలాగే విడిపోదాం. నువ్ ఇప్పుడు పడుతున్నానని అనుకుంటున్న బాధ పది రోజుల తరవాత ఉండదు."

"అంటే నువ్ మూర్తిని మరిచిపోవన్నమాట!"

"అనుభవం లేనివాడివి శ్యామ్. మూర్తికి నేనెక్కడ జ్ఞాపకం! నిమిసం నా గురించి ఆలోచించడు. పెళ్ళి అయినవాడు. అతని బాధ్యతలు అతనికి ఉన్నయ్. పార్కులో పుష్పాన్ని నేను. వాసన చూసిపోయాడు. నిన్ను హింసించుకుంటూ నన్నెందుకు హింసిస్తావ్? చేజేతులా జీవితాన్ని నాశనం చేసుకున్నాను. ఇప్పుడు నువ్ నన్ను ప్రేమిస్తున్నానని అనుకుంటున్నట్టే నేనూ మూర్తిని ప్రేమించాననుకున్నాను, అతను నన్ను ప్రేమించాడనుకున్నాను. పెళ్ళికీ ప్రేమకీ సంబంధం లేదనుకున్నాను. పెళ్ళి విలువ ఏమిటో శ్రీదేవి, ఆవిడే మూర్తిగారి భార్య, నాకు బాగా తెలియచెప్పింది. నా కళ్ళుతెరిపించింది.

పచ్చగా పందిట్లో పెళ్ళి పదిమందిలో తాళి కట్టించుకున్న భార్యకి భర్తమీద హక్కు గొప్పదా, పదిరోజులు దొంగతనంగా కళ్ళు మూసుకు తిరిగిన బాంధవ్యం గొప్పదా?

నీతి విషయం అటుంచు. పరపురుషుడితో సహవాసం అవినీతి కాదని నాకు నేను సమర్థించుకున్నాను. లైంగికమైన తృప్తే సర్వస్వమనుకున్నాను. మనసుకు తోచింది మంచిదనుకున్నాను. దాని విలువలు కేవలం శారీరకమైనవి కావు. ఇతరమైన విలువలు కూడా ఉన్నయ్. మూర్తి భార్య దగ్గర పిల్ల. అతని సంసారం. అతని బాంధవ్యం

శాశ్వతమైనవి కాబట్టి. నేను కట్టుకున్నదాన్ని కాను కాబట్టి. మూడు రోజుల వేడీ తగ్గిపోయిన తరవాత అతన్ని వివాహబంధం పూర్తిగా కష్టపెడుతుంది. నీకూ నేను నీచురాలిగానే కనిపిస్తాను. అప్పుడు నువ్ లోనయ్యే మానసిక వ్యధను నేను తీర్చలేను. నిన్ను చూస్తూ నేను, నన్ను చూస్తూ నువ్వూ ఇద్దరం గడిచిపోయిన కాలాన్ని వెనక్కి తీసుకురాలేక, గతం పరిణామం ప్రస్తుతం మీదపడకుండా చెయ్యలేక సతమతమవ్వాలి—

కొన్ని రోజులు నాతో మాటాడకు. రెండు వారాల తరవాత నీ నిర్ణయాన్ని మార్చుకోకపోతే నిన్ను పెళ్ళి చేసుకుంటా. శలవ్!"

కుర్చీలోంచి లేచి బాత్‌రూమ్‌లోకి వెళ్ళిపోయింది జ్యోతి. శ్యామ్ ఆలోచిస్తూ వెళ్ళిపోయాడు క్యాంటీన్‌వైపు.

## 14

ఎప్పుడూ టెలిఫోన్‌లో భూషణంగారిని పిలవడం అలవాటు లేని శ్రీనాధ్ ఒక రోజు మధ్యాహ్నం భూషణంగారికి ఫోన్ చేశాడు.

"భూషణం స్పీకింగ్."

"నేనండీ, శ్రీనాధ్‌ని. ఈమధ్య మీతో చెప్పానుగా. వైజాగ్ వెళ్ళి కుటుంబాన్ని తీసుకొచ్చేస్తా."

"ఎప్పుడు వెళుతున్నావ్?"

"వైజాగ్‌బండి ఒకటి రిపైర్ చేశాం. డ్రైవర్ తిన్నగా వైజాగ్ వెళ్ళిపోతాడట. నేనూ వెళ్ళి రేపు సాయంకాలానికల్లా వచ్చేస్తా."

సరే నన్నారు ఆయన.

మరో అరగంటలో బయలుదేరిపోయాడు శ్రీనాధ్.

ఇంతకాలానికి ఇంటికెళుతున్నానన్న ఆలోచన అతనికి దారి పొడుగూ ఆలోచనల్లో పడేసింది.

తీరా ఇంటికెళితే షాక్. శ్రీనాధ్ తల్లీ, జ్యోతీ అక్కడ లేరు. ఆ వూళ్ళోనే లేరు.

"అవును సార్! ఇల్లు ఖాళీచేసేశారు. ఓ వారం పదిరోజుల క్రిందట. ఎక్కడికి వెళ్ళారో నాకు తెలియదు." చెప్పాడు ఎదురిం

టాయన.

రైలుస్టేషన్‌కి బయలుదేరాడు శ్రీనాథ్.

తెలతెలవారుతుండగా ఎక్స్‌ప్రెస్ బెజవాడ చేరింది.

శ్రీనాథ్ అత్తగారు మంచంమీదనుంచే పలకరించింది: "ఏం బాబూ! బాగున్నావా? అటు అమ్మాయితోనూ రాలేదు. మా వదినగారితోనూ రాలేదు."

"నేను పార్వతీపురంనించి వస్తున్నా!"

"హైదరాబాదునుంచి పార్వతీపురం ఎప్పుడు వెళ్ళావ్? ఎందుకు వెళ్ళావ్?"

వివరాలన్నీ పూసగుచ్చాడు.

హైదరాబాద్‌లో విద్యానగర్ బ్రాంచిలో జ్యోతికి ప్రమోషన్ మీద ట్రాన్స్‌ఫర్ వచ్చిందని తెలుసుకుని, శంకరమఠం కుడిచేతి పక్కవీధిలో మూడో ఇల్లని తెలుసుకుని కబురు కూడా తీసుకుని వెంటనే పార్వతీపురం బయలుదేరిపోయాడు శ్రీనాథ్ అత్తగారూ, మామ్మగారూ ఉండమంటున్నా అక్కడ పని వుందని చెప్పి.

జ్యోతిని ఈ విషయంలో నిందించి ప్రయోజనంలేదు. తన ఉనికి తెలియపరచనందుకు తనకు తగిన శాస్తి జరిగిందనుకున్నాడు శ్రీనాథ్. రైల్లో కూచుని ఒకటే ఆలోచన. జ్యోతి ఎలా మారి ఉంటుంది? కిరణ్ ఎలా ఉంటాడు? తనని పోల్చుకుంటాడా?

* * *

కొత్త ఊరు, కొత్త మనుషులు. జ్యోతికి మొదట కొన్ని రోజులు కంగారనిపించింది.

దగ్గరలో ఇల్లు దొరకడంవల్ల మహాపట్టణమైనా మెల్లగా అలవాటు అయిపోయింది. ఇంటికి ఫర్లాంగు దూరంలో ఆఫీసు.

వచ్చి చేరిన పదవ రోజే ఉత్తరం బెజవాడనుంచి.

శ్రీనాథ్ వచ్చిన విషయం, తన అడ్రస్ తీసుకొన్న విషయం కూడా రాస్తూ "ఇలాంటి విషయాలు మానుంచి ఎందుకు దాచావ్?" అని కూడా రాశారు. అంటే ఆయన అంతా చెప్పేశారన్న మాట!

తనముఖం తనే చూసుకోడానికి అసహ్యం వేస్తోంది జ్యోతికి.

ఈ పరిస్థితుల్లో భర్త తిరిగి వస్తున్నాడంటే ఎందుకో భయం పుట్టింది.

ఒకవంక తన నడవడిని తను ఎలానూ సమర్థించుకోలేక పాపం చేశాననే పశ్చాత్తాపంలో కొట్టుమిట్టాడుతుంటే, ఇప్పుడు భర్త వస్తే తనముఖం ఎలా చూపించడం అనే ఆవేదన మొదలైంది.

శ్రీనాధ్ వచ్చి తనమీద కక్ష తీర్చుకుంటే? తనను నిలువునా దహించివేసే మాటలంటే? అప్పుడు అతని ముఖం ఎలా ఉంటుంది?

అసలు అతని ముఖం తనకి జ్ఞాపకం ఉందా?

తన రహస్యం తెలిసిపోయిన మొదటిరోజే కొడతాడనుకుంది. కాని శ్రీనాథ్ అజాతశత్రువు. కోపం అంటే అతనికి తెలియదేమో!

మరి ఎలా పలకరిస్తాడు?

అసలు పలకరించకుండా తప్పుకు తిరుగుతాడా? తన తల్లినీ, కొడుకునీ తీసుకుని వెళ్ళిపోతానంటాడా? అలా జరిగితే కిరణ్ వెళ్లి పోయిన తరవాత తన జీవితానికి సార్థక్యం ఏమిటి? పోనీ శ్యామ్‌కి ఉత్తరం రాస్తే?

మళ్ళీ ఆ రకం జీవితంలోకి వెళ్ళాలి. మంచినీళ్ళు తాగకుండా కోకో కోలా, నూలుచీర కట్టకుండా పట్టుచీర. సంసారబాధ్యతలు లేకుండా, రసికుడైన ప్రియుడితో కేరింతలు. ఇవి ఎన్నాళ్ళు సాధ్యం?

కనీసం మూర్తికి తనవల్ల నష్టం జరగలేదు. మరి శ్యామ్‌కి? శ్యామ్ చిన్నవాడు. అతని జీవితాన్ని మురికికూపంలోకి దిగతొయ్యడం భావ్యంకాదు. తన జీవితం ఒకవిధంగా నాశనమైంది. మరొక జీవితాన్ని నాశనంచేసే హక్కు తనకులేదు. విలాసంగా శృంగార మందిరంలోకి పిలిచింది అతన్ని తనే. పూలు ఎండిపోయి ముళ్ళు మిగిలిపోయే స్థితి వచ్చింది.

బ్రతికినన్నాళ్ళూ సుఖంగా బ్రతికితే పోలా? ఎందుకీ తర్జన భర్జనలు?

మళ్ళీ శ్యామ్‌వైపు పోయింది మనస్సు.

ఆఫీసునుంచి వస్తోంది. రైలు బ్రిడ్జిదగ్గర పాకలు. పాకముందు ఒక కుష్టురోగి. కాలికీ చేతికీ వేళ్ళు లేకపోయినా పాటపాడుతున్నాడు. మరొకరోగి, అతని భార్య కావచ్చు పొయ్యిలో కర్రలు ఊదుతోంది.

ఇదీ జీవితం. తన మనసులోని శృంగారం బయట కనపడిన నిజం ఇది!

విలాపం, శృంగారం, ఆనందం, ఇవన్నీ చిరకాలం ఉండే వ్యవస్థలోంచి క్షణంలో వైరాగ్యానికి తీసుకెళ్ళగలిగిన మార్గంలోకి తనెందుకు మళ్ళింది?

తనకు ఇంత హఠాత్తుగా పాప చింత ఎందుకు వచ్చింది?

మనసు క్షణం స్థిరంగా ఉండలేదేమిటే, చిత్రం!

మూర్తి తన భార్యతో హాయిగా ఏం జరగనట్టు సంసారం చేసుకుంటున్నాడు. చెడింది తను. చెరిపింది తన భర్త మనస్సుని.

తను శిక్ష అనుభవిస్తే, అది విధించిన భగవంతుడు మూర్తి కెందుకు శిక్ష వెయ్యడూ!

ఇదంతా బాష్. దేవుడూ లేడు శిక్షలేదు.

అంటే వేలాది సంవత్సరాలుగా కోట్లాదిప్రజలు నమ్ముతున్నది. అంత సులువుగా నాలుగు ఇంగ్లీషు అక్షరాలలో 'బాష్' అనేస్తే చెరిగిపోతుందా? రెండు చేతులూ కలిస్తేనే చప్పట్లు. స్త్రీ పురుషులు కలిస్తేకాని అవినీతిపని చేయలేరు లైంగికంగా. మరి ఒకరికి శిక్షేమిటీ? మరొకరికి సుఖమేమిటీ?

స్త్రీ శక్తిస్వరూపిణి. ఆమె పవిత్రతను కాపాడుకుంటే పురుషుడు పతితుడుకాడు. పవిత్రతను కాపాడవలసిన బాధ్యత స్త్రీదే. శ్రీదేవి భర్తను పునీతుణ్ణి చెయ్యగలిగే క్షమాగుణం కలిగింది. అందుకే ఆమె గెలిచింది. తను ఓడిపోయింది. పాతివ్రత్యం హైందవ స్త్రీ ధర్మం. మరి ఏకపత్నీవ్రతం హైందవ పురుషుడి ధర్మంకాదూ? కాదేమో. కానక్కరలేదూ?

మరి తప్పుచేశానన్న భావం తనకెందుకు వస్తోంది.

అదే తన రక్తం. అదే ఎముకల్లో జీర్ణించిన సంస్కారం. అదే బట్ట విప్పేసినట్టు విప్పి విసిరేయలేనిది సంస్కృతి.

సంస్కృతి.... సంస్కృతి.... అదే కారణం. క్షణికోద్రేకాలకే, మానసిక దౌర్బల్యానికీ, శారీరక రుగ్మతలకీ వ్యక్తిలోని విచిత్ర వక్రత్వాలకీ, అతీతమైన సంస్కారలక్షణం.

శ్యామ్ తనను పెళ్ళి చేసుకుంటానన్నాడు.

ముందు పెళ్ళాడిన భర్తను తనేం సుఖపెట్టిందనీ. యవ్వనం మరుగు, పొందు, వేడి, తాపం, కామం, ఇవీ అతని పెళ్ళి మాటల వెనక నిజాలు. సంస్కృతీ, సభ్యతా, సమాజమూ కట్టుబాట్లూ ఇవి ముసలమ్మ కబుర్లని చెప్పే మూర్ఖత్వం. తనలాంటివాళ్ళు ఉంటున్న కొద్దీ సంస్కృతిమీద మనుషులకుండే విలువ పెరుగుతుందేకాని తరిగిపోదు.

తనమీద తనకు నమ్మకం పోతోంది.

కళ్ళలో నీళ్ళులేవు. గుండె రోదిస్తోంది. అందరికీ తెలియనంత మాత్రాన, తను కొత్తచోటికి వచ్చినంతమాత్రాన బ్రతుకు నలుగురికో నగుబాట్లు కాకపోవచ్చు. కాని, గుండె బద్దలయిన తరవాత రక్తం బయటికి రాలేదు. రాదూ అనే తృప్తివల్ల ప్రయోజనం?

శ్రీనాధ్‌ను చూడాలనే కోరిక ఉప్పెనలా వచ్చింది. దీనివెనక జస్ట్ క్యూరియాసిటీ!

"ఈరోజు ఉత్తరం వస్తుందేమో! నాకు తెలుసు తప్పకుండా వస్తుంది!" హైమవతమ్మ అంది మరుసటిరోజు ఉదయాన్నే.

"నాకు కుడి కన్ను అదురుతోంది. నాన్నగారి దగ్గరనుంచి కబురొస్తుంది." కిరణ్‌కూడా అన్నాడు.

వాళ్ళకున్న నమ్మకం తనకు లేదేం?

తనకోరిక ఎలాంటిది? బలిపశువు కసాయివైపు ఎలా చూస్తాడో శ్రీనాథ్ చూపులో చూడాలనా?

తను మనిషి స్థానాన్ని పోగొట్టుకుని ఇటు జంతువూ కాలేక మధ్య శూన్యంలో ఊగిసలాడుతోంది.

పోనీ పూర్తిగా జంతువై పోతే?

జంతువుకి ఆలోచించే శక్తి ఉండదు.

అదెలా?

దానికి మాటాడే శక్తి ఉండదని చెప్పగలం కాని, ఆలోచించే శక్తిలేదని ఎలా చెప్పగలం? ఆలోచించే శక్తి అంటే విచక్షణా జ్ఞాన కాదూ! పోనీ తను యంత్రం అయిపోతే....

ఆలోచనలుపదునైన బాకుల్లా మనసును తూట్లుపొడుస్తున్నాయి. అయోమయపు స్థితిలో అయోమయంగానే ఆలోచిస్తూ కూర్చుండి పోయింది జ్యోతి.

## 15

గదిలోకివెళ్ళిన శ్రీనాథ్ చటుక్కున వెనక్కి తిరిగి వచ్చాడు. ఆమె ముఖం మొదటిసారిగా చూశాడు. ముక్కుకి బదులు రెండు కన్నాలు మాత్రం ఉన్నాయ్.

ఆమెకు బత్తాయి తొనలు అందిస్తున్నాడు వినయభూషణం గారు. భార్యమీద ఆయనకెంత అనురాగం!

వివాహం పవిత్రబంధం. మనుషుల్లోని మాలిన్యాన్ని క్షాళన చేసి పునీతులను చేయగలిగిన రాగవల్లరి. చైతన్యస్రవంతి. ఆనందపు వెల్లువ.

చిన్నప్పటినుండి చూస్తున్నాడు జ్యోతిని. మనిషిలో చురుకు ఎక్కువ. నలుగురిలో కలివిడిగా తిరిగే స్వభావం.

ఆమె చిన్నచూపు చూసింది తనను. కాని తన ఇంగిత మేమైంది?

వెంటనే ఆమెను సరిదిద్దవలసింది. ఆమె తప్పుచేస్తే తను బుద్ధి చెప్పవచ్చుగా!

ఇకనైనా మునిగిందిలేదు. వెళ్ళి ఆమె కిష్టమైతే ఇద్దరూ కలిసే జీవించవచ్చు. భూషణంగారు తన మాట కాదనరు. వీలయితే అక్కడే ఉద్యోగం వేయించగలరు. ఛ! ఇంకా. తను ప్రయోజకుడయి కూడా జ్యోతిచేత ఉద్యోగం చేయించడమా?

ఉత్తరం రాయాలని కాగితం తీసుకున్నాడు.

తీరా కలం కాగితం తీసేసరికి సంబోధించడమెలా అనిపించింది.

'శ్రీమతికి' బాగులేదు—'డియర్ జ్యోతీ' 'డియర్' అంటే బ్బెట్టుగా అనిపించింది.

కాగితం చింపి పారేశాడు.

"ఎందుకో వచ్చి వెనక్కి తిరిగ వచ్చావేం?" భూషణంగారే



జ్యోతి

మేడమీదకి వచ్చారు.

"ఏంలేదు. అమ్మగారు అక్కడ ఉన్నారనుకోలేదు."

"ఓమారు కూచుంటానంది. గంటల తరబడి అక్కడ కూచోడం మాకు అలవాటు ...ఎత్తుకుని తీసుకువచ్చి కూచోబెట్టాను. ఆమె చాలా నీరసించిపోయింది....ఇక ఎన్నాళ్ళో బ్రతకదు.... షేమా...."

"ఉద్రేకంలో అన్న మాటలకు లెక్కేమిటి? పిల్లలు అల్లరి పెడుతుంటే 'చంపేస్తాం' అంటాం. నిజంగా చంపేస్తున్నామా?" బరువుగా నిట్టూర్చాడాయన.

"మా అబ్బాయి ఉత్తరం రాశాడు....నన్ను చూడాలని ఉందని...."

"వెళ్ళావ్‌గా... "

"నే వెళ్ళేసరికి వాళ్ళు హైదరాబాద్ వెళ్ళిపోయారు. వెళ్ళి తీసుకురావాలంటే కనీసం నాలుగురోజులు పడుతుంది."

"శ్రీనాధ్, నీ కుటుంబాన్ని నువ్ తెచ్చుకుంటానంటే వద్దనడం అన్యాయం. వెళ్ళి తీసుకురా. రేపే బయలుదేరు."

ఆ మర్నాడే బయలుదేరాడు.

రైలు ఎంత వేగం చేరుతుందా అని ఆత్రంగా ఉంది.

తల్లికి కొన్న జరీచీరా, కిరణ్‌కి కొన్న బట్టలూ, జ్యోతికోసం చేయించిన రెండు తులాల గొలుసూ....ఇవ్వాలి.

భూషణంగారి ద్వారానే చేయించాడు గొలుసు. తనకేం ఖర్చుంది? తనతో చెప్పకుండానే మొదటినెల అవగానే తన ఎకౌంట్‌లోకి ఎనిమిది వందలు క్రెడిట్ చేయించుకున్నా రాయన.

నిద్ర రావడంలేదు. ఎంతోసేపయి రైల్లోనే కూర్చున్నట్టుంది.

చేతిలో బ్యాగుతో సికందరాబాదులో దిగాడు శ్రీనాధ్. గంట లేటు బండి. ఎనిమిది అయిపోయింది. మూడో నంబర్ బస్సు ఆగే చోట మరో అరగంట నుంచుని మరో అరగంట తరవాత శంకర మఠం ముందే దిగాడు.

అటూ ఇటూ చూసి పక్క సందులోకి వెళ్ళాడు. మూడో

ఇంటికి జ్యోతి నేమ్‌ప్లేట్ ఉంది.

మెల్లగా తలుపు తట్టాడు.

"ఎవరూ?" జ్యోతే తలుపు తెరిచింది.

తనను చూసి చటుక్కున ఇంట్లోకి వెళ్ళిపోయింది.

"ఎవరూ?" హైమవతమ్మ సావిట్లోకి వచ్చింది.

"నాన్నా!...." మజ్జిగ కలుపుకుంటూ బయటకి వచ్చాడు కిరణ్.

"బాబీ!" కౌగలించుకున్నాడు తండ్రి.

"ఇన్నాళ్ళూ ఎక్కడికి వెళ్లారు?"

"ఉద్యోగం చెయ్యడానికి....నీకు మంచి మంచి బట్టలు కొనడానికి."

"బావుండిరా, ఏం ప్రశ్న వేశావ్....రా నాయనా, స్నానం చేస్తే వడ్డించేస్తా! ఎప్పుడు బయలుదేరావ్?"

"నిన్న పొద్దున్న...."

"ఓరోజు ప్రయాణమన్నమాట...."

"నే మెల్లగా స్నానంచేసి వస్తా. ముందు జ్యోతి పని చూడు - ఆఫీసుకి టైమ్ అయిపోతోంది."

"ఆఫీసు దగ్గరేనా?"

"దగ్గరే."

ఈలోగా జ్యోతి బాత్‌రూమ్‌లో స్టవ్‌మీద వేడి నీళ్ళు పడేసింది.

కాళ్ళు కడుక్కుని పడక కుర్చీలో కూచున్నాడు శ్రీనాథ్.

కాఫీకప్పు తెచ్చింది జ్యోతి.

పెళ్ళయిన కొత్తరోజులు జ్ఞాపకం వచ్చాయి. తల్లి ప్రత్యే-కంగా కాఫీ జ్యోతిచేత పంపించేది గదిలోకి.

కాఫీ కప్పు అందుకుంటూ ఆమె కళ్ళలోకి చూశాడు.

తల వంచుకుని లోపలికి వెళ్ళిపోయింది.

కిరణ్ భోజనం చేసి బయటకు వచ్చాడు.

"బాగా చదువుకుంటున్నావా! నీ స్కూలు దూరమా?"

"అబ్బో! చాలా దూరం. స్కూల్ బస్ వస్తుంది. శంకర మఠందగ్గరే ఆగుతుంది."

"ఎన్ని గంటలకి స్కూలు?"

"పదకొండుకి పెట్టారు....నే వెళుతున్నా! సాయంకాలం మెడికల్ ఎగ్జిబిషన్‌కు వెళదాం. ఎక్కడికి వెళ్ళిపోకండి!"

"అలాగే! నీకోసం బట్టలు తెచ్చా. సాయంకాలం చూద్దువు గానిలే!"

బూట్లు తొడుక్కొని వెళ్ళిపోయాడు కిరణ్.

తను స్నానంచేసి వచ్చేసరికి జ్యోతి ఆఫీసుకు వెళ్ళిపోయింది.

"అమ్మా, నేను నీతోనైనా చెప్పకుండా వెళ్ళిపోయాను. ఉత్తరం అందిందా?"

"అందింది. ఎంత బెంగపెట్టుకున్నానో! దేవుడిలీల! చల్లగా ఉన్నావ్ అంతేచాలు."

వినయభూషణం గారికి తను మూర్తిద్వారా ఎలా సన్నిహితుడైనదీ ఆయన తన మీద ఎంత అభిమానం చూపిస్తున్నదీ వివరంగా చెప్పాడు తల్లికి. హైమవతమ్మ సంతోషించింది.

ఆ సాయంకాలమే చిక్కడపల్లిలోని వేంకటేశ్వరస్వామి గుడికి అభిషేకం చేయించడానికి బయలుదేరింది హైమవతమ్మ.

కిరణ్ బడినుంచి ఇంకా రాలేదు. ఒంటిగా కూచున్నాడు శ్రీనాథ్, జ్యోతి ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తూ.

ముందు కిరణ్ వచ్చాడు.

వస్తూనే తనకి వచ్చిన ప్రైయిజులు చూపించాడు. తనకు తెచ్చిన బట్టలు చూసి మురిసిపోయాడు.

జ్యోతి వచ్చింది.

"అమ్మ చాలా చిక్కిపోయింది కదురా బాబీ!"

"నేను టానిక్కు తాగుతున్నా. అమ్మని తాగమంటే తాగదు. మామ్మకి జ్వరంవస్తే డాక్టరు టానిక్కు రాసి ఇచ్చాడు. రెండు రోజులు తాగి మానేసింది. నేనే తాగుతున్నా నాకు మాత్రం అమ్మ నెల నెలా టానిక్కు సీసా కొంటోంది."

"మామ్మకి జ్వరం వచ్చిందా?"

"చాలారోజులైంది."

"జ్యోతీ, అమ్మ కోవిలకు వెళ్ళింది. టిఫిన్ తయారుచేసి పెట్టింది. నేను తిన్నాను. మీరిద్దరూ తినండి."

కిరణ్, శ్రీనాథ్ మాటాడుకుంటూ ఉండగా హైమవతమ్మ వచ్చింది. పడక గదివరకూ జ్యోతి శ్రీనాథ్‌తో మాటాడలేదు.

రాత్రవుతున్నకొద్దీ జ్యోతి మనసులో ఆరాటం ఎక్కువైంది. పడకగది ఏకాంతంలో ఏం చేస్తాడు? ఏమంటాడు?

"రండి వడ్డిస్తా!" హైమవతమ్మ పిలుపులో భార్యా భర్తలిద్దరూ ప్రస్తుతం లోనికివచ్చారు.

"ఎలా తింటున్నావో, ఎలా వుంటున్నావో, ఎప్పుడూ కష్టం ఎరగని వాడివి!" హైమవతమ్మ వడ్డిస్తోంది.

"నేనేం కష్టపడడంలేదు. వంటమనిషి వేళకి వడ్డించేస్తుంది. కనీసం కూరలైన తీసుకురానక్కరలేదు. దానికొక బంట్రోతున్నాడు. ఆ సుబ్బలక్ష్మిగారు మనిషికాదు. దేవత. కష్టం సుఖం తెలిసిన మనిషి. లక్ష్మిదేవి లాంటిది. ఆమెకు తగిన భర్త వినయభూషణంగారు. పాప నన్ను క్షణం వదలదు ఇంట్లో ఉన్నంతసేపూ. మావయ్యా అది చెప్పు ఇది చెప్పు అని అడుగుతుంది. నాకు చదువురాదంటే వినదు. ఇంగ్లీషు మీడియం స్కూల్లో చదువుతోంది. గాజుబొమ్మలా ఉంటుంది."

మాటాడుతూ ఆగిపోయాడు. శ్రీనాథ్. విచిత్రం. అక్కడ ఉన్నంతసేపూ ఇంటిమీద ఆలోచన. ఇక్కడివస్తే పాపమీదకీ, భూషణంగారిమీదకీ ఆలోచనపోతోంది.

"వెళ్ళి పడుకోండి. అలిసిపోయిఉన్నారు" హైమవతమ్మ అంది.

భోజనం చేసి శ్రీనాథ్ గదిలోకివచ్చి పడకకుర్చీలో కూచున్నాడు. మరో అరగంటకి కొంచెం పనులు సాయంచేసి జ్యోతి వచ్చింది మరచెంబుతో నీళ్ళు పట్టుకుని.

"జ్యోతీ చాలా మూర్ఖంగా ప్రవర్తించానని అనుకుంటున్నా

ేమో! నన్ను క్షమించు నీ మనసుకి కష్టం కలిగించాను."

"...............…"

"ప్రయోజకుడి సౌదామని ధైర్యం చేసి ఎవరికీ చెప్పకుండా ెళ్లాను. రిక్షా లాగినా వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకున్నాను. నా కాళ్ళమీద ేను నిలబడగలిగాను. అమ్మ గొలుసు అమ్మేశాను. ఇంకొకసారి ి చూసుకుని అమ్మకి గొలుసు చేయించేస్తా. ఇదిగో నీ గొలుసు. ిరలు కొనడం నాకు తెలియదని పాపను తీసుకెళ్ళా. ఇది నీకు నచ్చు ందని తీసింది. నా చేతులతో నీకు చీరకొని ఎన్నాళ్ళయిందో."

"............"

"మౌనంగా ఉన్నావ్, నా మీద కోపం వచ్చిందా? మగవాడిగా ుటుంబాన్ని పోషించవలసిన బాధ్యతనాది. ఇన్నాళ్లూ నిన్ను కష్ట ెట్టాను. జరిగేదేదో జరగనే జరిగింది. ఇకనైనా సుఖంగా ్రతుకుదాం."

జ్యోతికి తల వేడెక్కిపోతోంది.

'జరిగినదేదో జరిగిపోయింది.' తన ఘాతుకమైన ప్రవర్తన ి ఇలా అంటుంటే ఏమనుకోవాలి?

పోయిన పవిత్రత మరి తిరిగిరాదని ఎన్నాళ్ళకు తెలిసింది. ాకులు పుచ్చుకున్న భార్య కన్య అయిపోగలదా? నడిబజారునపడ్డ ను పతివ్రత కాగలదా? 'ఇకనైనా సుఖంగా బ్రతుకుదాం!' ఎలా? ను పతితనని ఎలా చెప్పడం? ఏమి జరగనట్టు మళ్ళీ భార్యగా తను ించగలదా? నటనకాక నిజంగానే ఉండగలదా? అసాధ్యం. మలిన ిపోయింది. తను ఇక పవిత్రమెలా అవుతుంది? నలిగిపోయిన వ్వు మళ్ళీ వికసించగలదా? శ్రీనాధ్ తనను శిక్షించాలి. అతని ిలో తను చనిపోవాలి. అదే తగిన ముగింపు. పశ్చాత్తాపం పాపాన్ని గగలదు. కాని తన అహంకారానికి నిష్కృతిలేదు.

"ఏంటో ఆలోచిస్తున్నావ్! నువ్వనుకున్నట్టు నే స్వార్థపరుణ్ణి ు. నీకు ఇష్టంలేకుండా" చిన్నదీపం వెలిగింది. లైటు ఆర్పేసి తన ంచం మీదకు వెళ్ళి పడుకున్నాడు.

జ్యోతి కన్నీళ్ళమీద పడుతున్న దీపం ఆరిపోయింది.

విస్త్రాణతో పక్క మంచంమీద వాలి తలగడలో తలదూర్చింది. తలగడ ఆమె దుఃఖాన్ని అపలేకపోయింది. వెక్కివెక్కి ఏడుస్తోంది.

"ఎందుకు బాధపడతావ్ జ్యోతీ! జరిగినదంతా ఓ పీడకల. పొరపాట్లు అందరూ చేస్తారు. గతంకోసం కుంగిపోయి ప్రస్తుతాన్ని విస్మరించడం, దుఃఖమయం చేసుకోడం అవివేకం. పట్టుదలతో ఏదైనా సాధించవచ్చు. రిక్షావాడిగా ఆరునెలలు గడిపాను. జీవి అంటే ఏమిటో తెలుసుకున్నాను. మనుషుల మమతలకీ వా సాంఘిక స్థాయికీ సంబంధంలేదు జ్యోతీ! పెంటయ్యకు భార్య మీ వున్న అనురాగానికీ, వినయభూషణంగారికి భార్యమీద ఉన్న మమత విలువ ఒకటే. కాని డబ్బుతో కొనుక్కోలేనిది ఒకటి మనిషిమనసు నిన్ను నేను సరిగా చూడలేకపోయాను. భర్తగా నా విధిని నేన నిర్వర్తించలేకపోయాను. ఇకనైనా మనం కలిపి కిరణ్‌ను బాగ చేసుకోగలిగితే కన్నందుకు మన కర్తవ్యాన్ని నిర్వర్తించినట్టే."

జ్యోతి ఏం మాట్లాడలేకపోతోంది. చెలరేగే ఆలోచనలన ఆపనూలేకపోయింది.

శ్రీనాధ్‌కి నిద్రపట్టింది. జ్యోతిలో పొంగుకొస్తున్న దుః అలలు శాంతిస్తున్నా, లోపలి నిశ్చయం మాత్రం క్షణక్షణానికి శిలా సదృశమౌతోంది.

ఒక నిశ్చయానికి రాగానే ఇట్టే నిద్రపట్టేసింది.

తెల్లవారు ఝామున లేచాడు శ్రీనాధ్. చిన్న దీపంవెలుతురులో భార్య ముఖం చూశాడు. మత్తుగా నిద్రపోతోంది. మీదకు వ ఆమె బుగ్గలు నిమిరాడు.

"సార్!" బయట తలుపుచప్పుడు.

వెళ్ళి తలుపు తీశాడు.

"ఇంటినంబర్ ఇవ్వకుండా ఎక్స్‌ప్రెస్ టెలిగ్రామ్స్ ఇస్తారు ఇల్లు వెదుక్కోలేక ఇబ్బందిపడాలి. ట్రిపుల్ఎక్స్, జేరకపోతే గొడవ ఇరవై ఆరుసార్ సంతకం."

అతను అందించిన పెన్సిల్ ముక్కతో సంతకం గిలి టెలిగ్రాం కవరు చింపాడు ఆతృతగా శ్రీనాధ్.



జ్యో

'సుబ్బలక్ష్మి చనిపోయింది. భూషణం పరిస్థితి ఆందోళన
కరంగా ఉంది. పాప నీ ఎడ్రస్ ఇచ్చింది. లాయరు సుదర్శనం నీకు
టెలిగ్రాం ఇమ్మన్నారు. విమానంలో విశాఖవస్తే కారు పంపిస్తాను.
పాపకోసంరా క్షణాలు కూడా ముఖ్యమే ...డాక్టర్.'

పాపం! సుబ్బలక్ష్మి మహా భయంకరమైన రోగాలతో బాధ
నా మనసులోని మార్దవాన్ని ఎండిపోకుండా ఉంచుకోగలిగిన
మగువ. వెన్నలాంటి మనసు. ఏ జన్మలో చేసిన పాపమో! ఆమె ఈ
జన్మలో చేసినదయి ఉండదు. భర్తమీద మమతే ఆమె ఇన్నాళ్ళు
బ్రతకగలగడంలోని రహస్యం. పాపం! భూషణంగారు ఎలా
ఉన్నారో! కొంపదీసి ఆయన ఏదైనా మందు తాగెయ్యలేదు కదా!

వారు తనకి చేసిన ఉపకారానికి, వాళ్ళ కష్టసమయాలలో తను
ఆదుకోలేకపోయాడు. మరి సుబ్బలక్ష్మిగారి కిచ్చినమాట.

హైమవతమ్మ బయటికివచ్చి అడిగింది.

"టెలిగ్రాం ఎక్కడనుంచి?"

"పార్వతీపురంనుంచి. వినయభూషణంగారి భార్య చనిపోయిం
దట. ఆయన ప్రమాదస్థితిలో ఉన్నారట. వెంటనే రమ్మని కబురు.
పాపను ఎవరు చూసుకుంటున్నారో, చిన్నపిల్ల. నే వెళ్ళిరావాలమ్మా.
విమానంలో వెళ్ళాలి. డబ్బు...."

"అబ్బో! చాలా కావాలేమో!"

"అదేనమ్మా. నీ గొలుసు అమ్మిన మొత్తం.... తీసుకొచ్చా.
కలుచూసి నీకు చేయిద్దామని.... కాని...."

"కష్టకాలంలో ఆదుకున్నవాడు భగవంతుడు. మన ఎదుటకి
ప్రత్యక్షంగా రాడు. ఆ డబ్బు తీసుకెళ్లు. ఎప్పుడు వెళ్లాలి?"

"వెళ్ళి హోటల్‌నుంచి ఫోన్‌చేస్తా. సాయంకాలానికైనా
చేరాలి. టిక్కెట్టు విషయం కనుక్కోవాలి."

తన ఎడ్రసు ఒక కాగితంమీద వ్రాసి మరో అరగంటలో
బయలుదేరిపోయాడు శ్రీనాధ్.

ఒక బాటను నడవవలసిన జీవితాలు విడిపోగానే దారులూ
వేరయ్యాయి. భార్య మమత లోకవంక వెళుతుంటే భర్త, బాధ్యతలు

ఇంకొకవైపు నడుస్తున్నయ్.

మళ్ళీ ఇద్దరి జీవితాలూ కలుస్తాయా?

లేచి అద్దంలో ముఖం చూసుకుంటున్న జ్యోతికి ప్రతిబింబం తన ముఖంలా కనపడలేదు.

## 16

ఎయిర్‌పోర్ట్‌లో దిగేసరికి వర్క్‌షాప్ ఫోర్‌మెన్ కనిపించాడు శ్రీనాథ్‌కి. రెండున్నరగంటల్లో వచ్చేశారు భూషణంగారి కారులో పార్వతీపురం.

కళ్లుమూసుకుని నిద్రపోతోన్నట్టుంది సుబ్బలక్ష్మి. ఆమె ముక్కు వరకూ కప్పే ఉంది. నుదుట కుంకుమబొట్టు. కొయ్యపెట్టె అయిస్‌లో ఉంచారు ఆమె భౌతిక కాయాన్ని.

పాపవచ్చి కౌగలించుకుంది: "మావయ్యా, అమ్మ చచ్చి పోయింది."

ఏమనడానికీ తోచలేదు శ్రీనాథ్‌కి. మరి దేనికైనా సమాధానం చెప్పవచ్చు.

'చచ్చిపోయింది' ఈ మాటకు సమాధానం ఏమిటీ?

"డాక్టరుగారూ, భూషణంగారెలా ఉన్నారు? "ఇవతలికొచ్చి అడిగాడు.

"ఆమెను సాకుతూ తన ఆరోగ్యం పాడుచేసుకున్నారు చెబుతూనే ఉన్నాను. ఆమెకు రెండూ అలాంటి జబ్బులే వచ్చాయి లెప్రసీ, బ్లడ్‌క్యాన్సర్. మొదటిది చాలా రోజులనుంచీ ఉన్నా రెండవది ఈ మధ్యనే వచ్చింది. భూషణంగారికి హార్ట్ ఎటాక్ వచ్చింది. ఆఖరి కడక్షణాలలో ఆయన నేనిచ్చిన ఇంజక్షన్ మత్తులో నిద్రపోతున్నారు. మీరు వెళ్ళిన తరవాత నాకు ఫోన్‌చేశారు. మీరు వెళ్లిన వెంటనే సుబ్బలక్ష్మిగారి పరిస్థితి విషమించింది. అప్పటినుంచీ నేనిక్కడే ఉన్నాను. ఆస్థి విషయాల్లో లాయర్ సుదర్శనంగారు మీతో ఏవో మాటాడాలన్నారు. పాపా.... నేను ఇంటికి వెళతా. నాన్నగారికి తెలివివచ్చాక ఫోన్‌చేయండి. ఆయన్ని మంచంమీద నుంచి లేవనివ్వకండి."

ఫోర్‌మెన్ వచ్చాడు: "బాబూ, ఇలా రండి. అమ్మగారికి అంత్యక్రియలుచేసెయ్యాలి. డాక్టరుగారు, ఆయన మగతలోనే ఉండగా చేసెయ్యాలన్నారు...."

"మరిచాను. ఇదిగో ఉత్తరం." శ్రీనాథ్‌కి అందించారు ఒక ఉత్తరం.

భూషణంగారి దస్తూరిలో ఉంది ఉత్తరం. తను వెళ్లిన గంటకో గడియకో రాసి ఉండాలి ఉత్తరం.

"శ్రీనాథ్,

కిందటి సంవత్సరం ఈ రోజుల్లో నువ్వెవరివో నాకు తెలీదు. కాని నీమీద నమ్మకం ఏర్పడింది. సుబ్బలక్ష్మి నిన్ను తమ్ముడనే ప్రేమిస్తోంది. ఆమె నేను చనిపోవడం ఒకేసారి జరగాలనీ, జరుగుతుందనీ. అనుకుంటున్నాను. ఈ ఆస్థికి వారసురాలు పాప. దానిని పెంచి పెద్ద చేసే బాధ్యత నీదే. లాయరు సుదర్శనంగారి నడిగితే నేను చట్టబద్ధంగా రాయించి రిజిస్టరీ చేయించిన వీలునామా నీకు అందుతుంది.

ఎవరికి ఎలాంటి అనుబంధం ఏ క్షణంలో ఏర్పడుతుందో! నువ్వు పట్టుదలా, అభిమానమూ, కార్యదీక్ష ఉన్నవాడివన్న విశ్వాసంతో నీమీద ఇంత బాధ్యతను పెడుతున్నాను. విశాలమైన మనస్సున్న నీకు ఇది పెద్ద బాధ్యతగా తోచదనే నా నమ్మకం.

వినయభూషణం."

శ్రీనాథ్ ఉత్తరం చదువుతుండగా హడావుడిగా భూషణం గారున్న గదిలోకి పరిగెత్తాడు.

"రెండు రాత్రులు ఉంచడం అసాధ్యం. వెంటనే పని ప్రారంభించాను."

ఫోర్‌మెన్ చెప్పాడు.

గదిలోంచి డాక్టరుగారు వచ్చారు.

"ఆయన స్థితి ఇంకా ప్రమాదకరంగానే ఉంది. ఆయనకు తెలివిరాకముందే ఈ పనిని పూర్తిచెయ్యాలి. మీ మాటకోసమే ఎదురు చూస్తున్నారు వీళ్ళంతా."

ఒక్క నిముషం ఆలోచించాడు శ్రీనాథ్.

"కర్మ చేయడానికి నేను పూనుకుంటున్నా!"

అతని మాటవిని బయటికి వెళ్లాడు ఫోర్‌మెన్.

సూర్యాస్తమయం అయ్యేసరికి అంతా జరిగిపోయింది. ఎక్కడి వాళ్ల అక్కడికి వెళ్లిపోయారు.

వంటమనిషి, పాప, శ్రీనాథ్ ముగ్గురూ భూషణంగారి దగ్గరే ఉన్నారు. పాప పుస్తకంలో పేజీలు తిరగవేస్తున్నాడు శ్రీనాథ్.

చిన్నతనంలో తను చదువుకున్న పద్యం కనపడింది. టెన్నిసన్‌వ్రాసిన "హోమ్ దే బ్రాట్ హెర్ సోల్జర్ డెడ్!"

ఏనాడో చదువుకున్నది. మళ్లీ కళ్లు చెమర్చాయి. రాత్రంతా అలానే కూచున్నాడు. ప్రశాంతంగా నిద్రపోతున్నారు భూషణంగారు.

తెల్లవారుతుండగా ఆయనకు తెలివివచ్చింది. ఫోన్‌చేస్తే డాక్టర్‌గారు వచ్చారు.

"మీరు మాటాడకండి. పూర్తి విశ్రాంతి కావాలి మీకు."

పది పదకొండు రోజులకర్మ యధావిధిగా జరిపించబడింది. గోదానమూ, భూదానమూ, హిరణ్యదానమూ, పురోహితులు చెప్పినట్టు చేయించేశాడు శ్రీనాథ్.

పూర్తిగా తెలివి వచ్చినా భూషణంగారు మాటాడలేదు. శ్రీనాథ్ కాని పాపకాని సుబ్బలక్ష్మి ప్రస్తావన చెయ్యలేదు ఆయన దగ్గర.

రాత్రి ఎనిమిదయింది.

పాప పుస్తకం పట్టుకొని శ్రీనాథ్ దగ్గరకు వచ్చింది.

"మావయ్యా, పాఠం చెప్పవా?"

"నాన్నగారు నిద్రపోతున్నారమ్మా! మెల్లగా మాటాడు. ఏ పాఠం చెప్పమంటావ్? ఇంతకీ నాకు అట్టే చదువురాదు."

"నీకొచ్చు. ఈ పద్యం చదివి అర్ధంచెప్పు. ఇది ఇంటి దగ్గర చదువుకోమని సిస్టర్ తెరీసా చెప్పారు. నేను చదివాను నాకు అర్ధం కాలేదు."

"సరే చెబుతా, రా!" మెల్లగా పద్యం చదివాడు.

క్రిస్టియన్ మిషనరీ స్కూల్లో ఫాదర్ చెప్పిన పాఠం చదవడం

లోనే కరుణరసం ఒలికిస్తూ చదివించారాయన. ఇప్పటికీ ఆయన ముఖం కళ్ళకు కట్టినట్టుంది.

పద్యం చదివి క్లుప్తంగా కథ చెప్పాడు.

"యుద్ధంలో మృతిచెందిన ఒక వీరుణ్ణి ఇంటికి తీసుకొచ్చారు. అతని భార్య స్పృహతప్పింది. ఆమె గుండె పగిలింది. దుఃఖంతో దిగ్భ్రాంతి చెందింది. ఆమె కంట కన్నీరొలకకపోతే ఆమె కూడా చనిపోతుంది.

అనేకమైన ప్రయత్నాలు చేశారు.

లాభంలేకపోయింది.

చివరకు ఆమె పసికూనను దాది తీసుకొచ్చింది. వెల్లువలా ఆమె దుఃఖం పొంగుకొచ్చింది. పాపా, నీ కోసం నేబ్రతుకతానంది.

ఈ పద్యంలోని సారాంశం విడమర్చడం ప్రారంభించాడు శ్రీనాథ్. యోధుడు చనిపోయిన దుఃఖంతో అతని భార్య చనిపో తుందని అందరూ అనుకున్నారు. భర్తపోయిన తరువాత భార్యకి వైరాగ్యం కలగడం సహజం. జీవితంమీద విరక్తి పుడుతుంది, కాని యోధుని భార్య చనిపోతే, ఆమె బిడ్డను చూసేదెవరు? ఆమె తన బిడ్డ కోసం బ్రతికిందని చెప్పడంకోసం కవి ఈ పద్యం చెప్పాడు."

గది ముందు శ్రీనాథ్ చెబుతున్న మాటలు విని భూషణం గారు మంచందిగి గది ద్వారం వరకూ మెల్లగా వచ్చి పాపవంక చూస్తున్నారు.

శ్రీనాథ్ కదలిక గుర్తెరిగి తలపక్కకి తిప్పిచూశాడు. ఆయనను ఓదార్చే శక్తి తనకు లేదు. కొన్ని సమయాల్లో ఓదార్పు మాటలు ఊరటనియ్యవ్ సరికదా, మనస్సుకి ఇంకా బాధను కలగ చేస్తాయి.

శ్రీనాథ్ మౌనం, పాప అతనిమీద చూపిస్తున్న గౌరవం, అభిమానం చూపి ఊరట చెందారు భూషణంగారు. మాటాడకుండా వెళ్ళి మంచంమీద పడుకున్నారు.

* * *

మెల్ల మెల్లగా వర్క్‌షాప్ పనిచూసుకోవడం ప్రారంభించాడు

శ్రీనాథ్. రోజులూ, వారాలూ గడుస్తున్నాయ్.

"నాన్న పిలుస్తున్నారు నిన్ను" శ్రీనాథ్ దగ్గరకు పరిగెత్తి వచ్చి చెప్పింది పాప. ఎందుకో అని ఆత్రంగా వెళ్ళాడు.

"శ్రీనాథ్ నువ్ నన్ను క్షమించాలి. కష్టం నా మనసులో స్వార్థాన్ని నింపిందేమో! చావనూ లేక బ్రతకనూలేక ఇలా పడి వున్నాను. నువ్ నీ కుటుంబాన్ని వెంటనే వెళ్ళి తీసుకుని వచ్చెయ్. నువ్వు నా దగ్గర ఉంటే నాకెంతో తృప్తి, ఆనందమూ! నీ కుటుంబానికి నువ్ దూరమవుతుండడం ఇక నేను సహించను. నువ్ రేపే బయలుదేరి వెళ్లు. వర్క్‌షాప్ పని నే చూసుకుంటా."

"అందుకే నేవెళ్ళను. మీ ఆరోగ్యం ఇంకా కుదుటపడలేదు. ఓ రెండు నెలలుపోయాక వెళ్ళి వాళ్ళను తీసుకొచ్చేస్తా?"

"పోనీ, నేను వర్క్‌షాప్‌కి వెళ్ళను. నువ్‌వెళ్ళు. ఫోర్‌మెన్ అన్నీ చూసుకుంటాడు. ఎన్నిరోజులు. మూడు నాలుగు రోజుల్లో వచ్చెయ్యవచ్చు. నేను మాట ఇస్తున్నా. నేను ఇల్లు కదలను. మంచం దిగను. సరేనా?"

"వద్దు నన్ను వెళ్ళమనకండి."

"ఎందుకని?"

"మీకు పూర్తిగా స్వస్థత చిక్కేవరకూ నేను ఊరువదలను."

"నువ్ పొరపాటు పడుతున్నావ్! నేను ఆత్మహత్య చేసుకుంటానేమోనని భయపడుతున్నావ్. ఆ క్షణం దాటిపోయింది. ప్రాణం తీసుకోడం అంత సులువైనపనికాదు. ఆ యోధుడి భార్య ఎందుకు బ్రతికింది. నేనూ అలానే బ్రతకుతాను. అది నా నిశ్చయం. నువ్వెళ్ళి వెంటనే నీ కుటుంబాన్ని తెచ్చుకో. పాపా నేనూ నీ కోసం, నీ వాళ్ళకోసం ఎదురుచూస్తూ ఉంటాం."

## 17

మూర్తి ఉత్తరం రాశాడు జ్యోతికి నిన్ను చూడాలని ఉందంటూ.

"మీమీద నాకు అసహ్యం వేస్తోంది. మిమ్మల్ని నేను కోరే కడపటి కోరిక, మీరు నాతో మాటాడకండి. ఉత్తరాలద్వారానయినా

సరే....నాకోసం ఆలోచించకండి. లక్షణంగా సంసారం చేసుకోండి. చెడితే బాగుపడలేనిది ఒక్కటే — ఆడది. చెడినవానిని చెడినట్టు వది లెయ్యండి. మీ శ్రీదేవీగారికి నేనెంతో ఋణపడి ఉన్నాను. ఎప్పుడైనా వీలు చూసుకుని ఆమెకు చెప్పండి, నా ధన్యవాదాలు. నా కళ్ళు తెరి పించిందామె. శెలవ్."

జ్యోతి వెంటనే బదులు రాసేసింది.

మూర్తి తన జీవితంలోంచి ఎప్పుడో వెళ్ళిపోయాడు. కాని తన జీవితంలోకి మళ్ళీ రావాలనుకుంటున్న శ్రీనాథ్‌కు తను ఇవ్వ గలిగినదేమిటి? తనని తను మోసం చేసుకుని, భర్తనూ మోసం చేసి ఏదీ జరగనట్టు జీవితాన్ని పాత రాస్తాలోకి తీసుకువెళ్ళడం సాధ్యమేనా?

ఆలోచనలు నలుదిక్కులా మనసుని లాగుతున్నాయ్. ఎటూ ఓ నిశ్చయానికి రాలేకపోతున్నది. ఒక క్షణంలో పరిష్కారం ఎదురుగా కనిపిస్తోంది. మరుక్షణంలో మళ్ళీ సందేహం.

శ్రీనాథ్ తనమీద చూపుతున్న ఆపేక్ష మరీ బాధాకరంగా ఉంది. తను చూపించిన నిర్లక్ష్యవైఖరికి ఇది ప్రతీకారమా? అయితే చాలా శక్తివంతమైనదే!

అతని ఆపేక్షలోని ఆంతర్యం ఏదైనా, తనేమనుకున్నా, తను ఏం చేసినా, పోయిన తన అర్హతను తిరిగి సంపాయించడ అసాధ్యం. లోకం శంకించినంత మాత్రాన మహా పతివ్రత అగ్ని ప్రవేశం చేసింది. మరి తనో, అదే సంస్కృతికి వారసురాలు— అక్కడే పుట్టిన మనిషి. శీలం, నడవడి, మానం, కేవలం మాటలని అనుకుంది శీలం పోయేవరకూ. వ్యక్తికి సుఖసంతోషాలను అను భవించే హక్కు ఉందని, అది జన్మతః వచ్చినదనీ తన జీవితం ఇష్టం వచ్చినట్టు మలుచుకునే శక్తి ఆర్థికంగానూ, మానసికంగానూ ఉందనీ సంఘం నడవడికి సంబంధించి చేసిన కట్టుబాట్లను లెక్క చెయ్య నక్కరలేదనీ అనుకుంది. అహంకారంతో విర్రవీగింది.

శ్రీనాథ్ తనను హింసిస్తే తన పాపానికి నిష్కృతి ఉంటుందేమో! కాని శ్రీనాథ్ సజ్జనుడు....ఆరోజు ఎలాగో తప్పి

పోయింది. తను ఎదురుచూపిన సంఘర్షణ. మళ్ళీ ఆ సందిగ్ధ స్థితి ఎదురవక తప్పదు. మరి ఎలా?

గోరుచుట్టు, రోకలిపోటు....మనసు పీకు.

తనను వెదుక్కుంటూ వచ్చాడు శ్యామ్.

"జ్యోతీ, నిన్ను మరిచిపోలేక పోతున్నాను. ఆరునెలలు ఆగాక, మూడునెలలే ఆగమన్నావ్—అప్పటికీ నన్ను చేసుకుంటానంటే సిద్ధమేనన్నావ్. నువ్ నీ మాట నిలబెట్టుకుంటావని వచ్చాను. నువ్ లేకుండా నే బ్రతకలేను...."

భగవాన్, ఇదేం పరీక్ష!

తన రూపం చూసి ఇలా వెంటపడుతున్నాడు, ఈ వెర్రి బాగులవాడు. అతనికేం సమాధానం చెప్పాలి? ఎలా చెబితే అతను వింటాడు?

మహాశయా, నా భర్త వెనక్కి వచ్చాడు. ఆయనదగ్గర విడాకులు తీసుకోకుండా నేను మిమ్మల్ని పెళ్ళాడడం అసంభవం. భర్తకిద్దరు భార్యలుండకూడదన్న నియమంలోనే భార్య కిద్దరు భర్తలుండకూడదన్న ఆంక్ష అంతర్లీనమై ఉంది.

నేను ఎలాంటి సుగుణశీలినో నా భర్తకు తెలుసు. నా పతనానికి ఆయన అసమర్థత కారణమని ఆయన విశ్వాసం. సమర్థత నిరూపించుటకు తిరిగివచ్చారు.

ఒకవంక నువ్వూ, మరో వంక మూర్తీ, ఇంకోవంక కట్టుకున్న భర్తా ముగ్గురూ నన్ను పంచుకోండి.

పాపపుణ్యాలు నిర్ణయించేది ఒక స్థాయి తరువాత మనం కాదు. శిక్షలూ, బహుమానాలూ మన చేతుల్లో లేవు. ఆత్మనిగ్రహమూ, స్వయం సంయమనమూ, ఇవే మన చేతిలో ఉన్నవి.

ఇవన్నీ ఆ శ్యామ్ అర్థం చేసుకోలేని జ్వరంలో ఉన్నాడు. ఒక్క-క్షణంలో తన నిర్ణయాన్ని చెప్పింది జ్యోతి.

"రేపు సాయంకాలంవరకూ నాకు వ్యవధి కావాలి."

ఆ మాటకే సంబరపడి వెళ్ళాడు శ్యామ్.

రెండురోజులు ఆలోచించుకోవాలనుకున్న జ్యోతికి అంత

సమయం కూడా దొరకలేదు. ఆ మరునటిరోజు ఉదయాన్నే వచ్చాడు శ్రీనాథ్.

వచ్చినదే తడవు తనను శెలవు పెట్టమనీ, చెప్పవలసినవీ, చెయ్యవలసినవీ చాలా ఉన్నాయనీ చెప్పాడు. ఎలా కాదనాలో తెలియ లేదు జ్యోతికి.

"ఈరోజు వెళ్ళి రేపటినుంచి శెలవ్ పెడతా!"

హైమవతమ్మతో చెప్పి ఆఫీసుకి వెళ్ళిపోయింది.

శ్రీనాథ్ శరీరం గగుర్పాటు చెందింది. కొత్తగా చిన్న తనంలోలా రక్తం ఉరకవేసింది. జ్యోతి తన భార్య. అది ఎన్నటికీ మారని సత్యం.

ఆఫీసునుంచి నాలుగింటికే ఇంటికి వచ్చిన జ్యోతి తలనొప్పని పడుకుంది.

కిరణ్‌తో బజారుకు వెళ్ళివచ్చి తల్లి వడ్డిస్తుంటే మాటాడుతూ తాపీగా భోజనం చేసి గదిలోకి వచ్చిన శ్రీనాథ్ ఆమెవంక ఓసారి చూసి తుళ్ళిపడ్డాడు. జ్యోతి పడుకోవడంలో ఏదో అసహజత్వం కనపడింది. ఖంగారుగా జ్యోతిని తట్టిలేపేందుకు ప్రయత్నంచేశాడు. మత్తుగా మూలిగింది తప్ప కదలలేదు జ్యోతి. ఆందోళనగా జ్యోతిని బలంగా కుదుపుతూ లేపసాగాడు. ఆ కదలికలో దిండు క్రిందనుంచి జారిపడింది ఖాళీగా వున్న స్లీపింగ్‌పిల్స్ సీసా. దాంతోపాటు ఓ కవరూ,

తల్లిని పిలిచి తను టాక్సీకోసం పరుగెత్తాడు శ్రీనాథ్.

డాక్టరు జ్యోతిని పరీక్షించి ఖంగారులేదని చెప్పాడు. స్టమక్ వాష్ చెయ్యాలని చెప్పాడు. బాధతో విలవిలలాడుతూ జ్యోతి పెడుతున్న కేకలు రూంలోంచి వినపడుతుండగా వణుకుతున్న చేతుల్తో జేబులోని కవరు విప్పాడు శ్రీనాథ్.

శ్రీవారికి!

చివరిసారిగా ఇలా అనడానికి అనుమతిస్తే నన్ను మీరు క్షమించినట్టే!

పందికొక్కును ఎలా చంపుతాం? విషమిచ్చి.

విషం తాగి వెళ్ళిపోతున్నా! నేచేసిన పాపంకంటె తియ్యగా ఉంది. ఈ శిక్ష చాలదేమో!

నా గురించి దుఃఖించకండి. కనీసం విచారించకండి. పంది కొక్కును చంపితే ఉబ్బసరోగం వస్తుందంటారు. చంపరు. నేనే చంపుకుంటున్నా!

పోలీసువాళ్ళకి, ఈ, నా చావుకి బాధ్యులెవరూ కారని ఉత్తరం రాసిపెట్టా.

చేదు మనసుకెక్కి విషం తాగాలనిపించింది.

ఇక మనమాట!

నన్ను మీరు పూర్తిగా మర్చిపోండి అంటే కృతకంగా, పేలవంగా నాటకంలా ఉంటుంది. నాటకాలే నిజమేమో! లేకపోతే నిజమే నాటకమా? నిజ జీవితంలో మనుషులు చేసే పనులు నాటకాల్లో పాత్రలు చెయ్యవు.

నా మాటకి మీరు ఏనాడు ఎదురుచెప్పలేదు. అది నామీద విశ్వాసం వల్లననీ, అనురాగంవల్లననీ నేను తెలుసుకొనేసరికి చాలా ఆలస్యం అయిపోయింది. పరిస్థితి చెయిజారిపోయింది. నాకడ కోరిక కాదనకండి.

నా శరీరానికి శాస్త్రోక్తంగా దహన సంస్కారాలుచేస్తే నేను పవిత్రురాలినైపోతాను. అదివద్దు.

ఆశించడానికైనా అర్హతలు ఉండాలిగదా. నాన్నగారికికాని, పృథ్వికికాని, కామాక్షికికాని, నా మరణవార్త తెలియపరచకండి. ప్రసాద్‌ని మనిషిగా చెయ్యండి.

క్షమించమని అడిగే శక్తిలేని
మీ భార్య
జ్యోతి

ఉత్తరం చదివిన శ్రీనాధ్ జ్యోతిపై జాలిపడ్డాడు. అతనికి పంలేదు. సాయంత్రానికి జ్యోతి ఇంటికి తీసుకెళ్ళారు. పోలీసుల పడవలేకుండా షీల్డ్ చేశాడు జాలిపడ్డ డాక్టరు.

రాత్రి గడిచింది. తెల్లవారింది. మరోగంటకి ఎండావచ్చింది.

ది.   'న వచ్చింది. ఒక పక్క ఎండ మరోపక్క వాన.
'క ..టి దగ్గరనుంచుని రోడ్డువంక చూస్తోంది జ్యోతి.

వానను లెక్కచెయ్యకుండా వడివడిగా నడుస్తున్నారు ప్రజలు. చిన్నా, పెద్దా, ఆడా, మగా విచక్షణలేకుండా అందరి మీద కురుస్తోంది వాన. మనుషుల మనసులోని ఆలోచన వానకి అనవసరం. బైటకు వచ్చిన వాళ్ళందరినీ తడిపివేయడమే వాన ధర్మం. తన ధర్మం తాను నిర్వర్తిస్తోంది.

వాన పెద్దదైంది. తలుపు చప్పుడవగా అటు చూసింది జ్యోతి. వచ్చింది శ్రీనాథ్. అతన్ని చూడలేకపోయింది. చేతుల్లో ముఖం పెట్టుకొని కుమిలిపోయింది. శ్రీనాథ్ జ్యోతిదగ్గరకొచ్చాడు. ప్రేమగా ఆమె తలపైచేయివేసి నిమిరాడు తట్టుకోలేకపోయింది జ్యోతి. "నన్నెందుకు చావనివ్వలేదు" అంటూ ఘొల్లుమంది. ఆమెను సొదవి పట్టి తన కౌగిలిలోకి చేర్చుకొన్నాడు.

రోడ్డుమీద క్షణంకాలం నిలిచిన నీటిలో దబ్బుదబ్బున పడుతున్న చినుకులతో బుడుగలు లేస్తున్నాయి.

పడమటనుంచి పడుతున్న సూర్యకాంతిలో నీటి బుడగలు అంత ఎత్తున లేచి నీటి కిరీటాల్లా జిగ్గున విచ్చుకుంటున్నాయి.

భర్త కౌగిట కొంచెం ఊరడిల్లింది జ్యోతి. బైటకు చూపిస్తూ అన్నాడు శ్రీనాథ్.

"చూశావా జ్యోతీ! నీటిలోపడ్డ వాన చినుకు బుడగలాలేచి కిరీటంలా విడిపోవడంలేదూ! అవే నీటి కిరీటాలు. ఎంత జిగ్గుమంటు న్నాయో! జీవితంలో మన చేతుల్లోలేని కొన్ని పరిస్థితులు వాన చినుకుల్లా మనజీవితాలలో పడుతుంటాయి. దాని ఫలితంగా చెయ్య గూడని పనులనే బుడగలు లేస్తుంటాయి. కాని శాశ్వతమైన జీవితాన్ని, అశాశ్వతమైన బుడగల కారణంగా అంతం చేసుకోవడం తప్పుకదూ!" వాన ఉధృతం తగ్గింది, అయినా పెద్ద పెద్ద చినుకులు పడుతున్నాయి.

భర్తవంక చూసిన జ్యోతి ఆవేశం ఆపుకోలేకపోయి
భర్త కాళ్ళపైకి జారిపోతూ నాకు పునర్జన్మనిస్తున్నారు. మీరు న
భర్తేకాదు. నాకు ప్రాణమిస్తున్న దైవం మీరు...." అంది.

ధైర్యం చెబుతున్నట్లు ఆమె భుజంపైన చెయ్యివేశాడ
శ్రీనాథ్.

* * *

ఆ మర్నాడే హైదరాబాద్ నుంచి బయల్దేరిన రైలులో జ్యోతి, కొత్త జీవితంవైపు బయల్దేరింది—ప్రక్కన భర్త, ఒడిలో కొడుకు ఎదురుగా ప్రేమగా చూస్తున్న అత్తగారూ ఉండగా.





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M104 |
| పుస్తకం పేరు | జ్యోతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 129 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Rukshana |
| స్కాన్ చేసినది | ch Ramya |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |